# ముందుమాట

మహాభారతంలో యయాతి, అతని కూతురు మాధవిల చరిత్ర ఉపకథగా వస్తుంది. విశ్వామిత్రుని శిష్యుడు గాలవమునికి గురుదక్షిణ ఇవ్వటానికి సహాయం చెయ్యమని కోరుతూ యయాతి వద్దకు వస్తాడు. అతనికి సహాయపడటం కోసం యయాతి తన కూతురు మాధవినే గాలవమునికి దానంగా ఇచ్చివేస్తాడు. రాజకుమార్తెగా కష్టాల గాలి సోకకుండా పెరిగిన మాధవి ఆ తర్వాత అనుభవించే బాధలే ఈ నవలకు కథా వస్తువు.

ఇక్కడ మాధవిని అన్ని కాలాల్లోని పీడిత స్త్రీకి చిహ్నంగా వాడుకున్నాను. ఆమె రాజకుమార్తైనా సామాన్య స్త్రీలాగా అన్ని కష్టనష్టాలను అనుభవించింది. పురుషుని దౌర్జన్యానికి, క్రూరత్వానికి బలి అయింది. స్వాతంత్ర్యాన్ని కోరే తన నిస్సహాయ పరిస్థితికి విరుద్ధంగా తిరుగుబాటు చేసే మాధవి మనోధర్మం పీడిత జనాంగ మంతటా కనిపిస్తుంది. ఈ నవలలో కనిపించే మిగిలిన పాత్రలు — దివోదాసు, హర్యశ్వుడు, ఉశీనరుడు, విశ్వామిత్రుడు, గాలవుడు వీరందరూ మన సమాజంలో ఇప్పుడుకూడా కనిపించే కృత్రిమ వేషాల వెనకాల దాక్కున్న స్వార్థపరుల ప్రతిరూపాలు.

ఈ కథ క్రీ.పూ. 1300 సంవత్సరాలకు ముందు జరిగి వుండవచ్చును. ఈ నవలను రాసేటప్పుడు, ఆనాటి సమాజపు తీరు తెన్నులనూ, సమాజవ్యవస్థను కూలంకషముగా అధ్యయనం చేసాను. నేను నమ్మిన వైజ్ఞానిక సత్యాలకు లోబడి ఆనాటి సమాజ వ్యవస్థను విశ్లేషించాను. అందువల్లనే ఈ నవలలో మానవాతీత అంశాలనుగానీ, అద్భుతాలను గానీ చిత్రించలేదు. మాధవి పాత్రతో మొదలుకొని ఏ పాత్రనూ కూడా నేను ఆదర్శపాత్రగా సృష్టించలేదు. దీనిలోని పాత్రలన్నీ కూడా మానవసహజమైన దౌర్బల్యాలకు, జటిలతకు లోనయినవే. ఆనాటి వర్ణసమాజపు ప్రతినిధులై ఆనాటి సమాజ వ్యవస్థకు తగినట్టే ప్రవర్తించారు. ఈ సత్యాన్ని దృష్టిలో పెట్టుకుని చదువరులు ఈ నవలను చదవాలని నా మనవి.

నా ఈ కన్నడ నవల తెలుగులో ప్రచురింపబడటం నాకెంతో సంతోషాన్ని కలగ చేస్తోంది. దీన్ని వెలువరిస్తున్న విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి, అనువాదకురాలు శ్రీమతి కళ్యాణి గారికి నా కృతజ్ఞతలు.

బెంగుళూరు
1-1-78

అనుపమా నిరంజన

# ముందుమాట

మాధవి నవలా రచనకు ప్రేరేపణ పేరెన్నికగన్న సమాజ శాస్త్రజ్ఞులు శ్రీమతి ఇరావతి కర్వేగారి పుస్తకం యుగాంతం. ఆ పుస్తకం చదివినప్పుడు నాకు పురాణాల్లోని వ్యక్తులనూ, అనాటి సమాజాన్ని వైజ్ఞానికంగా సమీక్షించడం సాధ్యం, అవసరం అని అనిపించింది. యుగాంతం తర్వాత నేను చదివిన పుస్తకం శ్రీపాద అమృతడాంగే గారి India from Primitive Communism to Slavery. డాంగే గారిది మార్క్సవాద దృక్పథంతో విరచితమయిన కృతి. ప్రాచీన భారత సమాజం గురించి వాస్తవ చిత్రాన్ని తెలుసుకోవటంలో ఈ రెండు పుస్తకాలు నాకు ఎంతో సహాయ పడ్డాయి.

"వెట్టి చాకిరీ అమలులో ఉన్న సమాజంలో ఆడదాన్ని కొనుక్కోవటం, అమ్మటం, దానం చేయటం చాలా సామాన్యమయిన విషయాలు. యయాతి ఈ విధంగా తన కూతుర్ని అద్దె కివ్వటం మహాభారతంలోని ఉద్యోగపర్వంలోని, గాలవ ఋషి కథలో చెప్పబడింది" అన్న మాటను శ్రీ డాంగేగారి పుస్తకంలో చదివాను. ఇది నిరంజనగారితో చెబితే మాధవిని నాయికగా చేసుకుని నవల రాస్తే బాగుంటుంది అన్నారు.

ఆలోచించిన కొద్దీ మాధవి పీడిత స్త్రీ జాతికి ప్రతీకగా తోచింది. నా మనసు వాకర్షించింది. అలాంటి పాత్రచిత్రణకు మొదటి మెట్టుగా పురాణ గ్రంథాల్ని అధ్యయనం చేయసాగాను. మహాభారతం ఉద్యోగపర్వంలోని 114, 117, 118, 119, 120 అధ్యాయాలలో మాధవిని గురించి ఎక్కువగా ప్రస్తావన ఉండటాన్ని గమనించాను. మాధవి జీవితంలో వచ్చే ముఖ్యమయిన వ్యక్తులు గాలవుడు, విశ్వామిత్రుడు, యయాతి, దివోదాసు, హర్యశ్వుడు, ఉశీనరుడు. వీళ్ళ గురించి మహాభారతంలోని ఉద్యోగపర్వంలోని 103, 107, 108, 115: ఆది పర్వంలోని 69, 78, 87: సభా పర్వంలోని 8: ద్రోణపర్వంలో 63: శాంతి పర్వంలోని 28: అనుశాసన పర్వంలోని 171 వ అధ్యాయాల్లో ప్రస్తావన ఉంది. ఈ సందర్భంలో శ్రీమతి మంజులా గురురాజారావుగారి సహాయంతో వయోవృద్ధులూ, సంస్కృత విద్వాంసులూ అయిన శ్రీ సుమతి అనంతాచార్‌గారి వద్దకు వెళ్ళాను. వారు నాకు

# III

కావాల్సిన శ్లోకా లన్నిటినీ తాళపత్రాలలో చదివి, కన్నడంలోకి అనువదించి పెట్టారు. మాధవి కథావస్తువుకి ఆధారం ఇది:

బహుశా క్రీ. పూ. 1000 లో జరిగిం దనుకుంటున్న దాయాదుల మధ్య కలహమే మహాభారతంలోని కథ. మాధవిది మహాభారతంలో వచ్చే ఉపకథ. కనుక అది క్రీ. పూ. 1000కి ముందే జరిగి వుండాలి. యయాతి కురువంశపు మూల పురుషుడు. ఇతడికి భీష్ముడికి మధ్య ఆరుతరాల అంతరం ఉంది. ఇవన్నీ ఆలోచిస్తే మాధవి కథ మహాభారతంలోని సంఘటనలకు మూడు శతాబ్దాల క్రితం నడిచింది అని మనం ఊహించవచ్చు.

ఆ కాలపు సమాజపు నీతి నియమాలను అర్థం చేసుకోవటానికి ఆనాటి సమాజ వ్యవస్థ గురించి ఓ రెండు మాటలు ఇక్కడ చెప్పాలి. ఆదిమానవులలో మొదట్లో సంసారం మాతృ ప్రధానమై ఉండేది. ఇంటి బయటా, లోపలా చాకిరీకి సమానమయిన గౌరవం లభించేది కనుక స్త్రీ పురుషుల్లో సమానత్వం ఉండేది. కాని ఉత్పత్తి పెరిగిన కొద్దీ, ఉత్పాదన మార్గాలు కఠినమయి, సంసారంలో స్త్రీకి ప్రాధాన్యం పోయింది. పురుషుడు సర్వాధికారి అయ్యాడు. దీనికి మూలకారణం 'ఆస్తి' సంపాదన. ఓ రకంగా మనిషి దోచుకోవటం అన్నది మొదలయింది, ఆస్తి మూలంగానే. చాకిరీ చేసే బానిస ఎలా యజమాని కింద సేవకుడయ్యాడో అలాగే, ఆడది కూడా ఇంట్లో పనిచేసే బానిస అయింది. 'మహాభారతం' కాలానికే స్త్రీ పురుషుని 'ఆస్తి' అన్న భావం బలంగా వేళ్ళు నాటుకుంది. స్త్రీలను ప్రత్యేకంగా ఉంచే పద్ధతి గురించిన మొదటి లిఖిత సాక్ష్యాధారం క్రీ. పూ. నాలుగవ శతాబ్దంలో పాణిని రచించిన గ్రంథంలో ఉంది. ఈ పద్ధతి ప్రపంచంలో వెట్టి చాకిరీ అమలులో ఉన్న అన్ని సమాజాలలోని సామాన్య లక్షణం. సంస్థానాలను స్థాపించి పాలించే రాజులు సర్వాధికారులై, తమ రాజ్యంలోని అందరు ఆడవాళ్ళ మీద అధికారాన్ని చెలాయించేవారు. రాజవంశంలోని స్త్రీలను మాత్రం మగవారి కంటపడకుండా ప్రత్యేకమయిన అంతఃపురంలో ఉంచేవారు. సభలో మగవారితో కూర్చునే హక్కుకూడా లేదామెకు. పురుషుని కామ తృప్తికి స్త్రీ ఒక వస్తువు. ఆమె అలంకారం, మగవాడి కళ్ళకు అందంగా కామోద్దీపకంగా కనిపించాలి అనే ఉద్దేశంతోనే ఉండేది. భర్త తన భార్యను అమ్మవచ్చు, దానం చేయవచ్చు. పశువుల్లాగానే స్త్రీ విక్రయం కూడా జరిగేది. ఇది కూతురికి కూడా అన్వయించే నియమం.

# IV

అందువల్లనే యయాతి అంత సులభంగా దానం చేస్తాడు మాధవిని. గాలవుడు ఆమెను రాజులకు అద్దెకు ఇచ్చి తన గురుదక్షిణకు కావలసిన దాన్ని సంపాదిస్తాడు.

'నియోగ'పు పద్ధతి 'మహాభారతం' కాలంలో అమలులో ఉంది. నియోగం అంటే, భార్యను 'క్షేత్రం'గా చేసి వేరే పురుషుని వల్ల పుత్ర సంతానాన్ని పొందటం. కుంతికి పిల్లలు పుట్టింది ఇలాగే. మాధవి కూడా ఇలాగే పిల్లల్ని పొందటానికి క్షేత్రంగా ఉపయోగింపబడింది. విలువలే సంకుచితమయినవి కావటంతో, తాము అబలలైన స్త్రీలను హింసిస్తున్నామన్న ఆలోచన పురుషులకు ఎప్పుడూ రాలేదు.

ఆ పీడిత సమాజంలో స్త్రీ ఎదురుతిరిగే ప్రశ్నే లేదు. పురుష ప్రధానమయిన ఆ సమాజంలో, ఏమి ఎలా అని అడిగే అధికారం స్త్రీకి లేదు. అలాంటి ప్రవర్తన చూపిన స్త్రీ మీద సమాజం యుద్ధాన్ని ప్రకటించేది స్త్రీ 'కర్తవ్యం' పిల్లలకు జన్మనివ్వటం మాత్రమే. అది ఎవరివల్ల, ఎట్లాగ అని ఆమె ప్రశ్నించటానికి వీల్లేదు. మగవారికి తమ త్యాగ విధేయతలతో శరణాగతులైన వాళ్ళు మాత్రమే 'ఆదర్శ మహిళలు' అనిపించుకునేవారు. ఉదా : సీత, సావిత్రి, ఏకపత్నీత్వం ఇప్పటికింకా ఆచరణలో లేదు కనుక పురుషుడు ఎంతమంది భార్యలనయినా పొందవచ్చు. ఎన్ని మార్లయినా పెళ్ళి చేసుకోవచ్చు. పెళ్ళిళ్ళ సంఖ్య ఎక్కువయిన కొద్దీ అతని పురుషత్వపు విలువ ఎక్కువయ్యేది. అదే కాకుండా అది రకరకాల వైవాహిక పద్ధతులు ప్రయోగాత్మకంగా జరుగుతున్న కాలం.

మొత్తానికి పితృ ప్రధానమయిన సంసారమే ఆ కాలపు సమాజానికి వెన్నెముక. అందుకనే మగపిల్లలకు కుటుంబంలో సహజంగానే ప్రాముఖ్యం ఉండేది. వర్ణ వ్యవస్థ అప్పుడే జన్మించింది. క్షత్రియులు, బ్రాహ్మణులు సమాజం మీద యాజమాన్యం పొందారు. తమ భుజ బలంతో క్షత్రియులు రాజ్యం ఏలి ఆ హక్కును వంశ పారంపర్యంగా పొందేవారు. యజ్ఞ యాగాదులు, పూజ, విద్యా దానాల హక్కు బ్రాహ్మణులది. వీరిలో కొంతమంది అడవి మధ్యలో గురుకులాలను స్థాపించి విద్యాదానం చేసేవారు. రాజుల నుండి ధన కనక సహాయం విపులంగా లభించేది. వైశ్యులు పొలం సాగుచేయటం మొదలైనవి చేసేవారు. ఈ వర్ణాల వ్యక్తులకు బానిసలుగా శూద్రులు ఉండేవారు. "అతడు ఏ కులానికి చెందినా

# V

సమాజంలో ఆమె స్థానం 'శూద్రు'లకు సమానంగా ఉండేది"— అన్నారు లండన్‌లోని భారతాధ్యయన ఆచార్యులు శ్రీ భాషామ్.

నేను అర్థం చేసుకున్న వైజ్ఞానిక సత్యాలకు బద్ధురాల్ని అయి నేను 'మాధవి' నవలను రచించాను. అందుకనే మానవాతీత శక్తులను గురించి ఈ నవలలో రాయలేదు. ఉదాహరణకు పుత్రకామేష్టి సమయంలో ఏ దేవతా పురుషుడూ పాయసపు గిన్నెతో అగ్నిలోంచి ఉద్భవించడు. అది ప్రజల భ్రమ కావచ్చు. లేదా మునులు సామాన్య జనుల్లో తమ పట్ల గౌరవం, భయం కలగాలని సృష్టించిన తంత్రమైనా కావచ్చు.

మూలంలో ఉన్న ఒక నమ్మలేని విషయాన్ని నేను నవలలో ఉపయోగించుకోలేదు. అది మాధవి చిన్న పిల్లగా ఉన్నప్పుడే, వేదపారంగతుడయిన వృద్ధ ఋషి ఒకడు యయాతి ఆస్థానానికి వస్తాడు, ఋషి మాధవి సేవకు ముగ్ధుడై "నువ్వు ఎన్నిమార్లు ప్రసవించినా, ప్రసవం అయిన కొన్ని రోజుల్లోనే కన్యాత్వాన్ని పొందుతావు" అని వరం ఇస్తాడు. యోని పటలం (Hymen) ఉన్నదే కన్య అని అందరికీ తెలిసిన విషయం. వివాహం తరువాత చీలిన యోనిపటలాన్ని మళ్ళీ సృష్టించటం సాధ్యంకాని పని. పిల్లలు పుట్టాక సాధారణంగా ఆడదాని రూపమే మారుతుంది. మాధవి పడ్డపాట్లు చూస్తే చివరికి ఆమె యౌవనం, కన్యావస్థ ఎంత మాత్రమూ మిగిలి ఉండదని స్పష్టమవుతుంది. ఈ వరాన్ని పరీక్షిస్తే మహాభారతంలోని కుంతి జ్ఞప్తికి వస్తుంది. బహుశా తరువాతి కాలంలో పురాణాల్ని రచించిన పుణ్యాత్ములు మాధవి ముందు ముందు స్వయంవరం చేసుకోదగ్గ స్త్రీ అనిపించటం కోసం ఈ వరాన్ని సృష్టించివుండాలి. అలాగే దానివల్ల మాధవికేమీ పెద్ద అన్యాయం కాలేదు అనే అభిప్రాయం కలగచేయటానికి ప్రయత్నించి ఉండాలి. ఈ కారణాల మూలంగా నేనా విషయాన్ని నవలలో వాడుకోలేదు.

మాధవి రాజకుమారిగా పుట్టినా సామాన్య స్త్రీ లాగానే కష్టనష్టాలను అనుభవించింది. పురుషుల ఆనాటి సమాజపు నిరంకుశత్వానికీ క్రూర ప్రవృత్తికీ గురి అయింది. మాధవి అభిప్రాయాలు, ప్రతిక్రియ అన్ని కాలాల్లోని స్త్రీలలో కనిపించేదే. పీడితజనాంగం తమ పరిస్థితులకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయటం సహజమయిన ప్రతిక్రియ. కాని దళితజనాంగపు తిరుగుబాటును శక్తిమంతులు

అణచివేస్తారు. అలాగే ఇక్కడా జరుగుతుంది. ఆత్మహత్య చేసుకోవటానికి కూడా హక్కులేదు మాధవికి. తండ్రి యయాతి ఆవుల్నీ, దూడల్నీ దానం చేసే లాగానే మాధవినీ దానం చేస్తాడు. తను మెచ్చని ముదిరాజులతో జీవించాల్సి వచ్చినా, ఆ జీవితం పట్ల అసహ్యం వేసినా ఆ సమాజధర్మం నుండి ఆమెకు విముక్తి లేదు. ఆఖరున యయాతి 'ఈప్సితుడయిన వాడిని ఎన్నుకో' అని స్వాతంత్ర్యం ఇచ్చి నప్పుడు ఆ మాట చాలా అర్థవిహీనంగా కనిపిస్తుంది. జీవితం పట్ల, మగవాడి నిరంకుశత్వం పట్ల తీవ్రమయిన అసహ్యం కలిగి మాధవి వారందరి మధ్య నుండి దూరంగా వెళ్ళిపోతుంది. ఇది మాధవి తిరుగుబాటు. ఈ సమరంలో వ్యక్తిగతమయిన గెలుపు ఆమెదే.

స్వాతంత్ర్యం కోరుకునే ఇలాంటి వ్యక్తి అన్ని కాలాల్లోనూ ఉండగలిగిన స్త్రీ మాత్రమే కాదు, మాధవి అన్ని కాలాల్లోని పీడిత స్త్రీ జాతి ప్రతినిధి కాగలదు అన్న అభిప్రాయం నాకు కలగటం మూలంగానే, ఆమె నా నవలకు ముఖ్య పాత్ర అయింది. మాధవిని ఇలాగ తిరుగుబాటుదారుగా చిత్రించటం కొందరికి నచ్చక పోవచ్చు. దేవుళ్ళ ప్రత్యక్షం కాని, అద్భుతాలు లేని ఈ పురాణ కథ మరి కొందరు పాఠకులకు నిరాశ కలిగించవచ్చు. ఇది సహజం. ఈ నవల రాసేటప్పుడు ఆనాటి సమాజపు నీతి నియమాలు సమాజ వ్యవస్థ మొదలైన వాటిని వైజ్ఞానిక దృష్టితో అధ్యయనం చేశాను. ఇది నాకు సహజమయిన పని. మాధవి చిత్రణ అర్థవంతం కావటానికి ఈ దృక్పథం కారణం అని నా దృఢమయిన నమ్మకం.

నవలలో నేను వాడిన వ్యావహారిక భాషని సమర్థించుకోవాల్సిన అవసరం ఎంతయినా వుంది. పురాణంలోని రాజులూ మునులూ ఎలా మాట్లాడారో మనలో ఎవరూ వినలేదు. వారి మాట తీరు ఎలా వుంది అనటానికి ఏ రకమయిన సాక్ష్యం లేదు. లిఖిత రూపంలో మహా భారతం సిద్ధమయింది క్రీ. శ. మూడవ శతాబ్దంలో. మహాభారతం గ్రంథ రూపంలో రాయబడే కాలానికి వ్యావహారికంలోని అందమాయమయి సంభాషణలు గ్రాంధికమయ్యాయి. ఇంతవరకూ కన్నడంలో ప్రకటింప బడిన పురాణ గ్రంథాల్లో రాజ మహారాజులు గ్రాంథిక భాషలో మాట్లాడినట్టుగా వ్రాయటంతో అదే నిజమన్న భ్రమతో వున్నారు మన పాఠకులు. రాజులే కాదు, సామాన్యులు కూడా ఇలాంటి భాష మాట్లాడే ప్రయోగం మన నవలల్లో

చాలా వాటిలో వుంది. రాజుగాని సామాన్యులుగాని ఈ భాషలో మాట్లాడరు అన్న అభిప్రాయంతో నా పాత్రల సంభాషణలకు గ్రాంథిక భాష ఉపయోగించలేదు. అందరూ వ్యావహారికంలోనే మాట్లాడతారు.

వేద పారంగతులయిన ఋషులు కూడా మానవ సహజమయిన దౌర్బల్యా లను జయించలేదు. ప్రవచనాలకు, ప్రవర్తనకు చాలా తేడా ఉండేది. ధర్మము, ఆత్మల గురించి జిజ్ఞాస చూపి చర్చలు జరిపే మునులు కూడా ఒక ఆడుల బాధని అర్థం చేసుకోలేదు అన్న విషయం చాలా శోచనీయం. శుక్లయజుర్వేద పండితు డికి కూడా గురుదక్షిణ చెల్లించటమే ముఖ్యం తాని. లక్ష్య సాధనకు అనుసరించే విధానం ముఖ్యం కాదు. తన స్వార్థాన్ని కప్పిపుచ్చుకోవటానికి పరలోకం. సద్గతి అని పెద్ద పెద్ద మాటలు మాట్లాడతాడు. చెల్లెళ్ళనీ భార్యల్నీ తమ స్వార్థానికి ఉపయోగించుకునేవాళ్ళు కొత్త రూపాల్లో ఇప్పటికీ మన సమాజంలో కనిస్తారు.

విశ్వామిత్రుడి గురించి పురాణాల్లో ఆదర్శకల్పనలే ఎక్కువ. అతడు మహా క్షత్రియుడు, రాజర్షి. కాని మాధవిని గాలవుడు అతని వద్దకు తీసుకుని వెళ్ళి నపుడు అతడు ఇలా అంటాడు:

"ఎనిమిది వందల గుర్రాలకు బదులుగా ఈ మాధవినే స్వీకరించండి అని ఆమెను నా వద్దకు తెచ్చి వదిలిపెడితే ఎంత బాగుండేది! నేనే ఆమెను అనుభ వించి ప్రపంచానికి శ్రేష్ఠులయిన నలుగురు పుత్రుల్ని పొందేవాడ్ని కదా!"

ఈ మాటలాడినది అరిషడ్వర్గాలను జయించిన వాడని పేరెన్నిక గన్న విశ్వామిత్రుడు. ఆవేళకు వృద్ధుడైన అతని పట్ల మాధవి మోహం చెందటం ఎలా సాధ్యం? ఇలాంటి వాళ్ళ పట్ల ఆమెకు అసహ్యం. రోత పుట్టటంలో ఏ రకమయిన సందేహమూ లేదు.

హర్యశ్వుడు, ఉశీనరుడు, దివోదాసుడు మొదలైన రాజుల ప్రవర్తన ఇంత కన్నా భిన్నంగా లేదు. వారి మాట, ప్రవర్తన చూస్తే మానవత్వమన్న మాటే మర్చిపోయి ప్రవర్తిస్తున్నారేమో అన్న అనుమానం వస్తుంది.

హర్యశ్వ డంటాడు:

"మునివర్యా, ఈ కన్యను చూసిన క్షణమే నేనామె పట్ల మోహితుడ నయ్యాను. కన్యాశుల్కంగా ఎంత ధనకనకాలు కావాలో చెప్పు."

మోహం, కామం, ప్రేమలకు వెల కడతారు వీళ్ళు. కన్యాశుల్కం ఇచ్చి కన్యను కొనుక్కునేవారు. తమ పని అయ్యాక ఆమెను అంతే నిరాసక్తితో ధర్మం

పేకతో బయటికి తోలెయ్యటానికి ఏమాత్రం వెనకాడరు. ఇలాంటివాళ్ళు ఆనాటి కుదాత్తులు, ధీరులూ, శూరులూ, ఆదర్శపురుషులు!! ఇంతమంది రాజుల్లో ఒక్క డయినా మాధవిపట్ల సానుభూతి చూపలేదు అంటే స్త్రీపట్ల ఎంత నికృష్టమయిన భావముండేది అన్నది స్పష్టమవుతుంది.

యయాతి మహారాజు ఏ తండ్రీ చెయ్యకూడని పని చేస్తాడు. ఒతడికి ఆ విష యం పట్ల ఏ రకమయిన పశ్చాత్తాపమూ లేదన్నది ఆశ్చర్యకరమయిన విషయం. మళ్ళీ మాధవి వెనక్కిరాదని అనుకుని ఉండాలి. మళ్ళీ ఆమె చటుక్కుని వచ్చి ఎదుట నిల్చునేసరికి అతని అంతరాత్మ పీకుతుంది. తనకు కలిగే పాపానికి పరి హారంగా ఆమె స్వయంవరం ఆలోచన చేస్తాడు. తన దుఃఖానికి కారణమయిన తండ్రిని క్షమించి, తగ వారందరి నుండి దూరమయి, మరో మాటలో చెప్పాలంటే పురుషజాతినే క్షమించి, తన ఔదార్యంతో మహామనీషిగా శోభిస్తుంది మాధవి.

నేను ఈ నవలలో ఎవర్నీ ఆదర్శవ్యక్తిగా చిత్రించ లేదు— మాధవితో సహా. ఇందులోని పాత్రలన్నీ మానవమాత్రులే. మానవులకు సహజమయిన దౌర్బ ల్యాలకూ, క్లిష్ట సమస్యలకూ లోనయిన వాళ్ళే. ఆనాటి వర్గ వ్యవస్థకు ప్రతినిధు లయి ఆ సమాజ వ్యవస్థకు తగినట్టుగా ప్రవర్తించారు. ఈ దృక్పథాన్ని ఆమో దించి, ఈ విషయంలో పాతనమ్మకాలకు ప్రభావితులు కాకుండా మాధవి నవలను చదవాలని నా విన్నపం.

• • • •

ఈ ఉపఖండంలో స్త్రీ దాస్యానికి విరుద్ధంగా మొదట ప్రతిఘటించింది మాధవి. ఇదే ధోరణిలో వున్న ఓ వార్త, ఈ పీడిత జాతి గురించినది 1976 ఆగస్టు నెలలో పత్రికల్లో వచ్చింది.

"దక్షిణ ఆర్కాట్ జిల్లాలోని కలరాయన్ కొండ ప్రాంతాల్లో నిన్న మొన్నటి వరకూ ఓ అమానుషమయిన పద్ధతి అమలులో ఉండేది. ఈ గిరిజనులు తమకు డబ్బు కావాల్సినపుడు మైదాన ప్రాంతాల్లోని వడ్డీ వ్యాపారుల వద్ద తమ భార్య లను తాకట్టు పెట్టేవారు. డబ్బు చెల్లించే వరకూ భార్య వ్యాపారస్తుని జనానాలో ఉండేది. ఆ కాలంలో పుట్టే పిల్లలు అప్పు పుచ్చుకున్న వాడికే చెందేవారు. కాని ఆడది మాత్రం అప్పు తీరేవరకూ కొత్త యజమాని వద్ద ఉండేది."

ఈ పద్ధతి ఇటీవలనే చట్ట విరుద్ధమయింది.

విజయదశమి–1977. **అనుపమా నిరంజన**

# 1

గంగా యమునా సంగమ స్థలంలో నిర్మించబడిన ప్రతిష్ఠానగరం చాలా అందమయినది. దాని రాజయిన యయాతి చాలా గొప్ప వీరుడు, సద్ధర్ముడు. అక్కడి ప్రజలు సంతృప్తితో సుఖంగా జీవితం గడిపేవారు. ఎన్నో కళలకు పేరెన్నిక గన్నారు. ఆ భూమి యుద్ధాలకూ, యజ్ఞ యాగాదులకు కూడా ప్రసిద్ధి చెందింది.

యయాతి రాజభవనం, గోపురానికి కలశంలా, ఊరికి మధ్యలో చాలా అందంగా వుంది. ఎత్తైన గోపురాలతో కూడిన ఆ రాజభవనం ముందరి భాగంలో ఆస్థాన మంటపం విశాలమయిన మొగసాల వున్నాయి. వెనుక భాగంలో అంతఃపురం వుంది. దాన్ని సైనికులు అప్రమత్తతతో కాపలా కాసేవారు. అంతఃపురం కుడిభాగంలో మహారాణి దేవయాని విశ్రాంతి మందిరం, శయనమందిరంవున్నాయి. ఎడం వేపున రాజకుమారి మాధవి నివాసం వుంది. రెండిటిమధ్యా సుందరమయిన ఉద్యానవనం ఉంది.

అప్పటికి అరుణోదయమయి జాము గడిచింది. రాకుమారి మాధవి చెలికత్తెలతో తోటలో విహరిస్తోంది. దేవకన్యలను సిగ్గిల చేసే అందంతో, రతీదేవిని మరపించే లావణ్యంతో మెరిసిపోతోందా కన్య. అన్ని శుభ లక్షణాలు కలిగిన ఆ పదహారేళ్ళ బాల ఛాయ పాలమీగడ ఛాయ. విశాలమయిన నుదురు, పొడుగాటి నల్లటి తలకట్టు, విశాల నేత్రాలు, సంపెంగలాంటి ముక్కు, దొండపళ్ళ రంగులో వున్న పెదవులు, అందమయిన వంపులతో కూడిన శరీరం ఆ మాధవిది.

మౌనంగా నడుస్తున్న మాధవితో చెలి చారునేత్ర "మాధవీ! ఆ అశోకవృక్షాన్ని చూడు" అంది.

పచ్చటి ఆకుల మధ్యలో ఎర్రటిపూలు. దాన్ని చూసిన మాధవి మొహంలో ఓ క్షణం చిరునవ్వు మెరసి మాయమయింది.

చారునేత్ర మాధవినీ అశోక వృక్షాన్నీ మార్చి మార్చి చూసింది.

రాకుమారి కట్టుకున్నది అశోక పుష్పాల్లాంటి ఎర్రటి పట్టుచీర. అలాంటిదే స్తనపట్టిక. దానిపైన పల్చటి పచ్చటి వల్లెవాటు. చెవిలో పూగమ్మ, మెడలో నవరత్నహారం, పాపిడిచేరు కిందనే కుంకుమ బొట్టు. బంగారపు వడ్డాణం, చేతికి మణికంకణం, కాలికి మువ్వల అందియలు. ఈ భువన మోహిని కెలాంటి విచార మబ్బా! ఎలాగయినా ఆమెను ఆనందింప చేయాలి అనుకుంటూ చారునేత్ర అంది.

"మాధవీ! కొలను వద్దకు పోదాం పద. అక్కడ కమలముఖి వీణను శ్రుతి చేసుకుంటోంది."

ఆ వనంలోని మామిడి, మొగలి, సంపెంగ, కలిగొట్టు చెట్లను దాటి పుష్కరిణి సమీపానికి వచ్చారు వారు. ఆ పుష్కరిణిలో తామరపువ్వులు విచ్చుకుని ఉన్నాయి. హంసలూ, సారస పక్షులు నీటిలో ఈదుతున్నాయి. మాధవి, చారు నేత్ర పక్కనే ఉన్న చంద్రకాంత శిలావేదిక మీద కూర్చున్నారు.

వీణతో మిగిలిన వాద్యాలు మేళవించాయి. ఓ గాయని మధురమైన కంఠ స్వరంతో భూపాలరాగాన్ని ఆలపించ సాగింది. చల్లగాలికి తోడయిన ఆ మధుర గానం మాధవిహృదయంలో ఎన్నో ఆలోచనలను రేకెత్తించింది. ఆ పాట మధురిమ అందర్నీ మైమరచేలా చేసింది. ఓ పాట ముగించిన గాయని, వేళావళి రాగాన్ని ఎత్తుకుంది.

మాధవి అటూ ఇటూ చూసి లేచింది.

"రాకుమారీ, ఇవాళ నీ మనసు సంగీతంపై లేదు" అంది చారునేత్ర.

మాధవి మౌనంగా ముందుకు నడిచింది.

"ఏమిటాలోచిస్తున్నావు ? లతా మంటపానికయినా వెడదామా ?"

"ఊఁ"

జాజి, మాలతీ లతలు అల్లుకున్న ఆ మంటపం పూల సువాసనలతో నిండి పోయింది.

ఆసనంపై కూర్చుంటూ మాధవి అంది:

"నిన్న మావా విషయం చెప్పినప్పటి నుండీ..."

"ఏదీ! ఆ స్వయంవరం విషయమేనా?"

[క్రితం రోజు సాయంకాలం మహారాణి దేవయాని చెలికత్తె హంసిని చారు నేత్ర చెవిలో ఓ మాట వేసింది.

"చారునేత్రా! ఓ రహస్యం ఎవరితోనూ చెప్పకు. మహారాజుగారు దేవయాని మహారాణీగారి వద్ద చెప్తూంటే నేను పక్కనే ఉండి విన్నాను. రాజకుమారి మాధవికి స్వయంవరమట."

"అవునా? ఎప్పుడూ?"

"ఇది కార్తీకం. మూణ్ణెల్ల తరువాత మాఘమాసంలో"

"నిజమేనా?"

"ఊం. భూమండలం లోని రాకుమారు లందర్నీ పిలుస్తారట. గంగా యమునా సంగమంలో పెద్ద స్వయంవర మంటపం నిర్మిస్తారుట."]

ఆ రహస్యాన్ని చారునేత్ర మాధవితోనూ, అవ్వతోనూ చెప్పింది. పుట్టుక తోనే తల్లిని పోగొట్టుకున్న మాధవిని పెంచి పెద్ద చేసిన అవ్వకి మహదానందం; మాధవికి సిగ్గూ, సంతోషం.

కాలిగోటితో నేలమీద రాస్తూకూర్చున్న మాధవి సిగ్గును గమనించి చారునేత్ర-

"రేపు నువ్వు మాలవేసి వరించే రాకుమారుడు ఎలా ఉండాలి? అని ఆలో చిస్తున్నావు కదూ?" అనడిగింది.

"ఊరుకో. అలా వేళాకోళం చేయకు."

"లేదులే. చెప్పు. ఎలా వుండాలి నీ రాకుమారుడు?"

మాధవి ముఖం ఎర్రబడింది. చారునేత్ర ఇంకా చెప్పమంది.

"అందంగా వుండాలి. సుకుమారంగా వుండాలి."

[కాంతిమంతమయిన శరీరం. యౌవన లావణ్యాలతో వెలిగిపోయే శరీరం. గాంభీర్యమే మూర్తీభవించిన వ్యక్తి. పెద్ద నుదురు. పెద్దకళ్లు, విశాలమయిన వక్షస్థలం. తలమీద కిరీటం. జాజ్వల్యమానమయిన కర్ణకుండలాలు, నుదుటి మీద కస్తూరి తిలకం, మెడలో ఆణి ముత్యాల పతకం, బాహుపురులు. భుజకీర్తులు, ముంజేతికి నవరత్నాల కంకణాలు, పట్టుపంచ - కలలోని రాకుమారుడు మాధవి కళ్ళముందు నిలిచాడు.]

మాధవి తలవంచి మాటలు కలిపింది.

"అతడు వీరుడూ, ఉదారుడూ, ధర్మపరుడూ, వినయశీలీ అయియుండాలి."

"ఈ గుణాలన్నీ కలిగిన వాడు ఈ ప్రపంచంలో దొరకుతాడా మాధవీ?"

"దొరకవచ్చును చారునేత్రా! అతడు ఏకపత్నీ వ్రతుడై వుండాలి. నన్ను తప్ప మరో స్త్రీని కన్నెత్తి కూడా చూడకూడదు."

"రాజుకి అంతఃపురంలో ఎంతమంది స్త్రీలుంటే అంత గొప్ప..."

"ఊహుఁ– నా రాకుమారుడలాంటి వాడు కాదు..."

చారునేత్ర గట్టిగా నవ్వనారంభించింది. "పెళ్ళికి ముందే నా రాకుమారుడని వాదించేస్తున్నావు. తర్వాతేం గతి?"

అలా మంటప ద్వారంలో ఎవరో నిలబడినట్టయి మాధవి తలెత్తింది.

"రాకుమారికి శుభం కలగాలి. మహారాణీగారు కబురు పెట్టారు" అంది దాసి హంసిని.

"ఎందుకని ?"

"లక్ష్మీపూజకు దేవాలయానికి వెళ్ళాలట."

మాధవి త్వరగా లేచింది. ఈరోజు కార్తీక శుద్ధ పాడ్యమి కదూ! ఇంటి దైవం లక్ష్మీపూజకు వెళ్ళటం ఎన్నో ఏళ్ళ నుండి వస్తున్న ఆచారం, లోపలకు వెళ్ళి పూజా ద్రవ్యాలను తీసుకుని అవ్వతో చెప్పి రావాలి.

చారునేత్ర ఓ క్షణంలో పూజా సామాగ్రిని సిద్ధంచేసి పెట్టింది. అవ్వ మాధవి ముడిదిద్ది దిష్టితీసి పంపింది.

నెరసిన జుత్తు, మొహం ముడతలు పడిన ఆ ముదుసలి దేవయాని అంతఃపురం వేపు వెడుతున్న మాధవినే చూస్తూ నిల్చొంది.

నిన్నగాక మొన్న పసిపాపగా వున్న మాధవి ఎంతలో అందాల బాల అయింది అని అచ్చెరువు పొందింది. ఈ అమ్మాయినా మహారాజుగారు అపశకునపు కూన అన్నది– అదీ పుట్టిన కొన్ని రోజుల్లోనే !

[మహారాణీగారు అప్పుడే ప్రసవించారు. అందమైన బిడ్డ. పరిగెత్తుకుని వెళ్ళి అంతఃపుర విశ్రాంతి గృహంలో కూర్చున్న మహారాజుగారికి విన్నవించుకున్నది.

"మహారాజా! ఆడపిల్ల పుట్టింది."

"ఆడపిల్లా ? మగబిడ్డ కాదా ?"

మహారాణీగారి కోరిక గుర్తు తెచ్చుకొని "తమరు విజయం చేయాలట" అని మనవి చేసుకుంది.

"నాకిప్పుడు పని ఎక్కువగా వుంది. రాలేనని చెప్పు."

ఆ మాట విన్న మహారాణి కంటనీరు. పాప మాత్రం పాలరాతిలో చెక్కిన బొమ్మలా వుంది.

ఆ మర్నాడు మహారాణికి జ్వరం. రక్తస్రావం.

మహారాజుగారూ వచ్చారు. రాజవైద్యులూ వచ్చారు. ఎన్నెన్నో మూలికలు తెచ్చారు. వైద్యం చేశారు. కాని మహారాణిగారు దక్కలేదు.

తనలాంటి వారికే ఎనలేని శోకం కలిగినపుడు ఆయనకు దుఃఖం సహజమే. కాని పాప గురించి ఆ తండ్రి అన్నమాటలో!

"ఆడపిల్ల పుట్టిందే కాక తల్లికి మృత్యువుని తెచ్చి పెట్టింది. అపశకునపుపక్షి!"

పాప గట్టిగా ఏడవ నారంభించింది. పుట్టిన రెండు రోజుల్లోనే తల్లిని పోగొట్టుకున్న అదృష్టహీన. ఇంక ఆపుకోలేక తానే అన్నది.

"అది పసిపాప మహాప్రభూ."

"నోర్మూసుకో దాసి! పసిపాప అని దాన్ని వెనకేసుకుని వస్తున్నావా? నువ్వే దాన్ని చూచుకో!"

ఆ పాపని గుండెలకు హత్తుకుని అక్కడ్నించి పారిపోయింది.

ఆ పాప...]

ఆ పాప ఇవాళ ఇంత అందమయిన కన్య. ఎంతయినా తాను పెంచిన బిడ్డ కదా! మాధవిని సుఖంగా వుంచు దేవుడా అని కోరుకుంటూ అన్న భోజనం గురించిన ఏర్పాట్లను చూడటాని కోసం పాకశాల వేపు నడిచింది.

దేవయాని అంతఃపురం వద్ద నాలుగు పల్లకీలు సిద్ధంగా వున్నాయి. మాధవిని చూసీ చూడనట్టుగానే దేవయాని తన చెలితో మొదటి పల్లకీలో కూర్చుంది. అది గమనించిన శర్మిష్ఠ, తాను మాధవితో స్నేహంగా ఉందని చూపటాని కోసం చిరునవ్వు నవ్వింది. మాధవి పిన్నికి అభివాదం చేసి చారువేత్రతో మూడవ పల్లకీలో కూర్చుంది. ఆఖరి దానితో పరిచారికలు కూర్చున్నారు. ఒక్కో పల్లకీని నలుగురు నలుగురు బోయీలు మోసుకుంటూ రాజభవనం నుండి బయటకు వచ్చారు.

ఆ ఊరేగింపు ముందర శంఖ దుందుభి నాదాలతో రాజపరివారపు ఆగమనాన్ని పురజనులకు తెలుపుతూ వాద్యబృందం నడిచింది.

"మహారాణి గారు లక్ష్మీ పూజకు వెడతున్నారు." పురజనుల గుసగుసలు.

తలుపుల వద్ద నిల్చున్న స్త్రీజనం, పిల్లలూ, రహదారి పక్కన నిల్చున్న పురుషులూ గౌరవ భావంతో, కుతూహల సంతోషాలతో ఆ మేనాల్లోని రాజపరివారాన్ని గమనించసాగారు.

బయట వున్న వారికి లోపలున్న వారు కనిపించరు. కాని లోపలున్నవారికి బయటి ప్రపంచం స్పష్టంగా కనిపిస్తుంది. సూర్యకాంతిలో తళతళా మెరుస్తున్న నగరపు అందచందాలనూ, అక్కడక్కడా స్థాపించిన ధ్వజాలనూ, పురజనులనూ గమనించిన మాధవి దృష్టి పల్లకిలోకి మరలింది. దానిలో మెత్తటి ఆసనాలు, ఆను కోవటానికి వీలుగా పట్టు బాలీసులు, బంగారురేకు తాపటం చేసిన పై భాగంలో నక్షత్రాలలా మెరుస్తున్న మణులు. మేనా పిడులు దంతంతో చేశారు. ముత్యాల తోరణాలతో అలంకృతమయిన ద్వారాలు. వాటిని కప్పుతూ పట్టుతెరలు.

"దేవయాని పిన్నికి కోపం వచ్చినట్టుంది కదూ చారునేత్రా ?"

"ఆమెగారికి ఎప్పుడూ అందరి మీదా కోపమే!" అంటూ నవ్వింది చారునేత్ర.

"నాకు పెళ్ళయితే ఆమెకి సంతోషం కలుగుతుందా ?"

"కాదా ? ఆమెకి తానే సౌందర్యవతి నన్న గర్వం ఉంది. ఇప్పుడు నువ్వు ఆవిడకి కంట్లో నలుసులా ఉన్నావు."

"ఏదో అడిగితే ఏమిటో చెప్తున్నావు నువ్వు" అని మాధవి కోప్పడింది.

[పిన్నికే కాదు, తండ్రికి కూడా తనను చూస్తే అంతకంతే. తాను పుట్ట గానే తల్లి చనిపోయిందన్నది వంక మాత్రమే ! అది తన తప్పుకాదు. తాను మగ బిడ్డ కాలేదన్న కోపం! అవ్వ తనను లాలించి పాలించకపోతే తాను ఖచ్చితంగా ప్రేమ అంటే ఎలా ఉంటుందో తెలియకుండా పెరగాల్సి వచ్చేది. తండ్రి తనకు స్వర్ణమందిరాన్ని కట్టించాడు. విద్యాభ్యాసమూ చేయించాడు. కాని కూతురన్న ప్రేమ మాత్రం ఎన్నడూ చూపలేదు. మహారాజుగారికి తానెప్పుడూ దూరంగానే ఉండేది. 'నాన్నా' అని పిలవాలని ఎంతో కోరిక. కాని తండ్రి మాత్రం ఒక్క మార

యినా "మాధవీ" అని ప్రేమగా పిలవలేదు. ఇంత సంపద వున్నా ఏం లాభం అనిపిస్తుంది ఒక్కోమారు. తండ్రి ప్రేమ దొరకని తాను అనాథ కాదా? అలా ఎలా అనుకోను? అవ్వ తనకు తల్లీ తండ్రి రెండూ అయి పెంచలేదూ?]

"ఆదిగో యమునా నది కనిపిస్తోంది చూడు మాధవీ! లక్ష్మి దేవాలయం దగ్గర కొచ్చింది."

మాధవి తెర తొలిగించి దూరంలో తళ తళ లాడుతున్న నీల జలాన్ని తిలకించింది. ఆమె మేను పులకరించింది.

[తండ్రి ఓ మారు అలాంటి నీలమణుల్ని తనకు తెచ్చిఇచ్చారు కదూ? అప్పుడు తనకు ఏడెనిమిదేళ్లు. అంతఃపురం ఆవరణలో ఆడుకుంటున్న తనను జైత్రయాత్రనుండి విజయులై తిరిగి వచ్చినతండ్రి నీలమణులహారాన్ని చూపుతూ "తీసుకో, దగ్గరకురా" అని పిల్చారు. తనకు మాత్రం భయమే. "వెళ్లు, తండ్రిగారికి నమస్కరించు" అని అవ్వ ఎంత బలవంత పెట్టినా, అవ్వ కొంగు చాటునుండి వచ్చే ధైర్యం రాలేదు. అప్పుడు తండ్రి కోపంగా మణిహారాన్ని అవ్వ వేపుకి విసిరేసి వెళ్ళిపోయారు. మూడు నాలుగేళ్ళు బిడ్డ మొహం చూడకపోతే ప్రేమ ఎలా పుడ్తుంది? అని అవ్వ గొణుక్కోవటం తెలుసు తనకు.]

దేవాలయం వద్ద బోయీలు మేనాలను దించారు. రాజవనితలు దిగిన వెనుక పరిచారికలు పూజాసామాగ్రి వున్న పళ్ళేలను పట్టుకుని వచ్చారు. ఎత్తయిన ప్రాకారానికి బంగారు రేకులు తాపటం చేసిన ముఖద్వారం వద్దనున్న భటులు తలవంచి నమస్కరించి వీరికి దారి చేశారు. బంగారు పాంకోళ్ళను అక్కడే వదిలి దేవయాని లోపలికి అడుగు పెట్టింది. మిగిలిన వాళ్ళూ ఆమె వెంట నడిచారు.

గర్భగుడికి ముత్యాల తోరణాలు కట్టారు. అందంగా చెక్కిన నల్లరాతి ద్వారపాలకులు. దానికావల రెండు బంగారు దీపస్తంభాలు—సుగంధ తైలంతో వెలుగుతున్న దీపాలు—అక్కడి దైవం లక్ష్మిదేవి. రాతిబొమ్మ కాని సౌందర్యలక్ష్మి. ప్రేమ, కరుణ, అనుగ్రహం చిరునవ్వులో దాగివున్నాయి.

మహారాణి లక్ష్మికి తలవంచి నమస్కరించగానే దాసీలు గంట కొట్టి, చిన్న ఎలుగుతో మాళవశ్రీ రాగంలో లక్ష్మి స్తోత్రాన్ని మొదలు పెట్టారు. దేవయాని పూజకి సిద్ధం చేసుకుంటూండగా శర్మిష్ఠ అడిగింది:

"దేవయానీ ! నేనూ లక్ష్మీపూజ చేయవచ్చునా?"

దేవయానికి కోపం వచ్చింది.

"ఊహుం. కూడదు."

"ఏమీ? దేవి అందరికీ చెందినదే కదా?"

"కావచ్చు. కాని పూజచేసే హక్కు మాత్రం మహారాణిదే."

ఈ మాటలు దేవయాని అన్న ధోరణిలో "నువ్వు దాసివి" అన్న భావం స్పష్టంగా కనిపించింది. అది గమనించిన మాధవికి విసుగు కలిగింది. దేవాలయంలో కూడా వీరిద్దరి కలహం తప్పదే అని. ఆమె అక్కడకు వచ్చింది నిర్మలమైన మనస్సుతో దేవిని పూజించటానికి. దానికి వెయ్యి విఘ్నాలు.

దేవయాని లక్ష్మీదేవికి పన్నీరు చిలకరించి గోరోజనం, చందనాలతో పూజించింది. అక్షతలతో అర్చన చేసింది. దాసీల కోమల కంఠాలు లక్ష్మీ కటాక్షం కోసం ప్రార్థిస్తూంటే మహారాణి తామర, మల్లె మొదలైన పూలతో లక్ష్మీ విగ్రహాన్ని అలంకరించింది. కదళీ, ఖర్జూరం, ద్రాక్ష, జంబీర ఫలాలనూ, నైవేద్య భక్ష్యాలను సమర్పించింది. ఆ తర్వాత కర్పూరం, నెయ్యి, మాణిక్యాల హారతి. సాంబ్రాణి కదంబాలతో ధూపంవేసి అందరూ దేవికి సాష్టాంగ నమస్కారం చేశారు.

"నా ఇష్టార్థ సిద్ధి కావా" అని మాధవి మనస్సులోనే మారో మారు లక్ష్మిని ప్రార్థించుకుంది.

అందరికీ ప్రసాదం ఇస్తున్న దేవయాని మాధవి ముందు నిల్చుని ఆమెను పై నుండి కిందవరకూ గమనించింది. ఆమె లావణ్యం, యౌవనం దేవయానిలో ఈర్ష్యాసూయలను కలిగించాయి.

"మాధవీ! సాయంకాలం అంతఃపురానికి రా. నీకు కొన్ని విషయాలు తెలపాలని మహారాజుగారి ఆజ్ఞ."

అది తన స్వయంవరం, ఆ తర్వాతి జీవితం గురించేనని తెలిసిన మాధవి సిగ్గుపడింది. తలవంచి "అలాగే వినీ" అని జవాబిచ్చింది.

మళ్ళీ పల్లకీలలో తిరుగు ప్రయాణం. చారునేత్ర మాధవి గడ్డం పట్టుకుని తనవేపు తిప్పుకుంటూ "దేవిని ఏం కోరుకున్నావు?" అనడిగింది.

సిగ్గుతో ఎఱ్ఱబడిన ముఖంతో "చారునేత్రకు మంచి బుద్ధిని ప్రసాదించమని వేడుకున్నా" అంది.

"అది సరేలే కాని. సాయంకాలం మహారాజుగారి అంతఃపురానికి వెళ్ళినప్పుడు జాగ్రత్త సుమా."

అదేమాట ఎప్పుడో ఎవరో ఒకరు చెప్తూనే—అవ్వేనా! కాదేం. దేవయాని పెళ్ళి అయ్యాక వచ్చినప్పుడు "ఆమె రాక్షస రాజ్యంనుండి వచ్చింది మాధవీ, జాగ్రత్త" అని హెచ్చరించింది అవ్వ. దేవయానిని పెళ్ళి చేసుకుని వచ్చాక తండ్రికి కూతురున్న మాటే గుర్తులేదు. మాధవి కప్పుడు పదేళ్ళు. పిన్నిని దగ్గరనుండి చూడాలన్న కుతూహలం. మాట్లాడాలన్న కోరిక. కాని ఆ చిరునవ్వు లేని మొహం చూసేసరికి ధైర్యం వచ్చేది కాదు. ఎంతయినా సవతి కూతురు కదూ తను? ప్రేమ ఎలా వస్తుంది? ఆ మరు సంవత్సరమే యదువు పుట్టాడు. ఆ తరువాత ద్రుహ్యుడు. మగపిల్లలు కావాలన్న తండ్రి కోరిక తీరింది. దేవయాని అహంకారం ఎలాగున్నా పిల్లలు మాత్రం చాలా ముద్దుగా ఉంటారు. అంతఃపుర ద్వారం వద్ద మేనా దిగి మాధవీ, చారులత తమ ప్రాసాదం వేపు నడిచారు. ఉద్యానవనంలో లతానికుంజం పక్కనుండి వెడుతుండగా పాటలి వృక్షం వెనకాల దాక్కున్న యదు, ద్రుహ్యులు పరిగెత్తుకొచ్చి, మాధవి కొంగు పట్టుకుని "అక్కా! మేము ఇవాళ నీ దగ్గరే వుంటాము" అని బ్రతిమాల సాగారు.

కచ్చాపోసిన పట్టుపంచ, బంగారు మొలత్రాడు, భుజానికి తగిలించిన ఆట విల్లు, బాణాలతో పిల్లలు చాలా ముద్దుగా కనిపిస్తున్నారు. వారిని తన దగ్గర వుంచుకుంటే దేవయానితో మాటపడక తప్పదని తెలిసిన మాధవి—

"బంగారు తండ్రుల్లారా, సూర్యుడు నడినెత్తి మీదికి వచ్చేశాడు కదా! పిన్ని మీ కోసం కాచుకుని వుంది. మిమ్మల్ని వెంటనే పంపమని ఇప్పుడే చెప్పింది. చారునేత్రా! వీళ్ళని పిన్నమ్మ దగ్గర వదిలి పెట్టిరా" అని పంపేసింది.

ఏ మాత్రం వెళ్ళటాని కిష్టం లేకపోయినా చారునేత్ర చెయ్యి పట్టుకుని వెళుతున్న పిల్లలను చూసి చిరునవ్వుతో భవంతిలోకి నడిచింది మాధవి.

"పూజ బాగా జరిగిందా? ఇక భోజనానికి రా అమ్మాయీ" అంటూ అవ్వ మాధవికి భోజనం పెట్టింది.

ఆకలితో వున్న మాధవి బంగారు కంచంలో, రక రకాల భక్ష్యాలు, వేడి అన్నం, పప్పూ, పరమాన్నం, పళ్ళ పచ్చళ్ళతో భోజనం చేసింది. పిల్లల్ని వదిలిపెట్టి వచ్చిన చారునేత్రతో అవ్వ అన్నది :

"రాకుమారికి వడ్డించటం నేర్చుకో. రేపు ఆమె అత్తవారింటికి వెళ్ళినప్పుడు నువ్వే కదా ఆమెతో వెళ్లేది."

మాధవి చటుక్కున తలెత్తి–

"అవ్వా! నువ్వూ నాతో రావాలి" అంది.

అవ్వ మొహంలో ముడతలు మరింత స్పష్టంగా కనిపించసాగాయి. చిరు నవ్వు నవ్వటానికి ప్రయత్నిస్తూ "తల్లి కూతురితో వెళ్ళకూడదమ్మా. అది గౌరవం కాదు" అన్నది అవ్వ.

తన స్వయంవరం ఇంకా మూడునెల్ల తర్వాత అయినా ఇప్పుడే తన్ను సాగనంపటానికి సిద్ధపడుతున్నారు. తానూ మానసికంగా ప్రయాణానికి సిద్ధం కావాలి అనుకుంది మాధవి. ప్రతిష్ఠాన నగరంలో తనకు ప్రియమయిన వాళ్ళు అవ్వా, చారునేత్రా ఇద్దరే. ఆడపిల్ల ఏనాటికయినా పెళ్ళి చేసుకుని ఇంకో ఇంటికి వెళ్ళాల్సినదే. కాని తాను మిగిలిన ఆడపిల్లలకన్నా అదృష్టవంతురాలు. తాను రాజకుమారి. తనకు నచ్చిన రాజకుమారుడ్ని స్వయంవరంలో ఎన్నుకునే హక్కుంది. తనకు నచ్చి, వరించిన వాడిని పెళ్ళిచేసుకుని అతనితో బ్రతకడం ఎంత అదృష్టం! తనను మనఃపూర్వకంగా ప్రేమించి, ఆదరించి, గౌరవించే రాజకుమారుడు. అతనికోసం సర్వస్వాన్ని త్యాగం చేసే తనూ...అప్పుడు తన కన్నా అదృష్టవంతులీ ప్రపంచంలో వుండరు.

అలా ఆలోచిస్తూ పడుకుంది రాజకుమారి. ఆ నిద్రలోనే ఆమె రాజకుమారు డొకడు వచ్చి ముంగురులు సవరిస్తూ ప్రియవాక్యాలు పలికినట్టుగా కల కంది.

# 2

బ్రాహ్మీ ముహూర్తంలోనే మెలకువ వచ్చింది గాలవుడికి. ఆశ్రమం చుట్టూ వున్న చెట్లమీది పక్షులు కలకల స్వరంతో ప్రభాత గానాన్ని ఆలపిస్తున్నాయి. గాలవుడు లేచి పర్ణకుటీరం తలుపు తీసి బయటికి వచ్చాడు. ఆకాశం నిర్మలంగా వుంది. చల్లటిగాలి వీస్తోంది. ప్రాతఃకాల క్రియాకలాపాలను పూర్తి చేసుకోవటానికి నదీతీరం వేపుకి నడిచాడు.

ఆశ్రమం ముంగిలి దాటగానే కుడివేపున పాకశాల, గోశాల వాటికి అవతల ఎడంవేపు సమిధలను పేర్చి పెట్టిన పర్ణశాల. అప్పటికే స్నానం చేసిన శిష్యులిద్దరు అగ్ని కార్యం కోసం ఆ శాలనుండి సమిధలను తెస్తున్నారు. మరి యిద్దరు పూజకు పూలు కోస్తున్నారు. వాళ్ళందర్నీ చూడగానే గాలవునికి తను ఈ రోజు లేవటం ఆలస్యమయిం దనిపించింది.

వేగంగా అడుగులేస్తూ నదీతీరం చేరుకున్నాడు. నదీతీరా నున్న ఇసుక దిబ్బలు మంచుతో తడిసినాయి. గాలవుడు నదిలో మునిగి లేచాడు. స్నానం అయ్యాక అప్పుడే ఉదయిస్తున్న సూర్యుని కెదురుగా నిల్చొని నమస్కరించాడు.

అతని దృష్టి జలజలా పారుతున్న నదివేపుకి మరలింది. సరస్వతీ నది. దాని కుడివేపునే విశ్వామిత్రులవారి ఆశ్రమం. నదీ తీరంలోని పెద్ద పెద్ద వృక్షాలను అల్లుకున్న పూల తీగలు. గాలి వీచినప్పుడల్లా రాలిన పూలు నదీ ప్రవాహంలో కలిసిపోతున్నాయి. నదీవేగానికి నురుగులు పుట్టి పూవులతో కలిసి ముందుకు సాగుతోంది. తడిగావున్న ఇసుకమీద సారస, చక్రవాక పక్షులు ఆడుకుంటున్నాయి. నల్లటి చుక్కలున్న జింక ఒకటి గాలవుని దగ్గరకు వచ్చి నిలబడి, అతడు కదలక పోవటాన్ని చూసి ముందుకు పరిగెత్తింది.

"ఇవాళ ఈ ఆశ్రమంలో చివరి దినం. వీటినంతా వదిలి వెళ్ళాలిక" అని విచారించాడు గాలవుడు.

నదీతీరంలోని ఓ బండమీద కూర్చుని ఇక ముందేమిటని ఆలోచించ సాగాడు. విశ్వామిత్రులవారి వద్ద శుక్ల యజుర్వేదాన్ని సాంగంగా అధ్యయనం చేయటం పూర్తయింది.

["గాలవా, యజుర్వేదంలో నీవిప్పుడు సంపూర్ణమయిన పాండిత్యాన్ని సంపాదించావు. ఇంక నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళవచ్చు" అని విశ్వామిత్రుల వారు చెప్పినప్పుడు గాలవునికి ఆనందోద్రేకంతో కళ్ళలో నీళ్ళు తిరిగాయి. గురువు పాదాల్ని గట్టిగా పట్టుకుని నమస్కరించాడు.]

అన్యమనస్కంగా కూర్చున్న గాలవునే చూస్తూ సువర్ణుడు, మనుస్వతుడు నిల్చున్నారు.

గాలవుడు పొట్టివాడు. సన్నని మనిషి. నల్లని రంగు. మోకాలి నుండి పైకి కట్టిన నీర్కావి నారపంచ తడికి వంటికి అతుక్కు పోయింది. వట్టి వంటి మీద జందెం. గుండ్రటి మొహంలో కుందేలు కళ్ళలాంటి కళ్ళు, గడ్డం, మీసం. వెడల్పాటి పెద్ద ముక్కు, లావు పెదవులు, తలమీద పిలక— అదీ అతని రూపం.

"ఏమిటి గాలవా ఆలోచన? అప్పట్నుండీ ఎదురుగా నిల్చున్న మేము కనిపించటం లేదా? అప్పుడే తపస్సా?" అనడిగాడు మనుస్వతుడు.

గాలవుడు ఉలిక్కిపడి లేచాడు.

"ఏమీ లేదు. ఇన్నేళ్ళుగా ఈ ఆశ్రమంలో ఉన్నాను. ఇప్పుడు ఎలా వెళ్ళనా అని విచారిస్తున్నాను."

"అది నిజమే! ఇప్పటికే ఆలస్యమయింది. పద. పైగా ఇది ఈ ఆశ్రమంలో నీ చివరి అగ్నిహోత్రం!" అన్నాడు సువర్ణుడు.

ఆ ముగ్గురూ ఇసుక తిన్నెల మీద నుండి సమతలమయిన ప్రదేశంలో వున్న ఆశ్రమంవేపు సాగారు. దారిలో పళ్ళతో నిండిన చెట్లను చూసిన గాలవునికి విశ్వామిత్రులవారి ఆశ్రమంలో తప్ప మరోచోట ఇంత రుచిగా ఉండే పళ్ళు దొరుకుతాయా? అనిపించింది. మెడలో గంటల చప్పుడు చేస్తూ అటూ ఇటూ తిరుగుతున్న గోవులు కనిపించాయి.

"ఫాల్గు తీయటం పూర్తయిందా సువర్ణా?"

సన్నగా కొబ్బరి చెట్టులా ఎత్తుగా ఎదిగిన సువర్ణుడు నవ్వి "అదంతా ముగించే ఇటు వేష వచ్చాం" అన్నాడు. అతని మీద కాస్త పొట్టిగా సన్నగా ఉండే మనుష్యుడు కబుర్లపోగు. పాకశాల బాధ్యత అతనిది. అత నన్నాడు:

"నువ్వు ధన్యుడివి గాలవా! మేము రెండేళ్ళుగా నేర్చుకుంటూనే ఉన్నాం. ఈ చెవితో విన్నది ఆ చెవిలోంచి వెళ్ళిపోతుంది. అంతకన్నా బాగా నేర్చుకోవటం మావల్ల కావటం లేదు."

"దేనికయినా సమయం రావాలి మనుష్యా! అప్పుడు అంతా తనకై తానే గోచరమవుతుంది."

"నీ ఆశీర్వాదం నిజం కానీ!"

సువర్ణుడు మధ్యలో తలదూర్చి-

"గాలవా! నువ్వింక అధ్వర్యుడివి కావచ్చు. యాగం, ఇష్టి అని శ్రీమంతులా, మహారాజుల వద్దకంతా వెళ్ళచ్చు కదా?"

గాలవుడు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. విశ్వామిత్రులవారు తనకు ఇలాంటి విద్యను అనుగ్రహించారు. వారికి తను ఏ విధంగా కృతజ్ఞత చూపగలడు? మాటలలో తన కృతజ్ఞత తెలిపితే చాలా? తాను ఇక్కడే వుండి వారి పాదసేవలో కాలం గడపాలా? లేకపోతే విశాల విశ్వంలోకి అడుగు పెట్టి తన వ్యాసంగానికి ప్రతిఫలం పుచ్చుకోవాలా? పక్షిపిల్ల చిన్నగా వున్నప్పుడు గూట్లో వుండాలి న్యాయమే. కాని పెద్దయి రెక్కలు బలంగా అయ్యాక? అది ఎగరటం నేర్చుకుని దూరదేశాలకి ఎగిరి పోవాలి. అప్పుడే దాని బ్రతుకు సార్థకమవుతుంది.

వారు ముంగిట్లో అడుగు పెట్టేసరికి అగ్నిశాలలో అగ్నిహోత్రం ప్రారంభించారు. పొగ నల్లటి మేఘాల్లా పైన ఆకాశంలోకి వెళ్ళిపోతోంది. ఋత్విక్కుల సామూహిక మంత్రగానం- గాలవుడు తన్మయుడై నిలిచి పోయాడు. అలవాటుగా అతని పెదవులు మంత్రాల్ని పునరుచ్చరించ సాగాయి.

పాలూ పళ్ళతో ఉపాహార మయ్యాక అధ్యయనం. అదయ్యాక అధ్యయన శాలలో విశ్వామిత్రుల వారిచే ప్రవచనం. చలీ, వానా లేకపోతే ఆవరణలోని మర్రి చెట్టుకిందే పాఠాలు జరిగేవి. ఇవాళ ఎందుకో విశ్వామిత్రుడు అధ్యయన శాలలో ఎత్తైన వేత్రాసనం మీద కూర్చుని ప్రవచనాన్ని మొదలు పెట్టాడు.

శిష్యుల మధ్యలో కూర్చున్న గాలవుడు తన గురువును మరో మారు కళ్ళ నిండుగా చూసుకున్నాడు. పొడుగ్గా వున్న దృఢకాయం. తేజః పూరితమైన కళ్ళు, మోకాలి వరకూ కట్టుకున్న నారవంచ, ముడివేసిన ఉత్తరీయం భుజం మీద, మెడలో రుద్రాక్షమాల. రొమ్ము మీద కనిపించే జందెం. దండలు. మణికట్టు వద్ద రుద్రాక్ష మాలలు, భుజం వరకూ వున్న తెల్లజుత్తు, పైకి ఎత్తికట్టిన ముడి, గుండెల దాకా వచ్చిన తెల్లటి గడ్డం– ఎవరినైనా ఆకట్టుకునే రూపమది. తీర్చి దిద్దినట్లున్న పెదవుల నుండి వెలువడుతున్న మాటలు. కంచు వంటి ధ్వని. బ్రహ్మర్షి అయినవాడు అధికారంతో ఆడుతున్న ఆ మాటలు అందర్నీ ముగ్ధుల్ని చేసేలా వున్నాయి.

"ఇష్ట సిద్ధికోసం మనిషి ఏం పని చేస్తే అది తపస్సు. పరిశుద్ధ జలానికి రంగూ వాసనా ఏదీ వుండదు. అలాంటి దాన్ని చూస్తే మనస్సుకు సంతోషం కలుగుతుంది. అలాగే మనస్సు తన కోసం ఏమీ కోడకోకపోయినా లోక కల్యాణం కోసం సంకల్పిస్తే దాని విలువ హెచ్చుతుంది. ఇంద్రియ సుఖానికి ఎక్కువ విలువ ఇవ్వకూడదు. కాని ఆత్మోద్ధరణకు చేసే పని నిజమయిన తపస్సు. స్వలాభం కోసం కాకుండా పరుల కోసం చేసే తపస్సు ఇంకా శ్రేష్ఠం......

విశ్వామిత్రుడు చుట్టూ చూసి శిష్యులెవరూ ప్రత్యుత్తరం ఇవ్వకపోవటంతో ప్రవచనం కొనసాగించాడు:

"తపస్సు అంటే విత్తు మొక్కై పెద్ద చెట్టయి పెరగటం వంటి కార్యం. తపస్సు చేసేవాడు ఇంద్రియ నిగ్రహంతో మనస్సుని అదుపులో ఉంచుకోగలగాలి. మీరు ఏం సాధించదల్చుకున్నారో అది మనస్సులో నిలవాలి. అది తపస్సుకి మొదటి మెట్టు."

"తరువాత మెట్టు ఏదీ?"

"ఆయా దేవతలు ప్రసన్నులయినకొద్దీ మనస్సులో ఆయా భాగపు చాంచల్యాలు అదుపులోకి వస్తాయి. నిశ్చలమయిన మనస్సు ఆనందానికి మూలం ఆ మనస్సు ముక్తికోసం మీరు శ్రమ పడాలి. ఈ తదేక చిత్తమయిన తపస్సు అంతరంగాన్ని శుద్ధి చేస్తుంది...."

విశ్వామిత్రుని పాఠం పూర్తి కాగానే శిష్యులందరూ గుసగుస లాడుకో సాగారు.

"ఎంత గొప్పవాక్కు ఆయనది. అదే లేకపోతే ఆయన ఊరకే బ్రహ్మర్షి అయ్యారా?"

"తిండీ తిప్పలూ కూడా లేకుండా ఆయన ప్రవచనమే వింటూ కూర్చోవా అనిపిస్తుంది."

"ఏం ప్రయోజనం లెద్దు! ఈ క్షణం వింటావు మరుక్షణం మర్చిపోతావు. నీకు గుర్తుండేదొకటే- పాలు తీయటం!"

"నీకో? పాకశాలలో పాయసం చేయటం మాత్రమే తెలుసు మనస్వతా!"

"లేవండిక- మాధ్యాహ్నికానికి వేళయింది."

శిష్యులులేచి గురువుకు నమస్కరించి బయటకి వచ్చారు. గాలవుడు ఆయన వద్దకు ఒక్కడే వెళ్ళి సాష్టాంగ నమస్కారం చేశాడు.

విశ్వామిత్రుడు చిరునవ్వు నవ్వుతూ-

"ఏం గాలవా నువ్వింకా వెళ్ళలేదా? నిన్ననే నీకు అనుజ్ఞ ఇచ్చాను కదా?" అని ప్రశ్నించాడు.

"ఇచ్చారు. కాని నాదో కోరిక ఉంది గురుదేవా!"

"అధ్యయనం పూర్తయ్యాక కూడా కోరికేనా?"

గాలవుడు తడబడ్డాడు.

"కోరిక కాదు గురువర్యా! ప్రార్థన. మీరు ప్రేమతో నాకు విద్యాదానం చేశారు. తమకు నేను ఎలాంటి గురుదక్షిణ ఇవ్వాలో ఆజ్ఞాపించండి."

"నేను నీ సేవతోనే సంతృప్తి చెందాను గాలవా. నాకు మరే గురుదక్షిణా అక్కర్లేదు."

"గురుదక్షిణ ఇస్తే కాని సిద్ధి లభించదు అని పెద్ద లంటారు."

విశ్వామిత్రుని కనుబొమలు పైకి లేచాయి.

"అది గురుదక్షిణ ఇవ్వగలిగిన వానికి అన్వయిస్తుంది. నీకు కాదు."

గురువు తన్ను కించపరుస్తున్నాడన్న అనుమానం కలిగింది గాలవునికి. పంతంతో అన్నాడు.

"నాకు ఇవ్వగల శక్తి లేదంటారా గురుదేవా? ఆ శక్తి మీరు నాకు ఇచ్చారనే భావిస్తున్నాను నేను."

విశ్వామిత్రునికి గాలవుని పొగరుబోతుతనం చూసి కోపంవచ్చింది. వీడిని ఎలాంటి గురుదక్షిణ అడగను? ఈ ఆశ్రమంలో నాకేం తక్కువయింది? తన ఏ కోరికనయినా రాజమహారాజులు క్షణంలో తీరుస్తారు కదా! ఈ గాలవుడికో పాఠం నేర్పాలి. అతడు ఇవ్వలేనిదాన్నే దయినా అడిగి 'లేదు' అనిపించి పంపాలి. ఇలా ఆలోచించి విశ్వామిత్రు డన్నాడు:

"అలాగయితే శరీరమంతా తెల్లగాను. ఓ చెవిమాత్రం నల్లగానూ ఉండే ఎనిమిదివందల గుర్రాలను తెచ్చి అప్పగించు."

అది విన్న గాలవుడు దిగ్భ్రమచెందాడు. ఇది తన శక్తికి మించినదని తెలిసి భయంకూడా వేసింది. కాని అదేదీ పైకి కనబడకుండా జాగ్రత్తపడి "అలాగే గురుదేవా" అని మరోమారు నమస్కరించి అక్కడనుండి బయటపడ్డాడు.

భోజనాలయ్యాక మిత్రులతో చెప్పి గాలవుడు ఆశ్రమంనుండి బయలు దేరాడు. సువర్ణుడు, మనుస్వతుడు ఆశ్రమపు అంచుల వరకు అతనితో వచ్చారు.

"గాలవా. నీవు రేపు పెద్ద ఋషివయినపుడు మమ్మల్ని మర్చిపోకయ్యా?'

"అంత పెద్ద మాటలెందుకు? ఎలాగా నేను గురుదక్షిణ తీసుకుని రానేవస్తాను కదా!"

స్నేహితులు వెనుతిరిగాక, ఆశ్రమపు అంచుల్లో తాను ఒక్కడే మిగిలినపుడు గాలవునికి కంఠం బరువయింది. మరి వెనక్కి తిరిగి చూడకుండా పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ ముందుకు సాగాడు.

ఎక్కడి కిప్పుడు? అది అతని ముందున్న పెద్ద ప్రశ్న. ముళ్ళచెట్లు, దర్భ పొదలూ ఎదురయ్యాయి అతనికి. ఎక్కడినుంచో పిప్పళ్ళ వగరువాసన కూడా వస్తోంది.

పోనుపోను చిట్టడవి కారడవి కాసాగింది. ఆకాశాన్నంటే చెట్లు. పట్టపగలయినా సాయంకాలం అయిందేమో ననిపించే చిరుచీకటి! మద్ది, పొగడ, పొన్నవృక్షాలూ. ఆ వృక్షాలకు అల్లుకున్న లతలూ అతని కంటపడ్డాయి. నడచి నడచి అలసట కలిగి నప్పుడు అతని దృష్టి కాళ్ళవేపు మరలింది. పాదాలకున్న పాంకోళ్ళు అరిగేదాకా నడక. తరువాత?

గాలవుడు అలసిపోయి ఓ చెట్టు కానుకుని కూర్చున్నాడు. ఆలోచనలు తేనె టీగలా ముసిరినాయి.

గురువుగారు ధనకనకాల్ని కోరుకోకుండా విచిత్రమయిన గురుదక్షిణఅడిగారు. ఆయన చెప్పినటువంటి విశిష్ట లక్షణాలున్న గుర్రాలు ఏ రాజుదగ్గర ఉంటాయి? ఉన్నా. తాను అడిగినంతనే ఇచ్చేస్తారా? అలా ఇవ్వకపోతే తాను గురుదక్షిణ ఎలా సమర్పించటం? మొండిపట్టు పట్టకుండా వుంటే చాలా బాగుండేది. ఇప్పుడు ఈ దక్షిణ అన్న అప్పు తీరకపోతే విముక్తిలేదు. ఇంక తన లక్ష్యం ఒక్కటే– ఎలా గయినా ఈ గుర్రాలను సంపాదించి గురువుగారి అప్పు తీర్చి విముక్తి పొందటం.

గాలవుడులేచి మళ్ళీ నడిచాడు. ఓ యోజనం నడిచేసరికి వాగు ఒకటి అడ్డం వచ్చింది. సంధ్యావందనం ముగించి ముందుకు పోగాడు. చేతికందిన పళ్ళతో ఆకలిబాధ తీర్చుకుని దారిలో కనబడ్డ నిర్జన ఆశ్రమంలో రాత్రికి విశ్రమించాడు.

ఉదయం లేచేవేళకు గాలవుని మనస్సు ప్రసన్నంగా ఉంది. దగ్గర్లోనే వున్న కొలనులో స్నానం చేశాడు. తామరపూల పరిమళంతో గుమగుమలాడే చల్లటి నీళ్ళతో చేసిన స్నానం అతన్ని సేదతీర్చింది.

ప్రాతఃకర్మలను తీర్చి వచ్చిన గాలవునికి గురువుగారి మాటలు గుర్తు వచ్చాయి.

(తపస్సు వల్ల ఇష్టార్థ సిద్ధి కలుగుతుంది.)

అలా అయితే తపస్సు చేస్తే గుర్రాలు లభ్యం కావచ్చు. మరి ఏ దేవుణ్ని ప్రార్థించను? జగన్నియామకుడయిన విష్ణువునుగూర్చి తపస్సుచేయటం మంచిది.

గాలవుడు పద్మాసనం వేసుకొని కూర్చుని పెద్ద స్వరంతో విష్ణు ప్రార్థన చేయసాగాడు.

త్వం నఃస్రష్టా చ భర్తా చ [హర్తా చ జగతః ప్రభో।
త్వయా సృష్టమిదం విశ్వం [యచ్చేజ్గం యచ్చనేజ్గతి॥
త్వయా భూమిః పురానష్టా [సముద్రాత్పుష్కరేక్షణ।
వారాహం వపురాశ్రిత్య [జగదర్థే సముద్ధృతా॥
ఆది దైత్యో మహావీర్యో [హిరణ్య కశిపు పురా।
నారసింహం వపుః కృత్వా [సూదితః పురుషోత్తమ॥

అలా ఎంత సేపు ప్రార్థించాడో అతనికే తెలియలేదు. అంతలో ఎవరో అతని భుజం తాకి

"వత్సా! నీ వెవరవు?" అని అడిగినపుడు కళ్ళు తెరిచాడు.

ఎదురుగా పెద్ద తెల్ల గెడ్డంతో ముని ఒకడు నిల్చున్నాడు. అతని కళ్ళలో కరుణరసం ఉట్టిపడుతోంది. ఇతన్ని ఎక్కడో చూశానేఅనిపించి 'ఆశ్రమంలోనేకదా? విశ్వామిత్ర మహర్షి వద్దకోమారు వచ్చారుకదూ!' అనుకుంటూ ఆయనకు సాష్టాంగ నమస్కారం చేశాడు.

"నా పేరు గరుత్మంతుడు. ఇక్కడే దగ్గర్లో ఆశ్రమంలో ఉన్నాను. నా ఆరాధ్య దైవం విష్ణువుప్రార్థన వినిపించి, ఎవరో అని చూద్దామని వచ్చాను." అని ఆతడనగానే గాలవునికి గుర్తొచ్చింది, వృద్ధాప్యం మూలంగా రథసారథ్యాన్ని వదిలిపెట్టి ఏకాంతంలో భగవద్ధ్యానంలో కాలం గడుపుతున్న గరుత్మంతుల వారి గురించి విశ్వామిత్రులవారు చెప్పిన మాట.

గాలవుడు మరోమారు ఆయనకు నమస్కరించి తన ముందున్న సమస్య గురించి చెప్పాడు. గరుత్మంతుడు అతన్ని లేవనెత్తి 'అలసివున్నావు. నా ఆశ్రమానికి పద నాయనా! కాస్త ఫలాహారంచేసి ఏం చేయాలో ఆలోచిద్దువుగాని' అంటూ అతన్ని తీసుకుని వెళ్ళాడు.

బాగా పండిన అరటిపళ్ళు, కమ్మగా కాచిన పాలు తాగాక గాలవునికి చైతన్యం వచ్చింది. గరుత్మంతులవారు అప్పుడన్నారు :

"గురుదక్షిణ సమర్పించాలి. నిజమే, కాని అన్ని గుర్రాలు దొరకాలంటే అతడు రాజాధిరాజు అయుండాలి. నాకు తెలిసినంత వరకూ చంద్రవంశపు రాజ యయాతి ఒక్కడే అంతటి ధనవంతుడు. అతడు చాలా ఉదారస్వభావం కలవాడు. మునులంటే భక్తి గలవాడు. అడిగినవారికి, లేదు అనలేడు. అతన్ని అడిగావంటే నీ సమస్య తీరినట్టే."

"యయాతి మహారాజుండేస్థలం ఏదోకూడా తెలియజేయండి మహానుభావా!"

"ప్రతిష్ఠాన నగరం అతని రాజధాని. అది గంగా యమునల సంగమంలో ఉంది. ఇక్కడికి సుమారు అయిదు యోజనాలా దక్షిణం పోయి, అక్కడి నుండి

తూర్పు దిక్కుగా పది యోజనాలు నడిస్తే గంగానది వస్తుంది. నది దక్షిణపు ఒడ్డునే ఆ నగరం ఉంది."

గరుత్మంతుల వారు చెప్పిన గుర్తులన్నీ మళ్ళీ మళ్ళీ నెమరు వేస్తూ లేచాడు గాలవుడు. వెళ్ళే ముందు నమస్కరించిన గాలవుని గరుత్మంతులవారు "నీ పనిలో నీకు జయం లభించు గాక" అని ఆశీర్వదించారు.

# 3

గాలవుడు పడవలో గంగానది దాటి ప్రతిష్ఠాన నగరంలో అడుగు పెట్టేసరికి సూర్యోదయమయ్యి ఓ జాము గడిచింది. అది కార్తీక శుద్ధ అష్టమి. గాలవముని నగర వీధుల్లో నడుస్తుంటే పురజనులు ఆశ్చర్యంతో చూశారు. ఎంతోమంది భయ భక్తులతో నమస్కరించారు. గాలవుడు ఎవరి వంకా చూడకుండా తన దృష్టి అంతా దూరంలో కనిపిస్తున్న రాజసౌధపు బంగారు కలశం మీదే కేంద్రీకరించి నడిచాడు.

వైభవంగా ఉన్న రాజభవనం ప్రాకారాలనుండి ఎంతోమంది జనం-అందులో సామాన్యులూ- ధనవంతులూ, అధికారులూ అందరూ వున్నారు- బయటకు రావటాన్ని గమనించి. 'బహుశా యయాతి రాజసభ ఇప్పుడే పూర్తయుండా' అనుకున్నాడు గాలవుడు.

అతడు ఏమీ చెప్పక మునుపే ద్వారపాలకు డొకడు లోనికి త్వరిగెత్తిపోయి "మహారాజా, ఎవరో మునీంద్రులవారు వచ్చారు" అని వార్త అందించాడు.

"వారిని సకలమర్యాదలతో తోడ్కొని రండి" అని ఆజ్ఞాపించాడు యయాతి.

సేవకులు పల్లకిలో గాలవుని తీసుకొచ్చి దించారు. యయాతి చేతులు జోడించి ఆయనకు నమస్కరించి, పద్మసింహాసనంలో ఆయన్ని కూర్చోబెట్టి, బంగారు పళ్లెంలో ఆయన కాళ్ళుగడిగి, మధుపర్కము సమర్పించి సత్కరించాడు.

"మీ రాకతో నా రాజ్యం పావనమయింది" అని యయాతి అనగా, అతని ఆదరోపచారాలతో సంతృప్తి చెందిన గాలవుడు తనగురించి చెప్పి-

"నేను భిక్షార్థిగా వచ్చాను మహారాజా" అన్నాడు.

యయాతి వినయంతో- "అది ఏమయినా దానిని మీకు సమర్పించే భారం నాది. లేవండి. సంధ్యావందనం చేసి భోజనం చేద్దురుగాని. అలసి వచ్చారు. మీరు విశ్రమించండి. సాయంకాలం మాట్లాడుకుందాం" అన్నాడు.

అంతఃపురంలో గుసగుసలు.

"విశ్వామిత్రులవారి ఆశ్రమంనుండి ఓ ముని వచ్చారుట."

"యజుర్వేద పండితులట. మహా మహిమలు కలవారట."

"భిక్షార్థులై వచ్చారుట"

మునులంటే పెద్ద గౌరవంలేని దేవయాని మాత్రం కటువుగా "ఏదేం దోచుకు పోదామని వచ్చాడో" అంది.

మాధవి సఖి ఒకతె

"ముని ముఖం మాత్రం అష్టావక్రం! ఇంత కురూపిని మేమెక్కడా చూడ లేదమ్మా!" అంది.

"ఋషుల గురించి ఇలా మాట్లాడకూడదు కమలముఖీ. బాహ్య రూపం ముఖ్యం గాదు వారికి. కావాలంటే అందమయిన రూపం పొందలిగిన తపశ్శక్తి లేదా వారికి!" అని మాధవి మాత్రం గాలవుని పట్ల సానుభూతి చూపింది.

• • • •

రాజు కోరిక ప్రకారం పొద్దు క్రుంకే వేళకు గాలవుడు సమాలోచనా మందిరానికి వచ్చాడు. గాలవుడు కూర్చున్న తరువాత యయాతి కూడా తన సింహాసనం అధిష్టించాడు.

గాలవుడు నెమ్మదిగా తాను విశ్వామిత్రుని శిష్యుడనన్న దానితో మొదలు పెట్టి తన గురువు అడిగిన గురుదక్షిణ ఇవ్వటానికి కావలసిన సహాయం కోసం యయాతి వద్దకు వచ్చినట్లు తెలియచేశాడు. వృద్ధుడు గరుత్మంతుని సలహా గురించి చెప్పటం కూడా మర్చిపోలేదు.

"మహారాజా నేను వర్ణించిన లాంటి గుర్రాలు నీవద్ద ఉండే అవి నాకిచ్చి నేను గురుఋణంనుండి విముక్తి చెందేలా చూడు. లేదంటే అలాంటి గుర్రాలను కొనటానికి నాకు ధన కనక సహాయమయినా చేయి."

గాలవుని కోరిక విని యయాతి మౌనంగా కూర్చుండిపోయాడు.

యజ్ఞ యాగాదులు చేసి తన ధనాగారం ఖాళీ అయి కూర్చుంది. కూతురి పెళ్ళి చేయటానికి కూడా కూడా డబ్బులేక స్వయంవరం మూడునెల్లు ముందుకు

తోశాను. ఇలాటప్పుడే వచ్చి గాలవుడు దానం అడగాలా ? సామంత రాజుల్నుండి కాని, ప్రజల్నుండి కాని కానుకలు వసూలు చేసే సమయం లేదు. ఇతనికి లేదని చెప్పటం ఎలా ?

మౌనంగా కూర్చున్న రాజును చూసి గాలవుడు అన్నాడు:

"యయాతీ. ఇది నీకు సాధ్యపడదంటే చెప్పు. నాకేమీ కోపంలేదు. నేను మరో రాజు నెవరినయినా ఆశ్రయిస్తాను."

రాజు కనుబొమలు ముడివేసి దీర్ఘంగా ఆలోచించసాగాడు. ఇతని కివ్వటానికి ఏముందబ్బా తనవద్ద! ఈ స్వర్ణ సింహాసనాలు- రథాలు- అందోళికలు. అవి తీసుకుని మిగిలిన రాజులు అశ్వాల నిస్తారా ? కాని ఈ వస్తువులు అందరు రాజుల దగ్గర ఉండేవే! ఏదయినా లోకోత్తరమయిన వస్తువు తన దగ్గర వుంటే అది ఇతని కిచ్చేయ వచ్చును.

చటుక్కున రాజుకు తన కూతురు మాధవి గుర్తొచ్చింది. కొన్నిరోజుల క్రితం ఆమెను అంతఃపురంలో చూసినప్పుడు ఎవరీ అందగత్తె అని తనకే అనిపించింది. అంతటి రూపసిని తన వద్ద ఉంచుకోవటం క్షేమంకాదు. క్షత్రియ కన్యకు తగిన తీరుగా స్వయంవరం ఏర్పాటు చేసి ఆమెకు వివాహం చేసేయాలి అని ఆలోచించాడు తాను.

తన కూతురు మాధవినే ఈ మునికి ఇచ్చేస్తే? ఆ ఆలోచనతో రాజుకు తన సమస్య తీరిపోయినట్టే అనిపించింది. దాంతో అతని పెదవుల మీద ఓ చిరునవ్వు విరిసింది. గాలవుడు అది గమనించాడు. యయాతి ఆలోచించాడు. మాధవి నివ్వటానికి ఏం అభ్యంతరం వుండగలదు? ఎలగూ ఈ కూతురు తనకు బరువే! పుట్టుకతోనే తల్లిని చంపిన అపశకునపు పిల్ల. ఏ రకంగానూ తనకు ప్రయోజనకారి కాదు, వృద్ధాప్యంలో తనను ఆదుకునే మగపిల్లలు యదు. ద్రుహ్యుడు, పురువు ఉండగా ఈ ఆడపిల్ల గురించి తానెందుకు విచారించాలి? దానం చేసేది తాను అమ్మాయి తండ్రి. ఆ అధికారం వున్న ఇంకో వ్యక్తి – ఆమె తల్లి – జీవించిలేదు కనుక తన పని మరింత సులువు అయింది.

కాని ఈ దానం గురించి మాధవి ఏమంటుందో? అయినా ఓ ఆడపిల్ల మాటకు తాను విలువ ఇవ్వనక్కర్లేదు. ఇంక తన ప్రజలు? కూతురినే దానం చేస్తే

శాడు. ఎంతటి దానశూరుడు! అని పొగుడుతారు. అయినా ఈ దానంతో తనకు ఈ పిల్ల పెళ్ళి బాధ్యత కూడా తప్పుతుంది.

ఏ నిర్ణయానికి వచ్చేముందయినా దేవయానితో మాట్లాడటం మంచిది అను కున్న యయాతి—

"మునివర్యా, నాకు ఆలోచించుకునే అవకాశం ఇవ్వండి. రేపు సాయం త్రం ఏ విషయమూ చెప్తాను" అన్నాడు.

రాత్రి అంతఃపురంలో దేవయానితో తన ముందున్న సమస్య గురించి చెప్పాడు యయాతి. దేవయానికి మొదటి నుండి మాధవి అంటే ప్రేమలేదు. దాంతో వెంటనే—

"కోశాగారంలో డబ్బు లేదంటున్నారు. మాధవికి స్వయంవరం అంటే డబ్బు, బంగారం వద్దా? దానికి బదులుగా మాధవిని ఈ మునికి దానం చేసేస్తే మనం మన ధర్మం రక్షించుకున్న వాళ్ళం అవుతాం. స్వయంవరం కోసం డబ్బు దస్కం సమకూర్చుకో నక్కరలేదు" అంది.

"ఎలాగయినా తెలివి తేటలంటే నీవే దేవయానీ!"

"ఇంకోమాట. నిర్ణయం తీసుకున్నది మీరే అని గుర్తుంచుకోండి. రేపు 'సవతి తల్లి మాధవిని దానం చేసేసింది' అన్న అపవాదు నామీద పడకూడదు" అని హెచ్చరించింది దేవయాని.

యయాతి దేవయానిని దగ్గరకు లాక్కొని చుంబించాడు.

మరునాడు- రాజసభ అయ్యాక మహారాజూ, మంత్రీ సేనాధిపతులు సమా లోచనా మందిరంలో చేరారు.

"కోశాగారం నింపటానికి ప్రజలమీద కొత్త పన్నులు ఎలా వేయాలో ఆలోచించాలి మనం. సామంత రాజులనుండి కప్పంకూడా వసూలు చేయాలి. ఇది చాలా జాగ్రత్తగా చేయాల్సిన పని. దీని గురించి ఆలోచించి నాకు తెలియ చేయండి" అని రాజు ఆజ్ఞాపించాడు.

సాయంత్రం గాలవముని వచ్చినప్పుడు చాలా గౌరవంతో ఎదుర్కొని కూర్చోబెట్టాడు. కళాకాంతులు లేక క్రుంగిపోయిన గాలవుని ముఖం చూసి అతని విచారాన్ని తొలగించే సంజీవిని తనలో ఉందని చిరునవ్వుతో యయాతి అన్నాడు:

"మునివర్యా! యజ్ఞయాగాలతో నా కోశాగారం ఖాళీగా ఉంది. అలాగని మిమ్మల్ని వట్టి చేతులతో పంపటం ధర్మంకాదు. నాకు సర్వాంగసుందరీ, సకల విద్యా సంపన్నురాలు అయిన కూతురుంది. ఆమె పేరు మాధవి. దేవ, అప్సర, గంధర్వ కాంతలకన్నా సౌందర్యవతి అయిన మాధవిని మీకు దానం చేస్తాను. ఆమెను ఎవరయినా మహారాజుకిచ్చి మీకు కావాల్సిన అశ్వాలను కన్యాశుల్క రూపంలో సంపాదించుకోవాల్సిందిగా ప్రార్థిస్తున్నాను."

డబ్బూ, గుర్రాలూ ఇవ్వకుండా కూతుర్ని ఇస్తానంటాడే ఈ రాజు అని గాలవునికి నిరాశ కలిగింది. వద్దు అంటే అదీ దక్కదేమో అని భయం కలిగింది. అందరు తండ్రులు తమ పిల్లల్ని పొగడుతారు. దానిలో వింత ఏమీలేదు. అయినా ఓమారు మాధవిని చూసి ముందరి కార్యక్రమం నిర్ణయించుకోవటం మంచిదని పించింది.

"నీ కూతుర్నోమారు చూడవచ్చునా రాజా ?"

"తప్పకుండానూ. ఉండండి, ఇప్పుడే కబురు పెడతాను" అని యయాతి వింజామరలు వీస్తున్న దాసిని పిల్చి రాజకుమారిని వెంటనే తీసుకురమ్మని ఆజ్ఞా పించాడు.

దాసి అంతఃపురానికి వచ్చేసరికి మాధవి, చారునేత్ర వీణ వాయించు కుంటున్నారు. వచ్చిన దాసి మాట వినగానే వీణావాదన ఆగిపోయింది. మాధవి నిల్చొంది. జారిపోయిన వల్లెవాటు సవరించుకుంది. తండ్రి తన కెప్పుడూ కబురు పెట్టలేదే ! ఈ రోజు ఇదేం వింత? ఎవరయినా రాజకుమారుడు వచ్చాడేమో ?

"తండ్రిగారితో ఎవరున్నారు దాసీ ?" అనడిగింది మాధవి.

అక్కడ జరిగిన సంభాషణంతా వినిపించుకున్న దాసి దుఃఖంతోనే 'ఎవరో ముని' అని జవాబు చెప్పింది.

మాధవికి నిరాశ కలిగింది. పూర్వం మునులెవరయినా వస్తే ఆశీర్వచనం స్వీకరించటానికి మహారాణి దేవయానికి పిలుపు వెళ్ళేదే! ఈ మారు తనకెందుకీ అదృష్టం ?

అక్కడే వున్న అవ్వ మాధవి అనుమానించటం చూసి-

"ఆలస్యం చేయకు. వెళ్ళు బిడ్డా! ఋషుల ఆశీర్వాదం ఎంతవున్నా ఎక్కువ కాదు" అంది.

కాలి అందెలు మంజుల నాదం చేస్తూండగా నడిచింది మాధవి. కుతూహలంతో చారునేత్ర కూడా ఆమె వెంట నడిచింది. మాధవి సమాలోచనా మందిరం లోకి అడుగు పెట్టింది. చారునేత్ర లోపల జరుగుతున్నదాన్ని చూస్తూ తలుపు వెనకాలే నిల్చొంది.

మాధవి ముందు తండ్రికి, తరువాత గాలవునికి నమస్కరించింది.

"వివాహ ప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించాడు గాలవుడు.

అంతవరకూ ఆశ్రమంలోని ఆడవాళ్ళను తప్ప మరొకళ్ళను చూడలేదు గాలవుడు. మాధవిని చూసేసరికి ఒక్కమారు అతని కళ్ళు చెదిరాయి. ఈమె అప్సరా, దేవకన్యా అనిపించింది. యయాతి చెప్పిన దానిలో అతిశయోక్తి లేదని పించింది. ఈమెను ఉపయోగించుకుని సులభంగానే తన గురుదక్షిణ సంపాదించు కోవచ్చునని గట్టి నమ్మకం కలిగింది.

యయాతికి మాధవి పట్ల ఏ రకమయిన ప్రీత్యాదరాలు లేవు కనుక, ఇప్పుడు నిర్వికారంగా అన్నాడు.

"మాధవీ! వీరు గాలవమునులవారు. వీరి గురుదక్షిణ కోసం నిన్ను ఈయ నకు దానం చేశాను."

నిర్ఘాంత పోయింది మాధవి ఈ మాటలకు. తాను వచ్చింది దీవెనల కోసం. కాని ఇక్కడ వింటున్న మాటలు శాపంలా ధ్వనిస్తున్నాయి. ఇక మూడ్నెల్లలో పెళ్ళి కావల్సిన తనను ఇప్పుడే దానం చేశాను అంటే అర్థం?

మాధవి దీన్ని ప్రతిఘటిస్తూ "నాన్నా..." అంటూ ఏమో చెప్పబోయింది. యయాతి మహారాజు మధ్యలోనే అడ్డుకుని—

"మాధవీ! నేను ధర్మబద్ధుణ్ని. ఇక నీవు గాలవుల వారి సొమ్ము" అన్నాడు.

మాధవి గాలవుని వేపు తిరిగింది. ఆమె కళ్ళలోని తిరస్కార భావాన్ని, యయాతి ముఖం లోని అసహాయతనూ గమనించిన గాలవుడు, ఇక్కడ ఎక్కువ సేపు వుంటే ఈ తండ్రీ కూతుళ్ళు ఈ నిర్ణయాన్ని మార్చవచ్చునన్న భయంతో—

"మహారాజా, నేను వచ్చిన పని అయింది. మేమిక రేపు ఉదయమే బయలుదేరుతాం. మాధవిని నాతో బయలు దేరటానికి సిద్ధం కమ్మనండి" అన్నాడు.

మాధవికి తనచుట్టూ ప్రపంచమంతా తిరుగుతున్న ట్టనిపించింది. భయం, కోపం, అసహ్యం, బాధ ఆమెను అక్కణ్ణుంచి బయటకు తోశాయి. వేగంగా అక్కడినుండి పారిపోబోయిన మాధవి గడప దిగేసరికి చారునేత్ర ఆమెను కౌగలించుకుంది. చారునేత్ర భుజంమీద తలపెట్టి నీరసంగా ఏడవసాగింది మాధవి. రాజకుమారికి కలిగిన దురవస్థను చూసి చారునేత్రకూడా ఏడవసాగింది.

నవ్వుతూ వెళ్ళిన వాళ్ళు ఏడుస్తూ రావటం చూసి కంగారు పడింది అవ్వ. చారునేత్ర చెప్పిందంతా విన్న ఆమెకు కడుపు మండిపోయింది. మహారాజుగారు ఇలాంటి పని చేయటమా? రాజకుమారిని ఓ మునికి దానం చెయ్యటంలోని అర్థం ఏమిటి? దానికి బదులు పదహారేళ్ళ వెనకే ఆ బిడ్డను గంగపాలుచేస్తే బాగుండేది కదా. అప్పుడు ఈ పాపను ఇంతకాలం పెంచే బాధ తప్పేదికదా!

అవ్వ మాధవి తల నిమురుతూ "ఏడవకమ్మా" అని ఓదార్చింది. కాని ఏడుస్తున్న మాధవినీ, ఆమె చుట్టూ కన్నీళ్ళతో కూర్చున్న సఖీబృందాన్నీ చూసి అవ్వకు మరింత ఏడుపు వచ్చింది.

మాధవి ఆలోచించింది. నిన్నకాక మొన్న తను ఎలాంటి కలలు కంది. ఇప్పుడు తన జీవితంలో ఎలాంటి విపత్తు తటస్థించింది. తనుకాని ఈ ముని వెంట వెళ్ళను అంటే? తండ్రి ఆడిన మాట తప్పినట్టవుతుంది నిజమే. కాని ఓ ముద్దరాలి జీవితంకన్నా ఎక్కువా మహారాజుగారి మాట?

అవ్వ నిరాశతో "బిడ్డా! నేనూ, నీ సఖులూ తప్ప నీ పరంగా వాదించటానికి మరెవ్వరూ రారు. రాజుగారి మాట కాదనే ధైర్యం ఎవరికుంది చెప్పు?" అంది.

"దేవయాని పిన్ని?"

"నిన్ను కన్నతల్లి కాదమ్మా ఆవిడ. సవతి తల్లిమాత్రమే."

మాధవికి అది నిజమనే అనిపించింది. వెళ్ళను అంటే తండ్రి తన కాళ్ళూ చేతులూ కట్టి గుర్రం మీద వేసయినా అతని వెంట పంపుతారు. అలాంటి అవమానం ఎందుకు భరించాలి?

"నేను రాజకుమారిని కాక ఎవరయినా పేదవాళ్ళ ఇంట పుట్టినట్టయితే నాకీ కష్టం ఉండేది కాదవ్వా."

"ఎక్కడ పుట్టినా ఆడదానికి బాధ తప్పించి కాదమ్మా. స్త్రీ జన్మే పాడు జన్మ!"

ఏడ్చి ఏడ్చి అలసిపోయింది మాధవి. ఇంతకు ముందే వీణా వాదనంతో ఆనంద నిలయమయిన ఆ ప్రదేశం ఇప్పుడు ఎనలేని దుఃఖ సముద్రంలా గోచరిస్తోంది.

తనకు మరో దారిలేదు అనుకుంది మాధవి. కనీసం తండ్రి మాట పాలించానన్న కీర్తి అయినా రానీ. మౌనంగా ఈ ముని వెంట వెడతాను. అతను ఎక్కడికి తీసుకుని వెడతాడో కూడా తెలియదు. నాకు హృదయం, వ్యక్తిత్వం ఉన్నాయి అన్న విషయమే మర్చిపోతాను. కలలకు సమాధి కడతాను.

చారునేత్ర మాధవి చేతులు పట్టుకుని బ్రతిమాలింది.

"నేనూ నీతో వస్తాను మాధవీ."

"వద్దు. ఏ కష్టమయినా నా ఒక్కదానికే రానీ. సుఖం వుంటుంది అంటే నిన్ను రమ్మనేదాన్ని. ఇప్పుడా ధైర్యం లేదు."

ఎలాంటి కష్టంలోనయినా మంచినే ఆలోచించే అవ్వ "ఏడవకమ్మా. దేవుడి దయుంటే ఎవరయినా మంచివాడే దొరకవచ్చు నీకు."

మాధవి ఏమీ సమాధానం చెప్పలేదు. దాని గురించి ఆలోచించే శక్తిని కోల్పోయింది ఆమె మనస్సు.

మాధవి రోజూలాగానే బంగారు పళ్ళెంముందు భోజనానికి కూర్చుంది. కాని ఓ ముద్దకూడా గొంతులోంచి దిగలేదు. గిన్నెలోని పాలను మాత్రం తాగి లేచింది.

పడుకునే ముందు మాధవి చారునేత్రతో "నగలన్నీ తీసేయి చారునేత్రా" అన్నది.

ముత్యాల పాపిడిచేరు, మాణిక్య కర్ణాభరణాలు, మెడలోని పతకం, వడ్డాణం, నవరత్నపు కంకణం, కాలి అందెలు... అన్నీ తీసి పీఠం మీద ఉంచిన

చారునేత్ర కళ్ళలో నీళ్ళు నిల్చాయి. ఇదే రాజకుమారికి తను అర్పించే ఆఖరి సేవ అనిపించింది.

"అవ్వా, ప్రయాణానికి రెండు నారచీరలు తెప్పించి పెట్టు. మరేమీ వద్దు." అని మాధవి అనేసరికి అవ్వ ఇక బాధ ఆపుకోలేక ఆమెను గట్టిగా కావలించుకుని పెద్దగా ఏడవసాగింది.

మాధవి మనస్సు రాయయి పోయింది. ఆమె కంటిలో నీరు కూడా ఎండి పోయింది.

"అవ్వా నువ్వే ఇలా చేస్తే ఎలా? నేను పెళ్ళి చేసుకుని వెళ్ళిపోయానని అనుకుని నన్ను మర్చిపో. ఆపైన ఏమీ బాధ కలగదు...ఊహుఁ. ఏమీ బాధ కలగదు..."

# 4

పడవ నెమ్మదిగా నది దాటసాగింది. ఆ వేళ నీటి ప్రవాహం వేగంగానే ఉంది. గొణుగుతూనే తెడ్డు లేస్తున్నాడు నావికుడు.

పడవలో ఉన్నది ఇద్దరే. మాధవి ఓ పక్క, గాలవుడు మరో పక్క కూర్చున్నారు. గాలవుని దృష్టి అంతా వైడూర్యంలా మెరిసిపోతున్న నదీజలాల వేపుంది. సూర్యుని బంగారు కిరణాలతో ప్రకృతి అంతా బంగారు వస్త్రం కప్పుకున్నట్టుంది. ఒడ్డుపై జాలరులు చేపల వల లాగటంలో నిమగ్నులయి ఉన్నారు. వారి పాట నీరవ వాతావరణాన్ని భగ్నం చేస్తోంది. జాలరితలు చేపల బుట్టల్ని దగ్గర పెట్టుకుని కూర్చున్నారు. నదికి ఉత్తరంగా నిద్రపోతున్న అడవీ, దూరంగా రెండు కొండలూ కనిపిస్తున్నాయి.

విచారంతో మౌనం వహించిన మాధవిని ఎలా పలకరించటం అన్నది సమస్య అయింది గాలవునికి. అందర్నీ వదిలి పెట్టి వచ్చింది కదా. ఆమాత్రం బాధ సహజమే. కొంతసేపు అలా ఒంటరిగా వదిలివేస్తే ఆమె మనస్సుకు శాంతి కలుగుతుంది అనుకున్నాడతను.

మాధవి రాత్రంతా ఎలా గడిచింది గుర్తుచేసుకుంటోంది. నిజానికి రాత్రంతా కన్ను మూయలేదు. చారునేత్రతో మాటలు, అవ్వ సలహాలు వీటితోనే గడిచిపోయింది. దేవయాని అంతఃపురం నుండి వార్త తెచ్చిందో చెలికత్తె: యయాతి మహారాజు ఎప్పటిలాగే వచ్చాడట, అంతఃపురానికి: అతడు ఏ మాత్రం బాధపడినట్టే లేదట. మహారాణి దేవయాని శర్మిష్ఠతో "మాధవి మహారాజుగారి కూతురు. ఆయనకిష్టమయినట్టు ఉపయోగించే అధికారం ఉంది. కాదనటానికి నేనెవర్ని?" అన్నదట. అది విన్న మాధవికి అనిపించింది– తను వెళ్ళిపోవటం మూలాన్న తండ్రికి కాని, పిన్నికి కాని ఏమాత్రం వ్యథ లేదు అని. వారికి అక్కర్లేని వ్యక్తిగా

ఈ రాజగృహంలో ఉండటం దేనికి? విధి తనను ఎక్కడికి లాక్కుపోతోందో పోనీ– అని దుఃఖించింది మాధవి.

అవ్వ మాటి మాటికీ చెప్పింది. "అమ్మాయీ, నీ ధైర్యమే నీకు రక్ష. అది మర్చిపోకు."

చారునేత్ర బ్రతిమాలుకుంది. "వద్దు అనకు మాధవీ. నేనూ నీతో వస్తాను. దానివల్ల నీకు ఎంత కష్టం తప్పినా తప్పినట్టే."

"ఆ మాటకింతకు ముందే జవాబిచ్చాను చారునేత్రా."

తెల్లవారకముందే అంతఃపుర ద్వారం వద్ద ప్రత్యక్ష్యమయ్యాడు గాలవుడు.

"పల్లకి పంపాలని రాజాజ్ఞ" అంది దాసి ఒకతె.

"నాకేమీ వద్దు" అంటూ నారచీర కట్టిన మాధవి ఋషి కన్యలా గాలవుని వెనకాలే నడిచింది. వెనక వదిలిపెట్టి వచ్చిన సఖీబృందం ఏడుపు హృదయ విదారకంగా వినిపిస్తోంది.

"వెళ్ళిరామ్మా. దేవుడు నీకు శుభం గూర్చుగాక!" అన్న అవ్వ ఆశీర్వాదం మాధవి మనస్సులో ప్రతిధ్వనిస్తోంది.

పడవ నదీ మధ్యానికి వచ్చేసరికి ప్రవాహపు జోరు తగ్గింది. పడవ నడిపే వాడు వక్రరూప మునిని చూసి ఆశ్చర్యపోయాడు. నిన్ననే ఇతన్ని నది దాటించాను. ఇవాళ తిరిగి పోతున్నాడు. పైగా ఇంత అందమయిన అమ్మాయి ఎలా దొరికిందబ్బా ఇతనికి? ఆ యువతి తమ దేశపు రాజకుమారి అని తెలియని అతడు కుతూహలంతో అడిగాడు.

"అయ్యా. ఈమె మీ పెళ్ళామా ?"

"కాదు." అన్నాడు తన తడబాటు కప్పిపుచ్చుకుంటూ గాలవుడు.

"నిన్న వచ్చారు. ఇవాళే వెళ్ళిపోతున్నారేం ?"

"వచ్చిన పని అయ్యాక వెళ్ళక ఏం చెయ్యను? ఆశ్రమంలో ఉండే మాకు రాజసౌధాలతో పని ఏమిటి ?"

"అదీ నిజమే" అని మౌనం వహించాడు ఆ పడవ నడిపేవాడు. గాలవుని కంఠంలో తీక్షణతను గమనించిన అతనికి "ఈ మునితో నాకేం పని? ఎక్కువగా మాట్లాడితే శాపం ఇచ్చేస్తేనో" అని భయం వేసింది.

ఆ నదిలో సుడిగుండాలు కూడా వున్నాయి. వాటిని తప్పించుకుంటూ జాగ్రత్తగా పడవ నడిపించా డతడు. ఎండ ముఖానికి కొట్టటంతో మాధవికి చల్లటి చంద్రుడూ, తమ పున్నమి నదీ విహారాలు గుర్తు వచ్చాయి.

పున్నమ రాత్రి యయాతి మహారాజు తన పరివారంతో విహారానికి బయలు దేరేవాడు. మహారాజు తన రాణులతో ఓ పడవ ఎక్కేవాడు. మాధవి, యదు, ద్రుహ్యుడు, పురువు, సఖులూ ఇంకో పడవ. ఆ విశాలమయిన నౌకల్లో కూర్చోవ డానికి ప్రత్యేకమయిన ఆసనాలు. కమలముఖి వీణ వాయిస్తుంటే ఇంకొక చెలి వేణువు, మరింకొకతె డిండిమమూ వాయించేవారు. చారునేత్ర ఎంతో మధురంగా పాడేది. తేనె కురిసే తియ్యటి ఆ రాత్రిలో మంజుల నినాదం పాలవెన్నెల రాత్రంతా వ్యాపించేసరికి తామేదో కిన్నరలోకంలో ఉన్నామేమో ననిపించేది.

అంతా జ్ఞాపకాలు. వట్టి జ్ఞాపకాలు.

"ఒడ్డు వచ్చింది. దిగుదాం" అన్న గాలవుని మాటతో తన స్వప్న లోకం నుండి దిగి వచ్చింది మాధవి. లేచి బురదగా వున్న ఒడ్డుమీద అడుగు పెట్టింది. గాలవుడు రెండు వరహా లివ్వటంతో పొంగిపోయాడు ఆ పడవవాడు.

ఇసుక తిన్నెలు దాటి అడవిలో అడుగు పెట్టాడు గాలవుడు. అతని వెంటే నడి చింది మాధవి. పాదాలకున్న కర్ర పాంకోళ్ళలో చేరిన ఇసుకను దులిపి మళ్ళీ వేసుకుంది. మృదువైన పాదరక్షలనే ధరించిన మాధవి పాదాలు ఈ పాంకోళ్ళ గట్టితనానికి నొప్పి పెట్టినాయి. జీవితంలో సుఖం తప్ప మరేమీ రుచి చూడని మాధవి మనస్సు ఒక్కమారుగా ఎదుట నిల్చిన కష్టాలకి బెదిరిపోయింది.

ఎత్తైన చెట్లు, ఆకుపచ్చ, పసుపు ఆకులతో నిండిన కొమ్మలు రంగురంగుల పూలరాశి. రకరకాల భ్రమరాలు తిరుగుతున్నాయి ఆ పూలచుట్టూ. ఆ నీరవ వాతా వరణంలో కీచురాళ్ళ ఏకనాదం. చెట్ల మధ్యలోని సన్నటి కాలిబాటపైన ఆ ప్రయా ణీకు లిద్దరూ...

అంతవరకూ మౌనంగా వున్న గాలవుడు మాట్లాడటానికి మొదలుపెట్టాడు.

"అంతఃపురంలో సుఖంగా ఉన్న నిన్ను ఇలాంటి చోటికి తీసుకుని వచ్చా నని కోపంగా ఉందా?"

"ఆ ప్రశ్న అడగటం వల్ల ప్రయోజనం?"

"చూడు...నిజం చెప్పాల్సంటే నువ్వు ఓ పుణ్యకార్యానికి వచ్చావు. దీని వల్ల నీకు పరలోకంలో సద్గతి లభిస్తుంది."

మాధవి వ్యంగ్యంగా అడిగింది. "మరి ఇహ లోకంలోనో ?"

"ఈ లోకంలోని కష్టాలు మనిషిని పండుచేస్తాయి. కాయ పండు కావాలంటే ఎన్ని స్థితులను దాటాలో తెలుసా? స్వర్గప్రాప్తికని యజ్ఞయాగాదులు చేసేవారు ఎంతమందో ఉన్నారు..."

"అవును. నా తండ్రీ యజ్ఞాలను చేశారు. నేనేమీ చేయలేదు. నేను యజ్ఞ పశువునని మాత్రం తెలుసు నాకు."

గాలవుడు కోపంగా ఆమె వంక చూసి ముందుకు నడిచాడు.

ఆకాశం నిర్మలంగా ఉంది. సూర్యుడు నిప్పులా మండుతున్నా అడవిలో వున్న వీళ్ళకు ఆ ఎండ వేడిమి తాకటంలేదు. కాని నేలమీది రాళ్ళు, ముళ్ళదే బాధ. కాల్లో ముల్లు గుచ్చుకుందని ఓ నిమిషం ఆగింది మాధవి. నారచీరముళ్ళలో చిక్కుకుందని, ఇంకోమారు అలసటను తీర్చుకొనడానికి ఆగింది. నడిచి నడిచీ పాదాల్లో బొబ్బలు ఎక్కాయి. నేనింక నడవలేను అందా మనిపించింది. కాని పంతం కొద్దీ మాట్లాడకుండా నడిచింది.

మౌనం అసహనీయం కావటంతో గాలవుడు ఒక్కోచెట్టునే వర్ణిస్తూ నడిచాడు. ఇది మద్ది, ఇది పొగడ, ఇది అమ్రాతకం, ఇది నీలాశోకం అంటూ.

సుమ భారంతో వంగి బంగారు రంగుతో కన్నుల పండువుగా ఉన్న చెట్లుతో అరణ్యం దీపాలు వెలిగించినట్టుంది. దానిని చూచి మాధవి "దీని పేరేమి?" అనడిగింది.

"ఇది బంధూక పుష్పం."

ఆ పూల గుత్తిని కోసి ముడుచుకుంది మాధవి. అంతఃపురంలో అయితే ఎలా కనిపిస్తున్నదీ అద్దంలో చూసుకునేదాన్ని. అయినా ఇప్పుడద్దంలో తన ప్రతి బింబం ఎలా కనిపిస్తుందో! చెమట కారుతున్న ముఖం, చందన లేపనం లేని శరీరం. ఆభరణాలు లేని దేహం, అలంకార రహితమయిన తనువు! మాధవి నిట్టూర్చింది.

ఓ చెరువు దగ్గరకు వచ్చాక గాలవుడు "మాధవీ, నువ్విక్కడే కూర్చుని వుండు. ఇక్కడెక్కడయినా కందమూల ఫలాలుంటే తెస్తాను" అంటూ వెళ్ళాడు.

అతడు కనుమరుగు కాగానే మాధవి నిట్టూరుస్తూ అక్కడున్న ఓ రాతిమీద కూర్చుంది. ఆ చెరువులో రెండు హంసలు ఈదుతున్నాయి. నీళ్ళు చూడగానే దాహం వేసింది. కిందకు దిగి స్వచ్ఛమయిన నీటిని చేతుల్లోకి తీసుకుని తాగింది. ఇక్కడ బంగారు పాత్రలు లేవు. వెండి గిన్నెలు లేవు. చెయ్యే ఆధారం- దాహం తీరటంతో ప్రయాణపు బడలిక సగం తగ్గినట్టనిపించింది. మళ్ళీ వచ్చి ఆ రాతి మెట్టుమీద కూర్చుంది.

ఇప్పుడిక్కడ్నించి లేచి పారిపోతేనేమి అనిపించింది మాధవికి. కాని ఎక్కడికి? దారికూడా తెలీదు తనకు. ఎవరన్నా పుణ్యాత్ములు ప్రతిష్ఠాన నగరానికి దారి చూపినా చూపుతారు. మళ్ళీ అవ్వనూ, నాయననూ చూస్తాను. కాని దానం చేసిన తండ్రి తనను మళ్ళీ స్వీకరిస్తాడా?

అంతలో గాలవుడు వచ్చాడు. అతని చేతిలో అరటి పళ్ళున్నాయి. మంచి ఆకలిమీదున్న మాధవి నాలుగైదు పళ్ళను గబగబా తిన్నది- అంతఃపురంలో రోజూ అన్నం, పప్పు, కూరలతో బాటు పరమాన్నాలుండేవి. పళ్ళ రసాయనం ఎంత రుచిగా ఉండేదో! దానితోబాటు కుంకుమ పువ్వు వేసిన పాలు.

అంతలో కోనేరు అటువేపు దబదబమని చప్పుడయింది. వారు చూస్తుండగానే ఏనుగొకటి మెట్లు దిగి వచ్చి, కలహంసలను బెదిరించి చెరువులో నీళ్ళు తాగసాగింది. మాధవి భయంతో-

"ఏనుగు ఇటువేపుకి వచ్చేస్తుందేమో!" అంది.

గాలవుడు నవ్వి "మనం ఏమీ చెయ్యకపోతే ఏనుగులు మనల్ని ఏమీ చెయ్యవు." అతనలా అంటూండగానే ఏనుగు నీళ్లు తాగి వచ్చిన దోవనే వెళ్ళిపోయింది.

బెదిరిన లేడిలా ఉన్న మాధవి మళ్ళీ అడిగింది.

"ఈ అడవిలో పులులూ సింహాలూ ఉన్నాయా?"

"ఊఁ. ఉన్నాయి. ఏం?"

"అవి మనుష్యులను ఏమీ చెయ్యవా?"

"సాధారణంగా లేళ్ళనూ, అవుల్నీ తింటాయి. ఎప్పుడైనా ఆయువు తీరిన మనిషినీ తింటాయి."

తన ఆయుస్సు పూర్తికావటానికి ఇంక ఎక్కువరోజులు లేవు అని లెక్కవేసుకుంటూ నడిచింది మాధవి. అలసటతో కాళ్ళు బరువెక్కి నడవలేనట్టుగా అనిపించింది మాధవికి.

సాయంకాలం అయ్యేసరికి ఆమె పాంకోళ్ళు విరిగాయి. లావుపాటి ముల్లొకటి పాదంలో గుచ్చుకుని రక్తం వస్తోంది. మాధవి నేలమీద కూర్చుని ఆ ముల్లుని బలంగా లాగి తీసింది. దాంతో రక్తం ఇంకా ఎక్కువగా కారసాగింది. రాజభవనంలో అయితే అవ్వ పాదాన్ని వేడినీళ్ళతో కడిగి మందు వేసేది. నొప్పి ఎక్కువయితే రాజవైద్యుడు వచ్చి చూసి వెళ్ళేవాడు. మాధవి దగ్గరే వున్న ఆకుని తీసి రక్తం తుడిచి, చీర చెంగులో ఓ ముక్కచించి గట్టిగా కట్టింది. రక్తం కారటం ఆగింది, కాని బాగా నొప్పెడుతోంది.

"కొంచెం దూరం పోయి చుట్టుపక్కలెక్కడయినా ఆశ్రమం ఏదయినా ఉందేమో చూద్దాం" అని గాలవుడనేసరికి మాధవికి కోపం ముంచుకొచ్చింది.

"మీరు చూసి రండి. నేనింక ఒక్క అడుగు కూడా వేయలేను!"

గాలవుడలా వెళ్ళగానే మాధవికి భయం-పులి సింహాలు తన్నిప్పుడే తినేస్తే అని. మరుక్షణమే అనిపించింది, ఈ బాధలన్నీ పడటానికన్నా చనిపోవటమే మంచిది కాదూ?

ఆకులు రాలిన నేలమీద పడుకుంది-హంసతూలికా తల్పం, మెత్తటి పట్టు పరుపులూ, తలగడలూ, వట్టివేళ్ళ విసనకర్రలూ ఏమీ లేవు- అలసటతో నిద్ర పట్టింది మాధవికి.

"మాధవీ, లే! కూతవేటు దూరంలో పాత ఆశ్రమం ఒకటి ఉంది. రాత్రి అక్కడ గడిపి ఉదయం మళ్ళీ ప్రయాణం సాగిద్దాం."

మాధవి కళ్ళు తెరిచింది. గాలవుడు తాను తెచ్చిన ఆకులూ, మూలికలను రాతిమీద వేసి నూరి ఆ ముద్దను ఓ మర్రి ఆకులో వేసి మాధవికి దెబ్బ తగిలిన

చోట కట్టాడు. దాంతో నొప్పి చాలావరకు తగ్గింది. కుంటుకుంటూ ఆ పర్ణకుటీ రానికి నడిచింది మాధవి.

గడ్డితో కప్పిన గుడిసె ఓ వేపున విరిగిపడింది. కాని పై అరుగు మాత్రం బాగా విశాలంగా వుంది. లోపల మాత్రం మన్నూ, ఆకులూ, అలములతో నిండి వుంది. ఇక్కడ మనుష్యులు నివసించి చాలా కాలమే అయిందని స్పష్టంగా తెలు స్తోంది. మాధవి కొమ్మలతో ఓ చీపురు చేసి లోపల శుభ్రంగా తుడిచి అక్కడే గోడ కానుకుని కూర్చుంది. గాలవుడు మళ్ళీ వెళ్ళి చిలగడ దుంపలనూ ఆకుతో చేసిన దొప్పలలో నీళ్ళూ తెచ్చాడు. మాధవి పచ్చి దుంపలు ఎప్పుడూ తినలేదు. కాని ఇవాళ ఆకలి బాధకు తట్టుకోలేక తిన్నది.

చుట్టూ పెద్ద పెద్ద చెట్లుండటంతో రాత్రి కావస్తున్న కొద్దీ చలి ఎక్కువ కాసాగింది. గాలవుడు కర్రలు ఏరి తెచ్చి, రెండు గంధపు చెక్కలను ఒకదానితో ఒకటి రుద్ది నిప్పు చేశాడు. ఆ వేడి శరీరపు అలసటను తగ్గించినట్టయింది. అలా చలి కాచుకుంటూ కూర్చుండగా గాలవుడు-

"మాధవీ, నువ్విక్కడే పడుకో. నేను వెలుపల అరుగు మీద పడుకుంటాను" అన్నాడు.

అక్కడ పడిఉన్న చినిగిన చాపని లాక్కుని మాధవి దానిమీద పడుకుంది. పడుకోగానే నిద్ర పట్టిం దామెకు.

అరుగు మీద వట్టి నేలమీద పడుకున్నాడు గాలవుడు. ఇది కొత్తేమీ కా దత నికి, అలవాటే. అయినా ఇవాళ నిద్ర పట్టలేదు.

శరత్కాలపు వెన్నెల చీకటిని పారద్రోలింది. చల్లటి గాలి మనసును ఆహ్లాదపరుస్తోంది. ఎక్కడి నుండో సౌగంధికా పుష్పపు పరిమళం వీస్తోంది. అంత వరకు అతని ఆధీనంలో ఉన్న ఇంద్రియాలు ఇవాళ ఎదురు తిరుగుతున్నాయి. ఆ మంట వెలుగులో పడుకున్న మాధవి దేహం అతన్ని అయస్కాంతంలా ఆక ర్షిస్తోంది. యవ్వనంతో పరిపూర్ణమయిన దేహం, నారబట్టల్లో ఉన్నా ఎంత అందంగా ఉంది! ఇలాంటి అందాన్ని దగ్గర ఉంచుకుని, చేతులు కట్టుకుని కూర్చున్నానే, ఎంతటి పిరికివాడిని అనుకున్నాడు గాలవుడు.

ఇంతవరకూ బ్రహ్మచారిగానే ఉన్నాడతడు. ఆశ్రమ జీవనానికి అలవాటు పడిన అతని మనస్సు చిన్న చిన్న ఆశల కెప్పుడూ లొంగిపోలేదు. అన్నిటికన్నా ముందు గురుదక్షిణ చెల్లించాలి. అది తీరేవరకూ తనకు విశ్రాంతి లేదు.

కాని ఈ ఒక్కరాత్రి మాధవి తనని అయితే ఎవరికి తెలుస్తుంది? ఆమె ఎదురు తిరిగినా ఈ అడవిలో ఆమెను రక్షించే వాళ్లెవరు? అలాగే కానీ అన్నది మనస్సు.

తనకు తానే విధించుకున్న నియమాల్నుండి బయటకు రా ప్రయత్నిస్తున్న ఆశ 'అలాగే కానీ' అంది.

గాలవుడు లేచి ఆశ్రమ ద్వారం వద్ద నిల్చున్నాడు. వెన్నెల మాధవి ముఖంమీద, నితంబాలమీద పడుతోంది. ఆమెను కౌగలించుకుని చుంబించకపోతే తాను జీవించలేను అనిపించింది గాలవునికి ఓ క్షణం. అతనికి శరీరమంతా వేడెక్కినట్టయింది. మొఖమంతా చెమటలు పట్టింది. మరుక్షణమే "ఛీ. ఇది తప్పు. యయాతి మాధవిని దానం చేసింది నా స్వంత ఉపయోగానికి కాదు. ఎవరయినా రాజుకిచ్చి కన్యాశుల్కం పొందటం కోసం. ధర్మపథంనుండి తొలగితే కీడు సంభవిస్తుంది. ఎన్నడూ లేనిది మనస్సు ఇవాళ ఎందుకు చలించింది?" అనిపించింది.

ఉన్నట్టుండి మాధవి లేచి "అయ్యో పులి, పులి" అని కేక పెట్టింది.

"ఎవరూ లేరు మాధవీ. పడుకోనే. నిక్కడే కాపలాగా ఉన్నాను. భయపడకు. నువ్వు పడుకున్నావో లేదో చూద్దామని వచ్చాను" అన్నాడు గాలవుడు. అతని కంఠం కంపిస్తోంది...

మళ్ళీ వచ్చి అరుగుమీద కూర్చున్న గాలవుడు పద్మాసనం వేసి ప్రార్థన మొదలు పెట్టాడు. మనస్సు నిర్మలమయింది. చంద్రుడు పడమరకు వాలేసరికి గాలవుడికి నిద్ర పట్టింది.

# 5

మళ్ళీ పొద్దున్నే ప్రయాణం మొదలయింది. దోవకడ్డంగా ఉన్న చిన్న చిన్న గుట్టల్ని ఎక్కి దిగారు. ముందుకు పోతున్న కొద్దీ అరణ్యం మరింత చిక్కబడసాగింది. చెట్టునుంచి చెట్టుకి గెంతుతున్న కోతుల్ని చూసి మాధవి తన అలసటను కాసేపు మర్చిపోయింది. ఏనుగు తొండంతో విరిచి పారేసిన చెట్ల కొమ్మల్ని చూసేసరికి మళ్ళీ భయం మొదలయింది. మరుక్షణంలోనే పరిగెడుతున్న అడవి జింకల్ని చూసి సంతోష పడింది. తండ్రి వేటకని వస్తే వీటినంతా చంపేవారు. తానెన్నడూ మృగయా విహారానికి పోలేదు అనుకుంది.

"మనం ఎంత దూరం వచ్చాం మునివర్యా?"

"నిన్న సుమారుగా ఓ రెండు యోజనాలు నడిచాం. ఇవాళ మధ్యాహ్నం లోగా ఓ యోజనమయినా నడిస్తే..."

ఓ వాగులో నీరు తాగి మళ్ళీ నడక మొదలు. కాలం ఈ అడవిలో నిద్ర పోతోందేమో అనిపించేంత నెమ్మదిగా గడుస్తోంది.

మధ్యాహ్నం వేళకి ఓ రెండు ఋష్యాశ్రమాలు కనిపించాయి. గాలవుడు "ఎవరో ఋషులున్నట్టే ఉన్నారు. అక్కడికి వెడదాం" అన్నాడు.

రెండు పర్ణకుటీరాల ముందు విశాలమయిన ఆవరణ ఉంది. చెట్టునుండి చెట్టుకి కట్టిన తాళ్ళ మీద నార బట్టలు ఆరవేసి ఉన్నాయి. ఆ ముందరి భాగంలోనే రెండు బృందావనాలు కూడా ఉన్నాయి.

ఎవరో వచ్చారని ఆశ్రమంలో నుండి బయటికి వచ్చిన ముని, గాలవునికి అర్ఘ్యపాద్యాలను సమర్పించి గౌరవించాడు. గాలవుడు విశ్వామిత్రుని శిష్యుడని విని మరింత సంతోషించాడతను. ఆతను తన భార్యను పిలిచి, మాధవిని లోపలికి తీసుకుని వెళ్ళమని సూచించాడు.

ఆ మధ్యాహ్నం అన్నం, పప్పు, కూరలతో రుచికరమయినభోజనమయింది. ఋషిపత్ని పళ్ళ రసాయనం తెచ్చి యిచ్చింది. మాధవిని ప్రేమగా పలకరించి ఆమె దుస్థితికి తన సానుభూతిని తెలిపింది. రాచనగరు వదిలాక ఆప్యాయతని చవి చూడని మాధవిని ఆమె మాటలు సేద తీర్చాయి.

భోజనాలయ్యాక మధ్య గదిలో కూర్చుని మునులిద్దరూ విశ్రాంతిగా మాట్లాడుకోసాగారు; మాధవి, ఋషిపత్ని లోపలి గదిలో కూర్చున్నారు.

"విశ్వామిత్రుల శిష్యులంటే మీరు చాలా అదృష్టవంతులు. ఇంతదూరం తాము ఎందుకు దయచేసినట్టు ?"

గాలవుడు తన ఉద్దేశాన్ని వివరంగా తెలిపి "ఈ ప్రాంతాలు నాకు కొత్త. ఇక్కడ దగ్గర్లో పెద్ద రాజులున్నారా ?" అనడిగాడు.

"నాకు తెలిసినంత వరకూ అయోధ్య పెద్ద నగరం. సూర్యవంశపు హర్యశ్వుడు దానికి రాజు. ఆతడు ఉదారుడు. యజ్ఞ యాగాదులకు అక్కడికి వెళ్లాను."

"సరే అయితే...అయోధ్య ఇక్కడి కెంత దూరం ?"

"ఇక్కడి నుండి రెండు యోజనాలు ఉత్తరంగా వెళ్ళండి. అక్కడ ఓ ఉపనది తగుల్తుంది. దానిలో నీరేం ఉండదు. నడిచే దాటవచ్చు. అక్కడ ఈశాన్యానికి తిరిగి ఆరు యోజనాలు పోతే సరయూ నది వస్తుంది. దాని కుడి వైపున అయోధ్య ఉంది."

"అంటే ఇక్కడినుండి నాలుగైదు రోజుల ప్రయాణం..."

తన లక్ష్యం నిశ్చయమయిందని గాలవునికి సంతోషం కలిగింది. దాంతో ఆ రాత్రి అక్కడే ఉండమన్న ఋషి కోరికను మన్నించాడు.

ఆధ్యాత్మిక చింతన ఉన్న మునివర్యుల మాట నిరాఘాటంగా సాగి పోతోంది. తన సందేహాలు ఎన్నిటినో గాలవుని ముందు పెట్టాడు ఆ ముని.

"పుణ్య లోకాల్ని పొందటానికి ఏమేం మార్గాలున్నాయి ?"

"స్వర్గప్రాప్తికి ఏడు మార్గాలున్నాయని మా గురువుగారు చెప్పారు. తపస్సు, దానం, ఆత్మసంయమనం, ఇంద్రియ నిగ్రహం, లజ్జ, ఋజుత్వం,

సర్వభూతానుకంపన. ఈ మార్గంలో నడిచే వారికి అహంకారం ఉండకూడదు. ఎక్కువ స్వాభిమానం కూడదు...'

లోపలి గదిలో దర్భాసనం మీద కూర్చుని ఋషిపత్నితో మాట్లాడుతున్న మాధవి చటుక్కున అడిగింది: "అక్కా. సర్వభూతానుకంప ఉంటే గాలవులవారు నన్ను బలిపశువుగాతీసికెళ్ళేవారా?"

సానుభూతితో ఋషిపత్ని: "చెల్లీ. ఇవన్నీ ఉపదేశ మివ్వటానికే, ఆచరించటానికి కాదు. అందరు ఋషులూ ఇలాగే నడుచుకోవాలన్న నియమం ఏమీ లేదు. ఇవన్నీ బోధించిన విశ్వామిత్రులవారు మేనక, ఘృతాచులతో సంసారం చేయలేదూ?" అన్నది.

బయట గదిలో ఋషి అడుగుతున్నాడు: "అన్నిటిలో శ్రేష్ఠమయిన కర్మలు ఏమిటో తెలుపుతారా?"

"అగ్నిహోత్రం, మౌనం, అధ్యయనం, యజ్ఞం- ఇవి నాలుగు ఉత్తమ మయినకర్మలు. ఇంకొకరిమెప్పుకోసం వైభవోపేతంగాఅగ్నిహోత్రంచేయకూడదు. మనస్సు మౌనంగా పరమాత్మలో లీనం కావాలి. అధ్యయనం వల్ల జ్ఞానసేకరణ జరుగుతుంది. జ్ఞాన సంచయనంతో మనస్సు నిండుకుండలాగా అవుతుంది. అప్పుడు క్రోధం, అహంకారం నశిస్తాయి. యజ్ఞం ఇంకొకరి వినాశానికి కాదు చేసేది. అది కేవలం ఆత్మోద్ధారానికి."

"అయితే అన్ని కర్మల ఉద్దేశం కూడా ఒకటేనా?"

"అవును. అది ఆత్మ సాక్షాత్కారం."

"అబ్బ, ఎంత బాగా చెప్పారు. అరటి పండు ఒలిచి చేతిలో పెట్టినట్టే చెప్పారు. నేను ధన్యుణ్ని."

మాటల్లో పొద్దుపోవటం తెలీనేలేదు. సూర్యుడు అస్తమించే సమయానికి సంధ్యా కర్మలకని లేచారు మునులిద్దరూ.

మరునాటిరోజు ఉదయం ఋషిపత్ని మాధవి చేతికి ఆకుల్లో చుట్టిన అరటి పళ్ళను 'త్రోవలో తినమ్మా' అంటూ ఇచ్చింది. మళ్ళీ వెంటనే ఏదో మర్చిపోయి

నట్టు పర్ణకుటీరంలోకి వెళ్ళి ఓ కృష్ణాజినాన్ని చుట్టి ఇచ్చి "చలిగా ఉన్నప్పుడు కప్పుకో చెల్లీ" అంది. ఆమె ఆప్యాయతను చూసి మాధవి గొంతుమీది నరాలు బిగాయి.

ప్రయాణం ఎప్పటిలాగానే ఉత్సాహ రహితంగా ఉంది. కాని ఆ బాట మరీ నిర్జనంగా లేదు. అక్కడక్కడా వటువులో, ఋషుల శిష్యులో కనబడేవారు. గాల వుని, అతని వెంటవున్న మాధవినీ ఆశ్చర్య కుతూహలాలతో చూస్తూ ముందుకు నడిచేవారు వాళ్ళు. దూరంలో ఎక్కడ్నుండో జలపాతపు హోరు వినిపిస్తోంది. ఆ అరణ్యం ఇప్పుడు మేలి ముసుగు తీసి నిలబడింది.

సంధ్యా సమయానికి ఆ ఉపనదిని చేరారు వాళ్ళు. నదిలో నీరు తక్కువగా ఉండటంతో ఇసుక దిబ్బలు కనిపిస్తున్నాయి. సారస పక్షుల మధురమయిన పిలుపునకు మాధవి మనస్సు ఎగిరి గెంతువేసింది. చక్రవాక దంపతులు పద్మ ధూళితో నిండిన రెక్కలను విప్పుకొని వయ్యారంగా నడుస్తుంటే, రాజభవనంలోని నృత్యాలు గుర్తుకొచ్చాయి.

నదీ తీరం నిర్జనంగా ఉండటంతో ఓ బండ వెనక్కి వెళ్ళి స్నానం చేసింది మాధవి. కట్టుకున్న చీరను ఉతికి ఇసుక మీద ఆరవేసింది. ఆ నారచీరను కట్టుకుంటూ తన శరీరం చూసుకుని తనను వరించేందుకు రాజకుమారుడు రాడు కదా అని చింతించింది.

ఇక అయోధ్యకు వెళ్ళాలి. అక్కడి రాజు ఎలాగుంటాడో! హర్యశ్వుడట! విచిత్రమయిన పేరు. దయాళు వయుంటాడా? అందగాడూ, సద్గుణవంతుడూ అయి వుంటాడా? వయస్సు ఎంత ఉంటుందో!

అది తల్చుకునేసరికి వణికింది ఆమె హృదయం. ప్రశ్నించే అధికారం లేదు; తాను అమ్మకపు వస్తువు– అంతే. మాధవి రాబోయిన ఏడుపును దిగ మింగింది.

• • • •

అయోధ్యాపతి హర్యశ్వుడు రాజమందిరంలో మంత్రితో చదరంగం ఆడుతూ కూర్చున్నాడు. రాజు ఎడం చేతివేపున సువర్ణ ఖచిత పీఠం ఉంది. దాని మీద రజత మద్య పాత్ర ఉంది– అప్పుడప్పుడూ మద్యం సేవిస్తూ ఆడుతున్నాడు రాజు.

హర్యశ్వుని వయస్సు సుమారు ఏభై ఉంటుంది. తల వెంట్రుకలు తెల్లగా అవుతున్నాయి. అంత పెద్ద పొట్ట లేకపోయినా ముఖంలో రాజకళ కనబడు తోంది. కట్టుకున్నది ఎర్రటి పట్టుపంచె. భుజం మీద ఓ తెల్లటి ఉత్తరీయం. చేతికి కంకణం, చెంప కుండలాలు. తలమీద కిరీటం లేకపోవటాన నుదుటి మీద బొట్టు పెద్దగా కనిపిస్తోంది. ఆ చిన్న చిన్న కళ్ళను మరింత చిన్నవిగా చేసి హ హ్హ హ్హ అని నవ్వటం అతని స్వభావం.

గాలవుడు మాధవితో అక్కడికి రాగానే మునిపుంగవుని చూసి రాజులేచి నమస్కరించాడు. అర్ఘ్య పాద్యాదులయ్యాక రాజు మాధవినే తదేకంగా చూస్తూ 'ఈ కన్య ఎవరు?' అని ప్రశ్నించాడు.

—ఇతడా హర్యశ్వ మహారాజు! ఇతనికి తన తండ్రి వయస్సుండవచ్చు. మాధవి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఈమె చంద్రవంశానికి చెందిన యయాతి మహారాజు కుమార్తె. గురుదక్షిణ పొందటం కోసం రాజు ఈమెను నాకు దానం చేశాడు."

హర్యశ్వుడు మళ్ళీ మళ్ళీ మాధవినే చూశాడు.

"మునివర్యా, ఈ కన్యను చూడగానే మోహించాను. కన్యాశుల్కానికి గాను ఎంత ధన కనకాదులు కావాలె చెప్పండి. కావాలంటే ఈ రాజ్యాన్ని కూడా ఇచ్చేస్తాను."

రాజుకి మత్తెక్కుతున్నదనీ. యుక్తాయుక్త జ్ఞానం లేకుండా మాట్లాడు తున్నాడనీ మంత్రికి తోచింది.

ఈ రాజు బాగా ధనవంతుడిలా ఉన్నాడు. బహుశా ఇతని వల్ల తన పని పూర్తవుతుందని సంతోషించిన గాలవుడు– "మహారాజా! రాజ్యం తీసుకుని నేనేం చేసుకోను? నాకు ధనకనకాలు వద్దు. శరీరమంతా తెల్లగానూ ఓ చెవి మాత్రం నల్లగానూ ఉన్న ఎనిమిది వందలు గుర్రాల్ని ఇచ్చెయి. అది చాలు నాకు. అప్పుడు ఈ కన్య నీ దవుతుంది" అన్నాడు.

హర్యశ్వుడు హహ్హహ్హా అని నవ్వి-

"అంతే కదా! మంత్రీ, మన అశ్వశాలలో అలాంటి గుర్రాలు ఉన్నాయా? చూడండి" అని ఆజ్ఞాపించాడు.

"ఉన్నట్టు లేదే! అయినా చూద్దాం" అనుకుంటూ మంత్రి బయటికి వెళ్ళాడు.

హర్యశ్వుడు మాధవి దగ్గరకు వస్తూ "సుందరీ! నీ పేరేమిటి?" అనడిగాడు అతనినుండి వస్తున్న మద్యం వాసన, చెమట వాసనా కలిసి మాధవికి కడుపులో తిప్పినట్టయింది.

మాధవి జవాబు చెప్పక పోవటంతో గాలవుడే చెప్పాడు.

"లోకోత్తరమయిన పేరు. ఈ నార చీరల్లోనే ఇంత అందంగా కనిపించే ఈ యువతి అందమయిన వస్త్రాల్లో ఇంకెంత అందంగా కనిపిస్తుందో!" అంటూ లొట్టలు వేశాడు రాజు.

మాధవికి ఆ మాటలు విని అసహ్యం వేసింది.

"మునీంద్రా, మీరు విశ్రమించండి. ఎవరక్కడ?" అన్నాడు రాజు. ప్రతీహారి ఒకతె లోపలికి వచ్చింది.

"ఈ రాజకుమారిని అంతఃపురానికి తీసుకుని వెళ్ళండి. స్నానమయ్యాక రాజయోగ్యమయిన వస్త్రాలతో అలంకరించమని రాజాజ్ఞ అయిందని చెప్పు."

మాధవి గాలవుని వేపు తిరిగింది. "వెళ్ళు" అన్నా డతను.

ఆమె అలా వెళ్ళిన రెండుక్షణాల్లో మంత్రి వెనక్కి వచ్చాడు. "మహాప్రభూ! మనవద్ద అలాంటి అశ్వాలు రెండువందలు మాత్రం ఉన్నాయని తెలిసింది" అన్న మంత్రి మాటలకు ఎనలేని విచారం కలిగింది రాజుకు.

"ఇప్పుడేం చేద్దాం? నాకీ కన్యను వదులుకోవాలని లేదు."

గాలవునికి చాలా నిరుత్సాహం కలిగింది- మాధవిని ఇక్కడ వదిలిపెట్టి గురుదక్షిణ తీసుకుని, విశ్వామిత్రుని కర్పించి, అడవికి పోయి తపస్సు చేసుకుందామనుకుంటే మళ్ళీ తలనొప్పి తగుల్కొందే అని.

ఉన్నట్టుండి హర్యశ్వుడు హ హ్హా హ్హా అని నవ్వాడు.

"ఒక మార్గం ఉంది. మాధవి వల్ల నేను యథేచ్ఛగా కామసుఖం అనుభవించి పుత్ర సంతానం పొందుతాను. ఆ తరువాత నేను మీకామెను వెనక్కిచ్చే

స్తాను. అప్పుడు ఇంకో రాజు కర్పించి మిగిలిన అశ్వాలను తీసుకోండి. దీనిలో తప్పేముంది?"

తప్పేమిటి— అని గాలవుడు తన్ను తానే ప్రశ్నించుకున్నాడు.

ఇది తప్పే అనిపించింది అతనికి. కాని తప్పయితే మరో దారి ఏది? ఇప్పుడు మాధవి నిక్కణ్ణుంచి తీసుకుని పోయినా మరో రాజు వద్ద అన్ని గుర్రాలూ దొరుకుతాయన్న నమ్మకం ఉందా? ఒకే రాజు వద్ద అన్ని గుర్రాలూ దొరికితే బాగుండును. ఆ మాధవి నుదుటి రాత ఇలాగుంటే ఎవరేం చేస్తారు? ఎలాగూ నీట్లో దిగాం. ఇక చలి అంటే ఎలా? ఎలాగైనా గురుదక్షిణ సంపాదించటం నా ఏకైక లక్ష్యం అనుకుంటూ గాలవుడు—

"అలాగే కానీ. ఇవాళ కార్తీక శుద్ధ పూర్ణిమ. ఇవాల్టికి సరిగ్గా సంవత్సరానికి వస్తాను. అప్పుడు మాధవిని నా కప్పగించాలి" అన్నాడు.

# 6

సర్వాలంకృతురాలయిన మాధవి శయన మందిరంలో ఓ పీఠం మీద కూర్చుంది. సువాసన తైలాల దీపాలు మందమయిన ప్రకాశా న్నిస్తున్నాయి. చుట్టూ సుగంధాల పరిమళం- అన్నిటి మధ్యా మాధవి మనస్సు మాత్రం అంత ర్ముఖమై ఉంది. తన స్వయంవరపు కల-వందలాది రాజకుమారులు చేరిఉన్నారు. వారందరిలో అత్యంత సుందరాంగుడూ, తేజస్వీ అయిన రాకుమారుడికి తాను మాల వేస్తుంది. అతని చేయి పట్టుకుని అగ్ని ప్రదక్షిణ చేసి వధువై అతని ఊరికి పల్లకీలో వెడుతుంది. అక్కడ శయ్యాగృహంలో అతని కోసం కాచుకున్న తాను...

గజ్జల చప్పుడికి మాధవి కంగారుగా తలెత్తింది. ఇక్కడెవరూ లేరు. స్ఫటి కపు శయన మంటపానికి కట్టిన చిరుగజ్జలు గాలికి శబ్దం చేశాయి, అంతే. మంటపం అంచుల్లో రక రకాలుగా చెక్కిన దంతపు చెక్కడాలు, దాని అవతల బంగారు నగిషీపని చేసిన మంచం పైన ఖరీదైన పాన్పులు. తలవేపున ముత్యాల తోరణాలతో అలంకృతమయిన చంద్రబింబం లాంటి శ్వేత ఛత్రం. మంటపం చుట్టూ రక్తా శోక పుష్పాల దండలు వేలాడుతున్నాయి. సువర్ణమయ దీపస్తంభాల్లో వెలుగు తున్న దీపాలు, మంచం నాలుగు వైపులా ఉన్న కీలు బొమ్మలు విరామం లేకుండా వింజామరలతో వీస్తున్నాయి.

మంచం పక్కన సువర్ణ పాత్రల్లో బాగా పండిన పళ్ళు, రకరకాల ద్రాక్షారసాలు. తమలపాకుల పళ్ళాలు అన్నీ అమర్చారు.

"మహాప్రభువుల వారు విజయం చేస్తున్నారు" ప్రతీహారి హెచ్చరిక మాధవి చెవిన పడింది. అలాగే కూర్చుంది. కళ్లు మాత్రం తలుపులు మూసి లోపలికి వచ్చిన రాజు మెట్టు పాదాల్ని చూశాయి.

చందనానులేపనంతో సింగారించుకున్న మహారాజు హర్యశ్వుడు తెల్లటి పంచకట్టి తెల్లటి ఉత్తరీయం భుజం మీద వేసుకుని ఉన్నాడు. ఎక్కువ అభరణా

లేమీ వేసుకోలేదు. కనుక ఆ బొజ్జ మరింత స్పష్టంగా కనిపిస్తోంది. అతని కళ్ళలో మాధవి సౌందర్యాన్ని దోచుకోవాలన్న కామాతురత ఉంది.

మాధవి లేచి నిల్చుంది. కాని తలెత్తి రాజుని చూడలేదు.

హర్యక్ష్వుడు దగ్గర్లోని పానపాత్రనుండి సురను వొంచుకుని తాగి పక్కమీద కూర్చుని, "ఏదీ దగ్గరకు రా" అని పిల్చాడు.

రాతి బొమ్మలా మాధవి అతని వద్దకు వచ్చింది. రాజు ఆమెను లాక్కుని తన పక్కన కూర్చోపెట్టుకున్నాడు.

"నీ ముందు అప్సరసలు కూడా దిగదుడుపే" అన్నాడు.

దానికీ మాధవినుండి జవాబు లేదు, రసికుడైన రాజు ఆమె తల నిమిరాడు. వీపు మీద చేయి వేశాడు.

ఆమె మాత్రం రాయిలాగానే ఉండిపోయింది.

"ఎందుకూ? విసుగా?"

"... ... ... ..."

"ఇలా చూడు. నేనంటే ప్రీతేనా? చెప్పు?" (ప్రీతి అంటే ఏమిటి? తారుణ్యానికి యౌవనం జత కావాలి. మనస్సులు ఒకటి కావాలి. రెండూ లేకపోతే?)

"నాకు తెలియదు."

"పసిపాప. ఏమీ తెలీదు. హహ్హహ" అని రాజు నవ్వుతూ ఆమెను గట్టిగా కౌగలించుకుని చుంబించాడు.

"నన్ను చూస్తే నీకే మనిపిస్తుంది?"

(-నిజం చెప్పాలంటే నా తండ్రిని చూసిన ట్టనిపిస్తుంది)

"ఏమీ అనిపించదు."

"ప్రీతి చూపటం నేర్చుకోవాలి పిచ్చిపిల్లా! అది తనకు తానై రాదు. ఏదీ దగ్గరకు రా. నేను నేర్పుతాను."

హర్యక్ష్వుడు ఆమెను పక్కమీదకు తోశాడు. ఆమె స్తనాలపై చేయి వేశాడు. మాధవి మూలుగుతూ కళ్ళు మూసుకుంది ..

రాత్రి గడిచి తెల్లవారింది. పగలు మళ్ళీ రాత్రయింది. మాధవికి మాత్రం పగలూ రాత్రుల మధ్య ఏమీ తేడా కనిపించలేదు. ఎప్పుడూ మనస్సును ఆవరించిన స్తబ్దత! పగలు దాసీజనం వాద్యాలు వాయించి మనస్సును రంజింప చేస్తారు. విసుగయితే తిరగటానికి ఉద్యానవనముంది. కాని మాధవికి మాత్రం అవేం వద్దు. మాట్లాడితే సఖి కనకాంబరితో మాత్రం. ఆమె చారునేత్రలా అందగత్తె కాదు. కాని సహృదయురాలు. చూసిన కొన్ని రోజుల్లోనే మాధవంటే అభిమానం కలిగిందామెకు.

ఓ రాత్రి ఉన్నట్టుండి మాధవికి గాలవులవారు గుర్తుకొచ్చారు.

"గాలవ మునులవారు ఎక్కడున్నారు?" అని హర్మ్యశ్వుడ్ని అడిగింది మాధవి.

"ఆయన అడవికి ఆ రోజే వెళ్ళిపోయారు. ఏం?"

"నాకు చెప్పి వెళ్ళలేదు. అందుకు ఇంకా రాజభవనంలోనే ఉన్నారేమోనని అడిగాను."

"మళ్ళీ వస్తారుగా. అందుకే చెప్పి వెళ్ళలేదేమో."

మాధవికి కుతూహలం కలిగింది.

"ఎప్పుడొస్తారు?"

"వచ్చే సంవత్సరం."

గాలవుల వారు మళ్ళీ ఎందుకు వస్తారన్న ప్రశ్న నోటిదాకా వచ్చినా మాధవి అడగలేదు. అతనికి తనకూ ఏం సంబంధం? రాజు నుండి కన్యాశుల్కం తీసుకుని గురుదక్షిణ అర్పించి గాలవుడు వెళ్ళిపోయి ఉండాలి. అతని జ్ఞాపకలెందుకు అనుకుంది.

కృష్ణపక్షం గడిచి శుక్లపక్షం వచ్చింది. ఒకదాని వెనక ఒకటి దాగుడు మూతలాడుకున్నాయి. యాంత్రిక జీవనం గడుపుతున్న మాధవికి ఇక్కడ రాజ భవనంలోని వైభోగాలన్నీ ఉన్నా పుట్టింటి జ్ఞాపకాలే ఎక్కువ.

కనకాంబరి వద్ద చారునేత్ర. అవ్వలగురించి చెప్పింది. తండ్రి. పిన్నమ్మల గురించి వర్ణించింది.

అప్పుడు కనకాంజరి "రాకుమారీ, మీ కిక్కడ దేనికీ లోటు లేదు. మీరు నిజంగా అదృష్టవంతులు. రాజుగారు మిమ్మల్ని ఆదరించినట్టుగా మరెవర్నీ ఆదరించటం నేను చూడలేదు." అంది.

మాధవి బాధగా నవ్వింది. పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణసంకటం. తన బాధ కనకాంజరికి అర్థం కాదు- అనుకుంది.

"మహారాణిగారికి మీ మీద కోపం వచ్చిందిట."

"ఎందుకమ్మా? ఈ నిర్భాగ్యురాలి మీ దెందుకు కోపం?"

"మహారాజుగారు రాణీగారి అంతఃపురం వేపే వెళ్ళటం లేదట."

'అది నా తప్పుకాదు కనకాంజరీ, నువ్వది మహారాణీగారికి చెప్పాలి."

"అమ్మో. ఆ మాట మాత్రం అనకండి. ఆవిడ వద్ద మాట్లాడి జయించే వాళ్ళుంటారా? మీలా కాదమ్మా ఆవిడ-"

ఈ విషయం రాజుతో చెప్పేదా అని మాధవి ఓ క్షణం ఆలోచించింది. మళ్ళీ వద్దనిపించింది. తాను రమ్మనే అధికారంలేని వ్యక్తి. రావద్దని చెప్పే ధైర్యం కూడా లేదు తనకు.

ఓ రోజు ఉదయం ఉద్యానవనంలో తిరుగుతుండగా మాధవికి కళ్ళు చీకట్లు కమ్మాయి. దగ్గరలోనే ఉన్న శిలావేదిక మీద కూర్చుంది. ఇంకేం, కింద పడబోతున్న మాధవిని కనకాంజరి పట్టుకుంది. సఖు లందరూ పరిగెత్తుకొచ్చారు.

"వట్టివేళ్ళ వీవన తీసుకురా."

"పన్నీరు చల్లండి."

"రాజ వైద్యులకు కబురు పంపండి."

ఓ రెండు నిమిషాల్లో కళ్ళు తెరచింది మాధవి. ఆమె చుట్టూ ఆత్రుతతో నిల్చున్న సఖీ బృందాన్ని చూసి ఆశ్చర్యపోయింది.

"ఏమయింది రాజకుమారి? ఇప్పుడు కులాసాగా ఉందా? మా కందరికీ భయం వేసిందే" అని కనకాంజరి అడిగింది.

ఉద్యానవనం నుండి నెమ్మదిగా అంతఃపురానికి నడిచి వచ్చి మాధవి హంస తూలికా తల్పం మీద పడుకునే వేళకి వృద్ధ దాసి ఒకతె వచ్చి అందర్నీ

బయటకు పంపి మాధవి కడుపు ముట్టిచూసి "బహిష్టు అయి ఎన్ని నెలలయింది?" అనడిగింది.

మాధవి జవాబు విని ఆ ముసలి దాసి తన బోసి నోటితో పెద్దగా నవ్వి "మార్గశిరం, పుష్యం, మాఘం-మూడ్నెల్లయ్యాయి. భయం లేదు. చక్రవర్తి అయ్యే కొడుకు పుడతాడు." అని వెళ్ళిపోయింది.

చక్రవర్తి అయ్యే కొడుకు, తనకు అక్కర్లేని బిడ్డ, తాను కోరుకోని బిడ్డ. అదీ ఇంత తొందరగా? మాధవి కళ్ళలో నీళ్లు నిండాయి.

లోపలకు వచ్చిన కనకాంబరి మాధవి చేతులు పట్టుకుని సంతోషంతో-

"మంచిదే అయింది. మహారాణిగారికి మగపిల్లలు లేరు. ఇద్దరూ ఆడపిల్లలే. మగపిల్లవాడైతే మీరే పట్టపురాణీ అవుతారు" అంది.

శుభ సమాచారం తెలిసిన మహారాజుకి ఎనలేని సంతోషం. ఈ మారయినా తన వంశాన్ని కొనసాగించే మగబిడ్డ పుట్టాలి అని అతని కోరిక. మాధవికికావాల్సిన వన్నీ చేసి పెట్టమని ఆజ్ఞాపించాడు.

మళ్ళీ మళ్ళీ మాధవిని అడిగాడు. "నీకేం కావాలి చెప్పు?"

"ఏమీ వద్దు."

"వన విహారానికి వెడదామా?"

"వద్దు. నాకేం వద్దు. మీ పట్టపురాణిని తీసుకుని వెళ్ళండి."

"నాకు పట్టపురాణీ వద్దు. మోహపు భార్య కావాలి."

భార్య! మాధవి ఉలిక్కిపడింది. తాను అగ్నిసాక్షిగా రాజు భార్య కాదు. ఈ రాణీవాసంలోని వందలాది స్త్రీలలో తనూ ఒకతే. ఈనాడు యౌవనంలో ఉండగా మోహపు భార్య. ఈ యౌవనం మాయమయితే...?

ఓనాడు కనకాంబరి మహారాణి వద్ద నుండి సందేశం తెచ్చింది.

"మహారాణీగారు మిమ్మల్ని చూడా లనుకుంటున్నారు."

విశాలమయిన అంతఃపురంలో ఒకర్నొకరు చూడకుండా సంవత్సరాల తరబడి గడిపేయవచ్చు. మహారాణిని చూడాలని మాధవికి కుతూహలమూ లేదు.

అవకాశం కూడా రాలేదు. ఇప్పుడామె రాజై కబురు పంపినప్పుడు కూడా వెళ్ళక పోతే మాట పడాల్సి వస్తుంది. ఆమెకు తనమీద సవతి మాత్సర్యం ఉన్నమాట నిజమే. కాని తను మాత్రం నిగ్రహం కోల్పోకూడదు- అనుకుంటూ మాధవి తన మామూలు దుస్తుల్లోనే మహారాణి అంతఃపురానికి వెళ్ళింది.

మధ్యవయస్సు దాటిన మహారాణి తాను కూర్చున్న స్వర్ణపీఠం మీద నుండి కదలకుండానే 'రా కూర్చో' అంటూ కొంచెం దూరంలో ఉన్న ఇంకో ఆసనాన్ని చూపింది. మాధవి ముగ్ధమైన మోహాన్ని, అపూర్వమయిన సౌంద ర్యాన్ని చూసి మహారాణికి అసూయ కలిగింది. తను పోగొట్టుకున్న యౌవనాన్ని తల్చుకుని కోపం కూడా వచ్చింది.

"నిన్నెందుకు పిలిపించానో తెలుసా?" అ నడిగిందామె.

తెలీదన్నట్లుగా తల అడ్డంగా తిప్పింది మాధవి.

"మహారాజుగారికి ఏం మంత్రం వేశావు అనడుగుదామని పిలిపించాను. నువ్వు వచ్చాక మహారాజుగారు ఒక్క రాత్రయినా నా అంతఃపురానికి రాలేదు తెలుసా ?"

మాధవి దుఃఖంతో తలవంచి "నేనేమీ చెయ్యలేదు మహారాణీ" అంది.

"నువ్విక్కడ ఉండేది ఓ సంవత్సరం మాత్రం. అది గుర్తుంచుకో."

మాధవికి అది కొత్త వార్త.

ఆశ్చర్యంతో "ఓ సంవత్సరం మాత్రమా? ఎందుకూ?" అని ప్రశ్నించింది.

"ఎందుకలా ఏమీ తెలీని దానిలా నటిస్తావు? ఓ సంవత్సరం పోయాక గాలవ ముని వచ్చి నిన్ను తీసుకు వెళతారట ?"

"ఎక్కడికి ?"

"అది నీకే తెలియాలి" అని వ్యంగ్యంగా అంది మహారాణి.

మాధవికి మళ్లీ కళ్లు చీకట్లు కమ్మినట్లయింది. ఆ తర్వాత మహారాణి తిట్లన్నీ మౌనంగా భరించింది. అవేమీ ఆమె మనసుమీద ముద్రితం కాలేదు.

తన అంతఃపురానికి తిరిగి వచ్చాక కూడా ఆమెకు అదే ఆలోచన. ఈ రాజుకి తనను దానంచేసి కన్యాశుల్కం పొందిన గాలవునికి మళ్లీ తనను తీసుకుని వెళ్లే

అధికారం ఎక్కడిది? లేక మళ్ళీ తండ్రి ఇంటికి తీసుకుని వెడతాడా? అందుకేనా తనతో చెప్పకుండా వెళ్ళిపోయాడా ముని!

ఆ రాత్రి హర్యశ్వుడి వద్ద ఆ మాట ఎత్తితే ఆతడు నవ్వుతూ-

"చూడు, ఎనిమిది వందలు అలాంటి అశ్వాలు నావద్ద ఉంటే నిన్ను శాశ్వతంగా నా వద్ద ఉంచుకునేవాణ్ని. ఇప్పుడు మరో దారి లేదు" అంటూ వారి మధ్య జరిగిన సంభాషణ నంతా వివరించాడు.

దుఃఖంతో మాధవి గొంతు పూడుకు పోయింది. ఒక రాజు వద్ద ఉండి అనుభవించింది చాలక మళ్లీ మరో రాజుతో జీవితమా ?

తల్చుకునే సరికి చిగురుటాకులా వణికి పోయింది మాధవి. తనంత నతద్రష్ట (దురదృష్టవంతురాలు) మరొకతె లేదు అనుకుంటూ రోదించసాగింది మాధవి. ఆమెను ఓదార్చ వచ్చిన రాజు చేతిని తీసి విసిరేసి దూరంగా పడుకుంది.

# 7

చైత్రమాసం వస్తూండగానే అయోధ్యా నగరంలో వసంతోత్సవాల ఏర్పాట్లు మొదలయ్యాయి. చైత్ర శుద్ధ అష్టమితో మొదలయి దశమితో ఆఖరయ్యే మూడురోజుల ఉత్సవానికి చుట్టుపక్కల రాజ్యాలనుండి ఆశ్రితులూ-శ్రీమంతులూ విచ్చేస్తున్నారు. రాజభవనం, నగర ద్వారాలను గంధ పుష్పాలతో. సుగంధ ధూపదీపాలతో అలంకరించారు. ఎత్తైనశిఖరాలపైన మంగళధ్వజాలు స్థాపించాడు. రాజమార్గమంతా సుగంధశీతల జలంతో శుభ్రం చేశారు. నాలుగు వీధులు కలిసే చోట వేర్వేరు వ్యక్తుల్ని నియమించి, అభ్యాగతులను అన్నభక్ష్యాలు, దక్షిణ. పుష్పహారాలతో సత్కరించే బాధ్యత అప్పగించారు.

అంతఃపురంలో కూడా హడావిడిగా ఉంది. దాసీజనం నేల శుభ్రంగా కడిగి గడపలకు రంగులు వేస్తున్నారు. రాజభవనంలో ఉన్నా, అనాసక్తంగా అతిథిలాగా ఉన్న మాధవి "ఈ హడావిడి అంతా దేనికి కనకాంబరీ?" అనడిగింది.

"వసంతోత్సవానికి మా అందరికీ మహారాజుగారు ప్రత్యేకమయిన బహుమతు లిస్తారు. మూడురోజులు రాజసభలో నృత్యం సంగీతం కవిసమ్మేళనం అన్నీ జరుగుతాయి. మీరూ చూడటానికి వస్తారుగా!"

అంతఃపురంలో అందరూ వస్తారా?"

"ఊఁ మరి. మేడమీదంతా మనమే ఉంటాం."

అంతఃపురపు కారాగారం నుండి బయటకు వెళ్ళి స్వేచ్ఛా వాయువులు పీల్చే అవకాశం ఇది. మాధవి దుఃఖతప్త హృదయం ఆ మార్పుకు స్వాగతం పలికింది.

బంగారంతో తాపటం చేసిన ఆస్థాన భవనం విశాలమయింది. వెండి, బంగారాలతో అలంకరించిన స్తంభాలు సభాస్థలికి ప్రత్యేకమయిన శోభను చేకూరుస్తు

న్నాయి. రకరకాలయిన పూలమాలలతో అలంకరింపబడిన భవనం కళ్ళకు మిరుమిట్లు గొలుపుతోంది. సభామందిరం మధ్యను ఎత్తైన కనకపు సింహాసనం. కొంచెం పక్కన రెండు వైపులా ఆసనాలు. మధ్య అమృతశిలావేదిక. దానికి అవతల ప్రజలు కూర్చునేందుకు ఆసనాలు ఉన్నాయి.

వసంతోత్సవం మొదలయ్యే రోజున ఉదయమే సభా భవనంలో జనం చేరసాగారు. ఎక్కడా గొడవ జరగకుండా ఉండటం కోసం దండ ధారులయిన భటులు అక్కడక్కడా నిలిచి అందర్నీ వారి వారి చోట్లలో కూర్చుండ బెడుతున్నారు. పండితులు, గాయకులు, నటులు, వైద్యులు, భట్టులు, జ్యోతిశ్శాస్త్ర పారంగతులు మల్లులు, ఆటగాళ్ళు, మాంత్రికులు, రౌతులు, సేవకులూ, సఖికలు వీరితో పూర్తిగా సభ నిండిపోయింది.

"బహు పరాకు, సూర్యవంశ తిలక, వైరి మార్తాండ, మహారాజ హర్యశ్వ పరాకు..." అని వంధి మాగధులు స్వరమెత్తి పలికారు.

రత్న ఖచిత కిరీటాన్ని, కనకాంగద కేయూరాల్ని ధరించి, పీతాంబ రాలంకృతుడై, పూలమాలల్ని ధరించిన హర్యశ్వుడు, గంభీరమయిన నడకతో సభా భవనాన్ని ప్రవేశించాడు. అన్ని మూలల్నుండీ జయ జయ నినాదాలు వెలువడ్డాయి.

రాజు ఎడమ కాలిని మడిచిపెట్టి కూర్చున్నాడు. గండిపెండేరం ఉన్న కుడి కాలిలోని బంగారు పాంకోడు విడవకుండా పాదపీఠం మీద పెట్టాడు. కుడిచేతిలో పట్టుకున్న బంగారు ఒరలో ఉన్న కైజారు కిందకు వేలాడుతోంది. కస్తూరి తిలకం ఆతని ముఖానికే కళ నిచ్చింది. అలా ఠీవిగా కూర్చోవటంతో రాజు తన వయసు కన్నా చిన్నవాడుగా కనబడుతున్నాడు. రాజు కుడివేపు ఆసనాల్లో మంత్రీ, మంత్రి కుమారుడు. ఎడంవేపు ఆసనంలో సేనాపతీ. మిగిలిన ఆసనాల్లో సామంతులూ కూర్చున్నారు. రాజుకు శ్వేతచామరాలను శంఖినులు వీస్తున్నారు. వట్టివేరు వీవనలను చిత్రినులు వీస్తున్నారు. అంతఃపురంలోని వారంతా మేడ మీద నుండి రాజసభను తిలకిస్తున్నారు.

రాజు గాయకుల వైపు చూశాడు. వారు అహిరి, భైరవి, ధన్యాసి రాగాల్ని ఆలాపించారు. వారి రాగ తాళాల సమ్మేళనం సంగీతం రసజ్ఞులయిన ప్రేక్షకుల్ని మైమరపించింది. ఆఖరున కుశళు మంగళాష్టకాన్ని మంగళ కౌశికలో పాడారు.

భట్రాజులు కొత్తగా పద్యాలు కట్టి సుమధుర కంఠంతో ఆలాపించారు. వస్తాదులు తమ శక్తి సామర్థ్యాలను ప్రదర్శించారు.

"అద్భుతంగా ఉంది మీ ప్రదర్శనం" అని హర్యశ్వుడు కళాకారులను పొగిడాడు. పరిచారిక తెచ్చి ఇచ్చిన బంగారు పళ్లెంనుండి వారికి బంగారు నాణాలను పంచాడు.

పైన కనకాంబరితో కూర్చుని అంతా తిలకిస్తున్న మాధవి ఉన్నట్టుండి "మంత్రిగారి పక్కన కూర్చున్నది ఎవరే?" అనడిగింది.

ఓ ఇరవయ్యేదేళ్ళ యువకు డతడు. పొడుగ్గా, బలంగా, మంచి రంగులో మెరిసిపోతున్నాడు. భుజంవరకూ ఉన్న జుత్తును వెనక్కి దువ్వాడు. ఒరలో ఖడ్గం ఉంది. ధైర్య సాహసాలు అతని ముఖంలో ఉట్టి పడుతున్నాయి.

"అతనా? మంత్రిగారి ఏకైక పుత్రుడు."

"అలాగా..."

—రాజకుమారులను సిగ్గిల చేసే ధీరత్వం. ఇతను కాని నా స్వయంవరానికి వస్తే ఇతనికే మాల వేసేదాన్ని.

"మాధవీ! ఓ రహస్యం చెప్పనా? మహారాజుగారికి మగపిల్లవాడు పుట్టక పోతే మంత్రికుమారుడు ఇతడే రాజు అవుతాడని కూడా చెప్పుకుంటున్నారు."

మాధవి ఆ అందగాణ్ణి తదేకంగా చూసింది. అనుకోకుండా తలెత్తిన మంత్రికుమారుడు తన్నే పరిశీలనగా చూస్తున్న ఆ నేత్రద్వయాన్ని చూశాడు. ఎవరామె? అపూర్వసుందరి అని తండ్రి చెప్పిన మాధవి కాబోలు అనుకున్నాడు. అతడూ ఆమెను మళ్లీ మళ్లీ చూశాడు. మాధవి శరీరం పులకరించింది. అంతలో ఆమె గర్భంలోని శిశువు కదలింది. మాధవికి సన్నగా వణుకు పుట్టింది. రాజ శిశువును మోస్తున్న తాను చేసిన పని ఏమిటి? మళ్ళీ తల పైకెత్తలేదు మాధవి.

క్రింద ప్రేక్షకులందరూ హర్షధ్వానాలు చేశారు.

కాలి బంగారు గజ్జెలు ఘల్లు ఘల్లు మనగా మందగతిలో నడిచి వచ్చి నిల్చింది నర్తకి.

"దాని పేరు మనమోహిని అని. రాజుగారికి ఇదంటే మహా ప్రేమ." అంది నెమ్మదిగా కనకాంబరి.

మనమోహిని నర్తించసాగింది. మొదట చాలా మెల్లిగా అడుగులు వేసింది. ఆమె చూపు, చిరునవ్వు. శరీరపు కదలికలు చూసే వారికి కన్నుల పండుగ చేశాయి.

తాళానికి అడుగులువేసే నెమలి వయ్యారాన్ని ప్రదర్శించింది. కిన్నర, వీణ, పిల్లనగ్రోవి, రాగస్వరాల వాదనకు నర్తించే నాగకన్యలా నర్తించింది. మృదంగ, తాళాల గతి కనుగుణంగా సముద్రపు అల ముందుకెగసి వచ్చినట్టే ముందుకు వచ్చింది. అలాగే అల నెమ్మదిగా వెనక్కి మరలే దృశ్యాన్ని కూడా అభినయించింది. లేత ఎండలో నాట్యమాడే నాగుపాములా కుడికీ ఎడమకూ ఎగిరింది. బొంగరంలా తిరుగుతూ నర్తించింది.

ప్రేక్షకులంతా ఆమె నాట్యాన్ని హర్షధ్వానాలతో మెచ్చుకున్నారు.

నర్తకి ముందు రాజుకి నమస్కరించి తరువాత ప్రేక్షకులకు కూడా నమస్కరించి, వయ్యారంగా రాజు వద్దకు వెళ్ళింది. చిరునవ్వుతో రాజు తన కంఠంలోని రత్నాభరణాన్నే తీసి ఇచ్చాడు. మనమోహిని తన కొంగుపరిచి అది అందుకుంది.

ఆ తర్వాత ముగ్గురు నాట్యగత్తెలు వచ్చారు. వారు నడిచి వస్తున్నప్పుడు వారి కంకణాలు, వడ్డాణాలు, కడియాలు, గజ్జెల ధ్వని శ్రవణానందకరంగా ఉంది.

త్రిభంగిలో నిల్చిన ముగ్గురు ఒక్కమారుగా నాట్యం చేయసాగారు.

తమ లతల్లాంటి చేతులతో రకరకాల ముద్రలు పట్టి చూపించారు. వారి అభినయం. భావ ప్రకటనా. వెడల్పాటి కన్నులలో మెరిసే భావం సభికులను రంజింప చేశాయి.

ఉత్సవం రెండవ రోజున కూడా ఇలాంటి కార్యక్రమమే సాగింది. వచ్చిన ఆహూతులకు విందు భోజనాలు దాసీలకు బహుమానాలు లభించాయి.

మూడవరోజు ఊరిలోనున్న విష్ణ్వాలయం వరకూ వైభవంగా ఊరేగింపు వెళ్ళటం సంప్రదాయం.

మహారాజు స్నానం చేసి చందనాను లేపం ధరించి, పీతాంబరం కట్టుకుని, రత్న హారాలు, కేయురాద్యా భరణాలను ధరించి పట్టపు టేనుగుపై అంబారీలో కూర్చున్నాడు. అంబారీపై శ్వేతచ్ఛత్రం, అటూ ఇటూ చామరాలు వీచే దాసీజనం,

ఊరేగింపు ముందరి భాగంలో బంగారు నడికట్లతో అలంకరించబడిన ఏనుగుల మీద అందంగా అలంకరించుకున్న పురుషులు కూర్చున్నారు. వాటి వెనకాల దివ్యాశ్వాల మీద సామంతులూ, అధికారులు వచ్చారు. ఆ తర్వాత ఈటెలు, భల్లాలు, ధ్వజ పతాకాల్ని పట్టుకున్న సైన్యం, పదాతి దళం పురజనులూ నడిచారు.

పుట్టపుటేనుగు ముందు మంగళ వాద్యాలు వాయిస్తూ వాద్య విశారదులు నడిచారు. వంది మాగధాదులు స్తుతి పాఠాలు చదువుతూ నడిచారు, బ్రాహ్మణులు బంగారపు రంగులోని మంత్రాక్షతలు పట్టుకుని వచ్చారు: కన్యలు మంగళ-సూచకంగా పూర్ణంబూరెల పళ్ళెం పట్టుకుని నడిచారు.

ఊరేగింపు వెళ్ళే బాటల్లో పూలను-పేలాలను చల్లారు. దారిపొడవునా పన్నీరు చల్లారు. ఇళ్ళ వాకిళ్ళకు మామిడి తోరణాలనూ, పుష్పమాలల్నూ కట్టారు. ఇంటి ముందు పంచవర్ణపు రంగవల్లులతో సింగారించారు. ఊరేగింపులో శంఖ, దుందుభీ నాదం ఆకాశాన్ని ఛేదిస్తున్నట్టే ఉంది. ఈ ఊరేగింపు చూడటానికి ఊరిలోని స్త్రీలు మిద్దెలు, మేడలు, గోపురాలపైన చేరారు.

"అడిగో మహారాజు, ఆ వెనకాల పల్లకీలలో రాజీవాసం వాళ్ళున్నారట" అని జనం మాట్లాడుకుంటున్నారు. ఇలాంటి సంబరాలు వారికి చాలా అరుదు.

మహారాజు హర్యశ్వుడు విష్ణ్వాలయం ముందు అంబారీ నుండి దిగాడు. బంగారు పొంకోళ్ళను వదిలి గుడిలోకి నడిచాడు. నవరత్న మంటపంలోని విష్ణు దేవునికి పూజచేశాడు. "మహారాజు హర్యశ్వునికి జయం కలగాలి" అన్న జయ ఘోష, గంటల చప్పుడులో కలిసి జగమంతా వ్యాపించింది.

# 8

వసంతోత్సవం గడిచి రెండు మాసాలయినా అంతఃపురంలో ఇంకా అదేమాట, అవే స్మృతులు.

మాధవికి మంత్రికుమారుని జ్ఞాపకం మాటి మాటికీ వస్తూనే ఉంది. అతన్ని చూడాలి, మాట్లాడాలి అని బలమయిన కోరిక కలిగేది. ఎన్నోమార్లు రాజుతో పడుకున్నప్పుడు మంత్రికుమారునితోనే ఉన్నానని భ్రమ పడేది.

రోజులు గడిచాయి. బిడ్డ పెరుగుతున్నట్లల్లా మాధవికి అలసటగా అనిపించేది. మొదటిలా చకచకా తిరగలేకపోయేది. దేనిమీదా ఆసక్తి కలిగేది కాదు.

వృద్ధ దాసి వచ్చి అడిగింది.

"మీరు కులాసాయేనా? కుంకుం పువ్వు వేసిన పాలు రోజూ తాగాలి. మర్చిపోకూడదు."

"ఊఁ"

"ఇప్పుడు మిమ్మల్ని మీరు బాగా చూసుకుంటే ఆరోగ్యం ఉన్న బిడ్డ పుడతాడు. కుంకుమపువ్వు లాంటి కొడుకే పుట్టాలి మీకు."

మాధవికి నవ్వు వచ్చింది.

"కొడుకే పుడతాడని ఏం నమ్మకం? కూతురే పుట్టవచ్చు!"

"ఛ. అలాంటి మాటనకండి. మహారాజుగారికి మగపిల్లాడ్ని ఇవ్వండి. అప్పుడు మీ జన్మ సార్థకం అవుతుంది."

దాసి మాట నిజమే అనిపించింది. మగబిడ్డ పుడితే తన జన్మ సార్థకం కాటమే కాదు, బిడ్డ జన్మ కూడా సార్థకం అవుతుంది. అదే ఆడపిల్ల పుడితే? వద్దు బాబోయి వద్దు. ఇంకో స్త్రీ తనలాగానే ఎందుకు బాధపడాలి? ఆ వృద్ధ దాసి అన్నట్టుగానే చక్రవర్తి అయ్యే కొడుకే పుట్టనీ.

ఆషాఢంలో వాన ఘోరమని కురుస్తుంది. వెలుపలికి ఎక్కడికీ వెళ్ళకుండా ఏకాంతంగా ఉండే మాధవికి కడుపులోని బిడ్డే తోడు. క్రమంగా తాను చూడని ఆ బిడ్డమీద ప్రేమ కలగసాగింది. తన బిడ్డ పెరిగేటప్పుడు ఎవరుంటా రక్కడ ? అతడు చక్రవర్తి అయి పట్టాభిషిక్తుడయేటప్పుడు తానెక్కడ ఉంటుందో ! 'నీ తల్లి ఎవరు?' అనడిగితే బిడ్డ ఎవర్ని చూపెడతాడు? తనకైనా తల్లి చనిపోతే అవ్వ ఆ స్థానంలో నిలిచింది. తన బిడ్డకి తల్లి బ్రతికి ఉండీ పరాకరి చేతిలో పెరగాల్సిన దురదృష్టం పడుతుంది.

ఈ మధ్య మాధవికి మరీ మాటికి పుట్టిల్లే గుర్తు కొస్తుంది. తన కాన్పు సమయంలో అవ్వ, దాసనేత్రా ఉంటే ఎంత బాగుంటుందో అనిపించేది. ఇక్కడి వృద్ధదాసి కూడా మంత్రసానే కదా, భయం లేదు అనిపించేది. తనకు సుళువుగానే కాన్పు అవుతుంది అని తనకు తానే ధైర్యం చెప్పుకునేది.

ఇలా ఉండగా హర్యశ్వుడు వచ్చి, ఆమె నడుం పట్టుకుని కౌగలించుకుని, "నిండు గర్భిణివైనా ఎంత అందంగా ఉన్నావు" అన్నాడు.

"మహారాజా, నన్ను హింసించకండి. ఇంక నా వల్లకాదు" అంటూ విడిపించుకుని పక్క గదిలోకి వెళ్ళిపోయింది మాధవి.

మహారాజు కది ముఖంమీద కొట్టినట్టయింది. కోపంతో అక్కడ్నించి వెళ్ళినవాడు నెలయినా మాధవి ముఖం చూడలేదు.

కనకాంబరి రహస్యంగా చెప్పింది.

"మహారాజుగారు ఇప్పుడు మనమోహిని అంతఃపురానికి వెడుతున్నారట."

రాజుకి స్త్రీ సుఖంమీద ఆశ పోనేపోదా! అని మాధవి ఆలోచించింది. ప్రీతి ప్రేమలనేవి వీరి ఛాయల్లోకి కూడా రావు కాబోలు. వీరికున్నది కోరిక మాత్రం. కొత్త కొత్త ఆడవాళ్ళమీద కోర్కె. భ్రమరంలా క్షణ క్షణానికి కొత్త పూవుమీదికి వాలటమే వారి పని. ఇదెలాంటి జీవితం! జుగుప్సాకరమయిన జీవితం అనుకుంది. కాని కనకాంబరిముందుకూడా ఆ మాట అనలేదు.

భాద్రపదం అడుగు పెట్టింది. మాధవికి చిన్నగా నొప్పులు ప్రారంభమయ్యాయి. మూడవరోజు నొప్పులు ఎక్కువయ్యేసరికి "నేనింక చచ్చిపోతాను" అని భయపడింది మాధవి. ఆమె చేయిపట్టుకున్న వృద్ధ దాసి–

"భయపడకండి. ఈ కషాయం తాగండి. అప్పుడు ఇంకా బాగా నొప్పులు వస్తాయి" అంది. ఈ నొప్పి భరించలేకుండా వున్నాను. ఇంకా బాగా నొప్పి అంటే ఎలా ఉంటుందో! దేవుడే గతి అనుకుంది.

దాసి కషాయం తాగించింది. అది అన్నట్టే నొప్పి ఎక్కువగా రాసాగింది. అంతకన్నా వేరే నరకం ఉండి ఉండదు అనిపించింది మాధవికి. కేకలు పెట్టింది. అరిచింది.

బిడ్డ తల కనిపించగానే దాసి, "అయిపోయింది. ఇంకొక్కమారు నొప్పులు పడండి చాలు" అంది.

మాధవి ప్రయత్నం లేకుండానే నొప్పి దానంతట అదే వచ్చింది. ఆమె శరీరమంతా ఏదో తేలికైన అనుభవం కలిగింది.

"మగబిడ్డ...మగబిడ్డ..." అని సంతోషంతో కేకలు పెట్టింది వృద్ధదాసి. ఆ కేక క్షణ మాత్రంలో అంతఃపురమంతా వ్యాపించింది.

బిడ్డకు వేడినీళ్ళలో స్నానం చేయించి ఎర్రటి పట్టుబట్టల్లో చుట్టబెట్టే సమయానికి మహారాజు హర్యశ్వుడు వచ్చాడు. అతని ముఖం ఆనందంతో వెలిగిపోతోంది. మాధవి చేయి పట్టుకుని నొక్కాడు. బిడ్డను మళ్ళీ మళ్ళీ చూశాడు.

"అంతా నీ రూపమే" అన్నాడు.

"నాదేముంది? అంతా మీదే" అని జీవంలేని నవ్వు నవ్వింది మాధవి.

మహారాజుకు మగబిడ్డ పుట్టిన విషయం అయోధ్యానగరంలో చాటింపు వేయించారు. బళ్ళల్లో మిఠాయి పంచారు.

వీధి వీధుల్లో జనమంతా చేరి ఓ మూల అభినయం, మరోచోట సంగీతం, మరింకోచోట వాద్యగోష్ఠి నడిపించారు.

పౌరాణికులైన సూతులకూ, వంశావళిని కీర్తించేభట్టులకూ రాజు బహుమానాలను పంచాడు. బ్రాహ్మణులకు సువర్ణదానం, గోదానంచేశాడు. శంఖం, దుందుభి మొదలయిన వాద్యాలు మ్రోగాయి. బిడ్డ జన్మకుండలి గుణించారు.

"భాద్రపద శుక్ల చవితినాడు జననమయింది. జనన నక్షత్రం చాలా శ్రేష్ఠమైనది. చక్రవర్తి యోగ్య లక్షణాలన్నీ ఉన్నాయి. బిడ్డకు నక్షత్ర నామం

వసుమంతుడు లేక వసుమనుడు అని పెట్టచ్చు. రాజకుమారుడు తల్లిదండ్రుల కిద్దరికీ పేరు తెస్తాడు" అన్నారు రాజపురోహితులు.

ఆనాడు రాజధానిలో సమస్త బ్రాహ్మణులకు మృష్టాన్న భోజనం వడ్డించారు. రాజకుమారుడి జననానికి నగరమంతా పండగ చేసుకుంది.

మాధవికి బిడ్డమీద విపరీతమయిన వ్యామోహం. ఎన్నిసార్లు చూసినా, ఎత్తుకున్నా తనివి తీరదు. ఇంకింత చూడాలి. మరీ మరీ ముద్దులాడాలి అనిపించేది. బాలింతరాలి గదిలో ఎంతమంది దాసీ జనం ఉన్నా బిడ్డ ఏడవగానే మాధవి లేచి ఉయ్యాల వద్దకు పరిగెత్తేది. ఎత్తుకుని మురిసేది. ఇంకా ఏడిస్తే పాలుపట్టి సముదాయించేది.

కనకాంబరి "బాలింతరాలు ఇలా శ్రమపడ కూడదు. 'బిడ్డనిలా తే' అంటే తీసుకురావటానికి మేము లేమా?" అనడిగేది.

"ఉన్నారు కనకాంబరీ. కాని బిడ్డను ఇంకెన్ని రోజులు నేను ముద్దు చేస్తాను చెప్పు?" అంటూ మాధవి కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుంది.

శుక్లపక్షం దాటి కృష్ణపక్షం అడుగుపెడుతూంటే అంతఃపురంలో ఉత్సాహం సన్నగిల్ల సాగింది. బిడ్డ ఆటపాటల్లో అందరూ నవ్వుతున్నా, మాధవిని చూడగానే అందరి ముఖాలు కళావిహీన మయ్యేవి. ఆశ్వయుజం దాటి కార్తీకం వస్తే గాలవుడు వస్తా డన్నది ఇప్పుడందరికీ తెలిసిన విషయమే.

బిడ్డపైన వ్యామోహం కూడదు. అతణ్ని తానింక ముట్టకూడదు. వాణ్ణించి దూరంగా పోవటానికి తన మనస్సుని సిద్ధం చేసుకోవాలి— అని మాధవి దృఢ నిశ్చయం చేసుకుంటూండగానే దాసి బిడ్డను తెచ్చి ఆమె ఒడిలో వేసింది. మాధవి నిర్ణయం క్షణం మాత్రంలో వీగిపోయింది. "వసూ, నా వసూ" అని బిడ్డను గుండెలకు హత్తుకుని "నేను వీణ్ణి విడిచి వెళ్ళలేనే!" అని గట్టిగా ఏడ్చింది.

గాలవుడు వచ్చేరోజు దగ్గర కొచ్చినట్లల్లా మాధవి బెంగ హెచ్చు కాసాగింది. "ఈ ముని రాకుండా ఉండనీ దేముడా" అని రోజూ ప్రార్థించ సాగింది. మహారాజు తనకు నచ్చలేదు నిజమే. కాని ఇప్పుడు ఈ బిడ్డ కోసం తాను ఇక్కడే ఉండిపోతుంది, ఇంక తనకు జీవితంలో మరేం ఆశలు లేవు అని అనుకునేది.

బిడ్డ పుట్టాక అందంగా కనిపిస్తున్న మాధవిని చూసి ఆమెను పొందాలన్న కోర్కె కలిగింది హర్యశ్వుడికి. ఆమె వెళ్ళి పోతున్నదని ఆతనికి పెద్ద దుఃఖం

ఏం లేదు. మాధవి తానై వలచి వచ్చినది కాదు కనుక, ఆతనికి ఆమె నుండి పెద్ద సుఖం ఏం దొరకలేదు, అయినా ఇంత నిండైన అప్సరస మళ్ళీ తనకెప్పుడు దొరుకుతుందో అన్న బాధ అతనిది.

తన వద్దకు వచ్చిన హర్యశ్వునితో మాధవి కటువుగా అంది.

"మహారాజా. కొడుకు పుట్టుకతో మీ లక్ష్యం పూర్తయింది. ఇంక నామీద మీకే అధికారమూ లేదు."

"ఎంత అహంకారం నీకు" అని చెంపమీద కొట్టటానికి చేయెత్తిన రాజుకు, ఆమె తనకు కొడుకు నిచ్చిన తల్లి అని గుర్తువచ్చి చేయి దించాడు.

# 9

కార్తీక శుద్ధ పౌర్ణమి నాటికి గాలవుడు హర్యశ్వుని రాజభవనానికి వచ్చాడు. అతణ్ణి ఎదుర్కొన్న రాజులో మొదటి ఉత్సాహం లేదు. అది గమనించిన గాలవుడు సందేహంతో "పుత్రోత్సవం అయిందా?" అని ప్రశ్నించాడు.

"అయింది. బిడ్డకిప్పుడు రెణ్నెల్లు" అన్నాడు రాజు.

"చాలా సంతోషం."

"రండి, నా పుత్రుణ్ణి ఆశీర్వదించండి" అంటూ రాజు గాలవుని అంతఃపురానికి తీసుకుని వెళ్లాడు.

విశాలమయిన చావిడిలో పద్మాసనం మీద గాలవుడు కూర్చున్నాడు. మాధవి బిడ్డనెత్తుకుని బయటకు వచ్చింది. ఆమె ముఖంలో కోపం, అసహ్యం, స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆమె గాలవునకు నమస్కారంకూడా చేయకుండా కోపంగా చూసింది.

రాజు కొడుకును తీసుకుని మునిముందుకు చాచి నిల్చున్నాడు.

"దీర్ఘాయుష్మాన్ భవ. కీర్తిమాన్ భవ" అని అతడు దీవించాక రాజు మళ్ళీ మాధవి చేతికి బిడ్డ నందించాడు.

ఓ క్షణం ఏం మాట్లాడాలో తోచక, అందరూ మౌనం వహించారు. గాలవునికి ఈమె బిడ్డను వదిలిపెట్టి వస్తుందో రాదోనని అనుమానం వేసి నెమ్మదిగా అన్నాడు.

"మాధవీ నిన్ను తీసుపోవటానికి వచ్చాను."

మాధవి బిడ్డను గుండెకు హత్తుకుని, "మునీ, మహారాజువద్ద తీసుకోవలసిన [illegible] గుర్రాలను తీసుకుని వెళ్ళి మీ గురుదక్షిణ చెల్లించుకోండి, నన్ను

మాత్రం ఇక్కడే వదలండి. ఈ బిడ్డను వదిలిఉండలేను।" అని ఏడుస్తూ చెప్పింది.

హర్యశ్వుడు కంగారు పడ్డాడు. "ఓ సంవత్సరం అయ్యాక వెనక్కి తీసుకు వెళ్ళమని నేనుమాట ఇచ్చేశాను" అన్నాడు.

ఆ మాటని సమర్థిస్తూ గాలవుడు. "మాధవీ! ఇదంతా దైవనిర్ణయం. తప్పించటానికి మానవ మాత్రులం మన చేత నవుతుందా?" అన్నాడు.

"మీరు మనుష్యులు కాదు. మీకు తల్లిబాధ ఎలా అర్థమవుతుంది?" కడుపులో కాలుతూంటే మాధవి కేకలు పెట్టింది.

హర్యశ్వుడు మాధవి వద్దకు వచ్చి, ఆమె భుజం తట్టి ఓదారుస్తూ-

"నువ్వు బాధపడకు. బిడ్డను సరిగ్గా పెంచే బాధ్యత నాది" అన్నాడు.

వెక్కివెక్కి ఏడుస్తూ మాధవి లోపలకు పరిగెత్తింది.

రోజల్లా ఏడవటంతో మాధవి కళ్ళు వాచాయి. ఇంక మూడు రోజుల్లో బయలుదేరాలన్న నిర్ణయాన్ని తెలిపేసరికి వృద్ధ దాసి కూడా కోపగించింది.

"రెండ్నెల్ల బాలింతరాలు- ఇంత త్వరగా వెళ్ళటమా? మధ్యలో ఏమయినా జబ్బు చేస్తే?"

"అయితేనేం? చస్తాను. అంతేనా?"

"అలా అనకూడదమ్మా."

వృద్ధదాసి రకరకాల కషాయాలు చేసిచ్చింది. పాషాణంలా ఉన్న మాధవి మాట్లాడకుండా తాగింది వాటిని. బిడ్డ ఏడ్చినా ఎత్తుకోవటానికి వెళ్ళలే దామె. కనకాంబరి ఎత్తుకొని ముద్దు చేసినా ఏడుపు ఆపలేదా బిడ్డ. అప్పుడు తల్లి వడిలో వేసిందా బిడ్డను. మాధవి కనకాంబరి చేయి పట్టుకొని-

"కనకాంబరీ. ఇది నా బిడ్డకాదు. నీదే. చూసుకో" అంది.

దాంతో మళ్ళీ మొదలైంది ఏడుపు.

అంతఃపురంలోని దుఃఖవాతావరణం చూసి హర్యశ్వునికీ బాధ కలిగింది. అతను మాధవితో-

"గాలవులవార్ని అడుగుదాం. మీరు ఎక్కడిదాకా వెడతారో, అక్కడి వరకూ పల్లకి పంపుతాను" అన్నాడు.

మాధవి ఖచ్చితంగా పలికింది. "వద్దు. మీ దేశపు ఋణం తీరిపోయింది. మీ నగా నట్రా ఏమీ వద్దు నాకు. ఎలా వచ్చానో అలానే వెళ్ళిపోతాను.'

బలవంతం చేసి ప్రయోజనం లేదని తెలిసిన రాజు ఊరుకున్నాడు.

వెళ్ళేరోజున నారచీర ధరించి మళ్ళీ నిరాభరణ సుందరి అయింది మాధవి. ఆమెను ఆ స్థితిలో చూసిన దాసీజనానికి చెప్పలేని బాధ కలిగింది.

గాలవుడు రాగానే మాధవి బిడ్డ నోసారి ముద్దాడి కనకాంబరి చేతికిచ్చి 'పదండి' అని గాలవుడి వద్దకు వచ్చింది. అక్కడే నిలబడ్డ హర్యశ్వుడిన్ని కన్నెత్తి కూడా చూడలేదు.

అప్పుడే బిడ్డ ఉన్నట్టుండి ఏడవసాగాడు. మాధవి వెంటనే వెనుతిరిగి కనకాంబరి వేపు పరిగెత్తింది. బిడ్డను హత్తుకుని ఓదారుస్తూండగానే, లోపల్నుండి మహారాణి వచ్చింది. ఆమె ముఖంలో జాలి, బాధ ఉట్టి పడుతున్నాయి. మాధవి మహారాణి చేతిలో బిడ్డనుంచి "అక్కా, బిడ్డను చూడుకోండి' అని, మళ్ళా వెనుదిరిగి చూడకుండా, గాలవుడ్ని దాటి ముఖద్వారం వేపుకు నడిచింది.

గాలవుడు పెద్ద పెద్ద అంగలు వేస్తూ ఆమె వెంటనడుస్తూ హర్యశ్వునితో అన్నాడు.

"కాశీరాజు దివోదాసు అశ్వమేధ యాగం చేస్తాడట. అక్కడికి వెడతాం. గుర్రాలు నీ దగ్గరే ఉండనీ. నేను అడిగినప్పుడు పంపుదువుగాని."

ఊరుదాటి దక్షిణం దిక్కుగా నడిచారు. గాలవుడు ముందూ, మాధవి వెనుక. ఆతడు అప్పుడప్పుడు ఏమయినా మాట్లాడుతాడు. కాని అన్నిటికీ జవాబు ఒక్కటే– మౌనం. మాధవికి ఏమీ వద్దనిపిస్తోంది. పంతం కొద్దీ నడుస్తోంది కాని నడవటానికి ఓపిక లేదనిపిస్తోంది.

అడవి మొదలయింది. ఎత్తుగా పెరిగిన మద్ది, రావిచెట్లు, శింశుప, ఉదాలక వృక్షాలు వారికి నీడ నిచ్చాయి. పొదలు పొదలుగా పెరిగిన కర్ణికార లతలన్నీ

పుష్పించి వేలాది కర్ణికార పుష్పాలు ఆ అరణ్యాన్ని ఉద్యానవనంగా మార్చాయి. సింహ కేసరంలా కనిపించే లోధ్ర పుష్పాలు ఆ అడవికి బంగారు కళ తెచ్చాయి.

నడిచీ నడిచీ విసుగెత్తిన గాలవు డన్నాడు : "మాట్లాడితే మార్గాయాసం తగ్గుతుంది. మనమిప్పుడు ఆగ్నేయ దిక్కున పది యోజనాలు పోతే గంగానది ఉత్తర తీరంలో కాశీనగరం వస్తుంది. అక్కడి రాజు దివోదాసు మహాత్ముడట. గంగలో స్నానం చేస్తే అన్ని పాపాలు పరిహార మవుతాయట."

[—నువ్వా నదిలో మొదట స్నానం చేయాలి అనుకుంది మాధవి. నన్ను ఏడ్పించిన పాపం నిన్ను పట్టుకుంది. దాన్నుండి విముక్తి కావాలంటే నూరు మార్లయినా నువ్వా నదిలో మునగాలి—]

"చూడు నిన్ను హర్యశ్వుడి వద్ద వదిలిపెట్టి అడవుల్లోకి వెళ్ళానా, తపస్సు చేద్దామన్నా ఏకాగ్రత సిద్ధించలేదు. ఎల్లప్పుడూ గురుదక్షిణదే ఆలోచన. దీన్నుండి ఋణ విముక్తుణ్ణయితే తప్ప నా మనస్సుకు శాంతి లేదు."

[—ఆలా అయితే ఈ సంవత్సరం కాలం ఈ ముని చేసిన పని ఏమిటన్నా అంటే మాధవిని తర్వాత ఎక్కడికి తీసుకుని వెళ్ళి గురుదక్షిణ సంపాదించాలా అన్న ఆలోచన!—]

"కన్నబిడ్డను వదిలి రావటం అన్నది మనస్సుకు బాధే. అవి నాకూ తెలుసు మాధవీ. అయితే నువ్వు ఇహలోకపు మోహాన్ని త్యజించి పరలోక సాధన వేపు దృష్టి తిప్పుకో."

[ధూర్త ముని! స్వార్థసాధన కోసం నాకు పరలోకం ఎరచూపి మోసగిద్దామని చూస్తున్నాడు. ఇతడే ఇహలోకపు గురుదక్షిణ ఆశ వదిలి పెట్టి పరలోక మార్గమయిన తపస్సు చేసుకోకూడదూ?]

పక్కనే పారుతున్న వాగు గలగల శబ్దం వినిపించింది. మాధవి అక్కడికి వెళ్ళి దోసిలి నిండా నీరు తాగింది. ఆకలయింది. గాలవుడు తెచ్చిచ్చిన పళ్ళు తిని అలసట తీర్చుకొనడానికి కాళ్లు చాచుకుని కూర్చుంది. నొప్పిగా వున్న కాళ్లు పట్టుకుంటూంటే బిడ్డ గుర్తుకొచ్చి ఏడుపు వచ్చింది.

మొదటిరోజు కష్టపడి ఓ యోజనం నడిచారు. రెండోరోజు మాధవి నడక వేగం సన్నగిల్లింది. దానికి తోడు సన్నని జల్లు కూడా కొట్టింది. కట్టుకున్న చీర

తడిసే సరికి మాధవికి చలి పట్టుకుంది. ఓ విశాలమయిన చెట్టుకింద నిల్చొని వాన నిల్చాక మళ్ళీ నడక సాగించారు. ఎండకు కట్టుకున్న చీర ఎండినా మాధవి చలి ఆగలేదు. ఓ పదడుగులు వేసి త్రోవలోనే కుప్పగా కూలిపోయింది.

ముందు నడుస్తున్న గాలవుడు తన వెనక అడుగుల చప్పుడు వినిపించక పోవటంతో 'ఏమయింది?' అంటూ వెనక్కి వచ్చాడు. కూర్చున్న మాధవిని భుజం పట్టుకుని కుదిపాడు. అక్కడే, అలాగే ఆకుల మీదకి ఒరిగిపోయింది మాధవి. శరీరమంతా వణికిపోసాగింది. పళ్ళు కటకటలాడాయి.

గాలవుడు ఆమె నుదురు తాకి చూశాడు. అది మండిపోతోంది. 'మాధవీ, మాధవీ' అన్న అతని పిలుపుకు మాధవి జవాబివ్వలేదు. ఏం చేయాలో తెలియక అటూ ఇటూ తిరిగాడు. దగ్గరలో ఏదయినా ఆశ్రమం ఉంటే అక్కడికి ఈమెను తీసుకుని వెళ్ళాలి అనుకుంటూ కంగారుగా ఓ దిక్కుకు పరిగెత్తాడు.

సుమారుగా ఓ గడియ నడిచేసరికి ఓ ఋష్యాశ్రమం కనబడింది. అతని ముఖ్యా మొహం తెలియకపోయినా గాలవుడి మాటకు విలువనిచ్చి నలుగురు శిష్యులను, వేత్రాసనాన్ని పంపాడు. వారు మాధవిని దానిమీద పడుకోబెట్టి ఆశ్రమానికి తీసుకుని వచ్చారు.

అదృష్టవశాత్తూ ఆశ్రమంలో ఋషిపత్ని ఉండటంతో అందరికీ కాస్త ధైర్యం వచ్చింది. పాకశాల పక్కనున్న చిన్నగదిలో తుంగచాప మీద కృష్ణాజినం పర్చి దానిమీద మాధవిని పడుకోబెట్టారు. ఋషిపత్ని వేదవతి బాగా కాచిన పాలు మాధవికి తాగించి, వేడి నీళ్ళతో ఆమె ముఖం మీద చెమటను తుడిచింది.

మాధవి కళ్ళు తెరచి, "నే నెక్కడున్నాను!" అనడిగింది.

వేదవతి చిరునవ్వు నవ్వుతూ, "ఏమీ మాట్లాడకమ్మా. నిద్ర పో" అంది.

అలసిపోయిన మాధవి మళ్ళీ నిద్రలోకి జారుకుంది.

ధారుణి ఋషి అధ్యయనశాలలో గాలవుడు ఆ ఋషికీ అతని భార్యకూ తన కథను వివరంగా చెప్పాడు.

అప్పుడు వేదవతి కొంచెం కోపంగా, "బాలింతరాల్ని ఇలా గాలీ వానా అని లేకుండా నడిపించుకొస్తారా? నన్ని తగిలి జ్వరం వచ్చింది" అంది.

"బాలింతపసంగూర్చి నాకేం తెల్సు?" అని ఎదురు తిరిగి ప్రశ్నించాడు గాలవుడు.

"అతని కున్న కనికరం కూడా లేదూ మీకు? ఆమె చస్తే ఏం చేస్తారు?"

"అయ్యో! ఆమె చావకూడదు! నా గురుదక్షిణ తీరేవరకూ మాధవి చావకూడదు!"

వేదవతి జుగుప్సగా అతన్ని చూసి బయటికి వెళ్ళింది. ఆ కనుచీకటి వేళ అడవిలోకి వెళ్ళి ఏవో మూలికలూ, ఆకులూ వెతికి తెచ్చింది దాన్ని బాగా ఉడికించి కషాయం తయారు చేసింది దాన్లో సగం పాలల్లో కలిపి మాధవికి తాగించింది.

రాత్రంతా మాధవి మూలుగుతూనే ఉంది. ఆమె దగ్గర ఓ చిన్న దీపం వెలిగించి ఉంచింది వేదవతి. అక్కడే పక్కనే చాప పరుచుకు పడుకున్న ఆమె, అప్పుడప్పుడూ లేచి వేడినీళ్లు కాని, పాలు కాని తాగించేది. ఆ రాత్రి గడిస్తే చాలు ననిపించింది వేదవతికి.

మూడవ రోజు జ్వరం వదిలింది మాధవిని. నీరసం కాస్త తీరి కూర్చోగలిగింది.

వేదవతితో "మీ కందరికీ చాలా శ్రమ ఇచ్చానేమో కదా!" అంది కృతజ్ఞతతో.

"ఏమీలేదు. ఇవాళ కాస్త అన్నపు గంజి చేస్తాను. ఉప్పూ నెయ్యీ వేసుకుని తాగితే బాగుంటుంది" అని వేదవతి వంటశాలలోకి వెళ్ళింది.

గాలవుడికి ధైర్యం పుంజుకుంది. ఉత్సాహంతో ఋషివద్ద బ్రహ్మవాదం చేశాడు. అతని శిష్యులకు ప్రవచన మిచ్చాడు.

మాధవి కాస్త లేచి తిరిగేసరికి గాలవుడు వేదవతిని—

"మేమెప్పుడు ఇక్కడి నుంచి బయలుదేరం? మీరే నిర్ణయించండి" అనడిగాడు.

వేదవతి కోపంతో రెచ్చిపోయి అంది:

"మీ అదృష్టం బాగుండి మాధవి బ్రతికింది. ఆమె చస్తే స్త్రీ హత్యా పాతకం మీ మెడకు చుట్టుకునేది. ఇంకో పక్షం గడిచే వరకూ ప్రయాణం మాటెత్తకండి"

# 10

"మహారాజుగారు విజయం చేస్తున్నారు. అందరూ తప్పుకోండొహో" అని ఉచ్చైస్స్వరంలో కాపలాగా ఉన్న భటుడు కేకవేశాడు.

మహాద్వారం వద్ద ఉన్న శిల్పి పరిగెత్తు కొచ్చాడు. తెల్లగుర్రం పై వచ్చిన మహారాజు ఉవోదాసును చూసి భక్తి గౌరవాలతో నమస్కరించి—

"మహా ప్రభువులవారు దయచేయాలి" అని స్వాగతం పలికాడు.

"శిల్పివర్యా, మేమిక్కడే గుర్రం దిగాలా?" రాజు చిరునవ్వుతో అడిగాడు.

"వద్దు మహారాజా. ఒక యోజనం నడిస్తే తమకు అలసట కలుగుతుంది. ముందు పదండి. నేను వెనకాల వస్తాను" అంటూ తానూ ఓ గుర్రం ఎక్కాడు శిల్పి.

ముందు రాజు తెల్లగుర్రం. దాని పక్కనే మంత్రి కపిలవర్ణపు గుర్రం. వాటి వెనకాల శిల్పి నల్లగుర్రం. నెమ్మదిగా పూర్వదిక్కున ప్రయాణం సాగించాయి. త్రోవ పొడవునా శిల్పి ఒక్కొక్కదాన్ని వర్ణిస్తున్నాడు.

"మహా ప్రభువుల కోరిక ప్రకారమే ఒక యోజనంమేర అడవిని చదును చేశాము. ఆరంభంలో కనిపించేది యజ్ఞమంటపం."

"యజ్ఞ మంటపంలో సుమారు ఎంతమంది కూర్చోవచ్చు?"

"వేలాది మంది మహారాజా."

"అది తర్వాత చూద్దాం. ముందు పదండి."

గుర్రాలను నెమ్మదిగా నడిపించుకుంటూ వెళ్ళారు.

దారికిరుపక్కలా కొత్తగా కట్టిన విశాలమయిన గృహాలు అందంగా కనిపిస్తున్నాయి. వాటి గడపలకు కిటికీలకు తలుపులకు వేసిన రంగులు చూపరుల దృష్టిని ఆకర్షిస్తున్నాయి.

"ఇవి అతిథులుగా విచ్చేసే రాజులకా?" అంతవరకూ మౌనంగా వున్న మంత్రి ప్రశ్నించాడు.

"అవును."

చక్కటి కొలను. స్వచ్ఛమైన నీటిలో విచ్చిన తెల్లతామర, కల్హారం, పచ్చ తామరల పరిమళం కమ్మగా వస్తోంది. కొలనుకున్న మెట్లుకూడా చాలా శుభ్రంగా నున్నగా వున్నాయి. కొలను గట్టుకు కొంచెం దూరంలో వున్న తులసి, మరువం దవనం మాచపత్రుల తోట ఆ చుట్టుపక్కల తిరిగేవారికి సువాసనలను పంచిపెడు తోంది. దానిని చూసి దివోదాసు మెప్పుదలతో తలవూపే సరికి శిల్పి 'ఇలాంటివి పన్నెండు కొలను లున్నాయి ప్రభూ' అని విన్నవించుకున్నాడు.

అశ్వమేధ యాగానికి తన నగరుకు వచ్చే వేలాది మందికి ఈ కొలనులు చాలా అని ఓ క్షణం రాజు కనిపించినా పక్కనే గంగానది ఉండగా ఏమి భయం అనుకున్నాడు.

యాగం నడపడానికి వచ్చే హోతృ, అధ్వర్యు, ఋత్విక్కులు మొదలైన ముని జనుల కనుకూలంగా ఉండే నివాసాలు; అదీ కాకుండా అతిథులుగా వచ్చే బ్రాహ్మణులూ, తదితరులకు నివాస గృహాలు- అన్నిటినీ రాజు పరీక్షించాడు. వాటన్నిటికీ ఆవతల పెద్ద వంటశాల. వంట కోసమని చేర్చి పెట్టిన పెద్ద పెద్ద తప్పేలాలు, ఓ మూల పేర్చిపెట్టిన కట్టెల రాశీ, గుండిగలు పెట్టటానికి వీలయిన పెద్ద పొయ్యిలు- ఎన్నో అక్కడి ఏర్పాట్లు.

ఇంత అయినా అక్కడి పను లింకా పూర్తి కాలేదు. వందలాది మంది పని వాళ్ళు ఏదో ఓ పనిచేస్తూనే ఉన్నారు. కొంతమంది ఇళ్ళకు గోడలు కడ తూంటే మరి కొంతమంది కప్పు నేస్తున్నారు. ఇంకా కొంతమంది కిటికీలు, తలుపులూ అమరుస్తున్నారు. మిగిలినవాళ్ళు సున్నాలూ, రంగులూ వేస్తున్నారు.

"ఇప్పుడు పుష్య మాఘ మాసాల్లో అశ్వం వెనక్కి రావచ్చు. ఇంకో మాసంలో ఈ పనంతా పూర్తవుతుందా శిల్పీ?" అని మహారాజు ప్రశ్నించాడు.

"మాదేమీ అలస్యం లేదు. సున్నాలూ, రంగుల పనైతే మా పని అయి పోయినట్లే. అతిథులకు ఏమీ లోటు కలగకుండా ఉండేలాగానే అంతా సిద్ధం చేస్తున్నాం" అని వినయంగా జవాబు చెప్పాడు శిల్పి.

—లోట్లు పాతవేవో గుర్తుకొచ్చాయి దివోదాసుకు. మహారాజయినా తనకు రెండు లోట్లున్నాయి.

కోసల రాజకుమారి సత్యవతిని పెండ్లాడి పది ఏళ్ళయినా ఆమెవల్ల తనకు-సంతానం కలుగలేదు. తండ్రి బ్రతికున్నంత కాలం అతని కదే బెంగగా ఉండేది. "మన వంశం నిర్వంశం కాకూడదు దివూ" అనే వాడాయన. అయితే ఆ తండ్రి కెలాంటి గతి పట్టింది? రణరంగంలో వీరావేశంతో పోరాడి మరణించిన తండ్రికి వీరస్వర్గమే లభించింది. నిజమే. కాని ఆకస్మికంగా తండ్రిని పోగొట్టుకున్న తనకు అంతవరకూ ఆతని నీడలో పెరిగిన తనకు- ఏం చేయాలో తోచలేదు.

వైరి హైహయరాజు వీతహవ్యుని హతమార్చకపోతే తన పేరు దివోదాసు కాదని ప్రతిజ్ఞ చేశాడు తన తండ్రిపోయిన కొత్తలో. కాని తమ రాజ్యానికి నూరు యోజనాల దూరంలో ఉన్న వీతహవ్యుడి నగరంపై దండెత్తడం ఎలా? దాని కెంత సైన్యం- డబ్బూ కావాలి అని ముందు లెక్కవేయలేదు. మంత్రి సేనాపతులు అదంతా లెక్కలు వేసి "సహస్ర కోటి వరహాలు కావాలి. అంతే సైన్యంకూడా కావాలి" అనేసరికి తన గుండె గతుక్కుమంది.

అయిదు సంవత్సరాల క్రితమే కదూ! హైహయరాజు ఉన్నట్టుండి దండెత్తేసరికి తాము యుద్ధానికి ఏమాత్రం సిద్ధంగా లేరు. చిన్న ద్వారం మూయించి తండ్రి యుద్ధంలోకి దూకేశారు. తానూ విలువిద్యలోనూ- ఖడ్గ విద్యలోనూ ప్రవీణుడే. అయినా వీతహవ్యుడు మోసంతో తండ్రిని చంపేశాడు. అధిపతిని పోగొట్టుకున్న తమసైన్యం చెల్లాచెదురైంది. సేనాధిపతి ధైర్యం చూపి సేనను కూడగట్టుకోవటంతో, శత్రురాజును నాలుగు యోజనాల దూరం తరిమివేయగలిగారు. అప్పుడు యుద్ధంలో చనిపోయిన జనం- కూలిన ఇళ్ళు- పాడైన పొలాలు, తోటలూ- నగరంలో కొల్లగొట్టబడిన వస్తువులూ- తల్చుకుంటే ఇప్పటికీ వళ్ళు గగుర్పొడుస్తుంది.

కూలిపోయిన ఇళ్ళను మరమ్మతు చేయించటానికి కొన్ని సంవత్సరాలు కావాల్సి వచ్చింది. అంతా ఓ దారికి వచ్చేసరికి మళ్ళీ శత్రువును నాశనం చేయాలనే పాతకోరిక వేస్తోంది.

"ప్రభువులవారు ఏదో ఆలోచిస్తున్నారు?" మంత్రి ప్రశ్న.

రాజు తన ఆలోచనలనుండి లేచి "ఊఁ...ఊఁ. అశ్వమేధ యాగం చేయాలని మనం దీక్ష వహించి సంవత్సరకాలం అయింది కదా?" అన్నాడు.

"అవును. క్రిందటి పుష్యంలోనే మనం కుల పురోహితులవారి వద్దకు వెళ్లాం."

నైమిశారణ్యంలో కులపురోహితులు భారద్వాజ మునులవారిని దర్శించటానికి రాజు దివోదాసు మంత్రితో తరలివెళ్లాడు.

"నాకొక పెద్ద లోటున్నది మునివర్యా. దాన్ని పరిహరించే మార్గం తమరే సూచించాలి" అని వేడుకున్నాడు దివోదాసు.

"మహారాజుకు కూడా లేమి అనేది ఉందా!" అంటూ నవ్వుతూ తన తెల్ల గడ్డాన్ని నిమిరారు భారద్వాజులవారు.

"పుత్ర సంతానం లేదన్నదే నాకున్న బాధ; మహారాణికి కూడా ఇదే బెంగగా ఉంది."

దీర్ఘమౌనం తర్వాత భారద్వాజులవారు అన్నారు.

"పుత్రార్థమై అశ్వమేధయాగాన్ని, పుత్రకామేష్టినీ చెయ్యి. నీ కోరిక తీరుతుంది."

తన పూర్వీకులయిన రాజులు అశ్వమేధయాగాన్ని చేశారన్న విషయం గూర్చి కథలు విన్నాడు దివోదాసు. ఇప్పుడు దాన్ని తానే చేయాలనే సరికి ఓ క్షణం భయం వేసింది.

"దానికి అపారమైన ధనకనకాలు కావద్దా గురువర్యా?"

"కావా? సహస్ర సహస్ర వరహాలు కావాలి. యాగమంటూ చేశాక క్రియాలోపం గానీ, ద్రవ్యలోపం గానీ కాకూడదు. అలాంటి ఏర్పాటు చేసుకునేలా ఉంటేనే యాగం ఇష్టి చేయాలి. లేకపోతే మొదలు పెట్టకనలు."

"లేకపోతే మొదలు పెట్టకు" అన్నమాట కొరడా దెబ్బలా తగిలింది దివోదాసుకి. యాగం ఎందుకు చెయ్యలేను. చేసి తీరాలన్న పంతం కలిగింది. బాంబోజాకి అంత ధనసంగ్రహం చేయగలుగుతానా లేదా అన్న భయం కూడా పుట్టింది.

"తొందరలేదు. నిదానంగా ఆలోచించి నిర్ణయించుకో" అని భారద్వాజుల వారికి మ్రొక్కి ఆయన వద్ద సెలవు తీసుకుని నగరానికి వెనుదిరిగాడు.

పగలూ రాత్రీ యుద్ధం, యాగం-వీటిమధ్య వూగసాగింది అతని మనస్సు. ప్రతీకారం సాధించాలన్న బలమయిన కోర్కె ఓ వైపయితే- పుత్ర సంతతి లేకుండా తాను చస్తే- ఈ కాశీ రాజ్యాన్ని ఎవరు ఏలుతారు అన్న బెంగ మరో వేపు.

రాజకారణ కుశలుడయిన మంత్రి అప్పుడు-

"ప్రభూ! యుద్ధం చేయాలి అంటే, హైహయ రాజధాని చాలా దూరం ఇక్కడికి. సంవత్సరాల తరబడి మనం రాజ్యం వదలి వెళ్ళాల్సి వస్తుంది. మనం అలా వెళ్ళాక వేరే శత్రురాజులు వచ్చి కాశీరాజ్యం మీద దండెత్తితే ఏం చేస్తాం?" అన్నాడు.

"అదీ నిజమే."

"యుద్ధం వల్ల ఎవరికీ సుఖం లేదు. మనకూ సైన్యం, ధనం అన్నీ నష్టమవుతాయి. మన శత్రువులకూ అంతే. వైరం వల్ల వైరం పెరుగుతుందే కాని ప్రేమ కలగదు. శత్రురాజును క్షమించేయండి. ప్రజలకూ మీకూ కూడా శుభం కలిగేలా అశ్వమేధయాగం చేయండి"

దివోదాసునికి మంత్రి చెప్పిన మాటలు నిజం అనిపించింది. తన తోటి రాజులెవ్వరూ అశ్వమేధయాగం చెయ్యలేదు. ఎవరూ చెయ్యనిది చేశాడన్న కీర్తి తనకు లభిస్తుంది. పైగా పుత్రసంతానం కలుగుతుంది. కనుక యుద్ధంకన్నా ఇదే లాభదాయకం అని నిర్ణయించాడు దివోదాసు.

ఓ శుభ ముహూర్తంలో- వేగంగా వెళ్ళే రథంలో భారద్వాజుల ఆశ్రమానికి వెళ్ళాడు మహారాజు.

గురువుల వారికి నమస్కరించి- "యజ్ఞాన్ని శాస్త్రోక్తంగా చేసే విధానాన్ని తెలుపండి" అని వేడుకున్నాడు.

ఋషులవారు ఉచ్చైస్స్వరంతో- "హే మహారాజా! ఈ సత్కార్యంలో నీకు శ్రేయస్సు కలుగుగాక! మొదట యజ్ఞానికి కావలసిన సకల సామగ్రిని సిద్ధం చేసుకో. సమర్థులయిన అంగరక్షకులతోనూ- ఋత్విక్కులతోనూ గుర్రాన్ని దేశ

దేశాలకూ పంపు. ఈ శిశిరంలో అశ్వాన్ని వదిలి- మరొక శిశిరం వచ్చేవరకు నువ్వు దీక్షలో ఉండి ఆ తర్వాత యజ్ఞాన్ని ప్రారంభించు."

"అలాగే. తమరు యజ్ఞానికి ముఖ్య అధ్వర్యులయి అంతా నడిపించాలి."

"నీ ఇష్టమే కానీ. కాశీనగరానికి పూర్వదిక్కున ఓ యోజనవైశాల్యం కల యజ్ఞభూమిని సిద్ధం చేయాలి. శాంతికర్మలను చేసి ఆ తరువాత యాగం ప్రారంభించాలి. ఇందులో క్లేశకరము అయిన అపచారాలేమీ సంభవించకుండా వుంటే నీకు యశస్సు లభిస్తుంది. యజ్ఞ కలాపాలకు పరమ ధార్మికులయిన ఋత్విక్కులను ఎన్నుకోవాలి. మిగిలిన పనులకు తగిన పనివాళ్ళనూ, కమ్మరి వాళ్ళనూ, శిల్పులనూ స్రుక్కు, స్రవము, చమసము గ్రహపం, యూపము మొదలైన ఉపకరణాలను తయారుచేసే పనివారినీ, చెరువులూ, బావులూ తవ్వే వారినీ, జ్యోతిష్కులను, విద్వాంసులనూ కూడదీయాలి. బ్రాహ్మణులు నివసించటానికి యాగభూమిలో కావలసిన స్థలం వుండాలి. అతిథులందరికీ కావలసిన భక్ష్యభోజ్య పానీయాద్యాహార సేకరణ చేయాలి. సమస్త వర్ణాలవారినీ ఆదరంతో సత్కరించాలి. దక్షిణ విషయంలో కాని, భోజనంలో కాని ఎవరూ అతృప్తులై వెళ్ళకుండా చూసుకోవాలి. ఇవంతా నీకు సాధ్యపడుతుంది అంటే ఈ యాగం చేయటానికి పూనుకో."

"మీ ఆజ్ఞ శిరసావహిస్తాను" అని ఋషివర్యులకు నమస్కరించాడు దివోదాసు.

ఆ రోజు కన్న కలలన్నీ ఇవాళ వాస్తవం కావటం చూసిన దివోదాసునికి అత్యంతానందం కలిగించింది. ఆఖరికి సర్వం సిద్ధమయింది. ఇక యాగం నిర్విఘ్నంగా జరిగితే తాను గెల్చినట్టే అనుకున్నాడు.

ఆ వేళకు వారు యజ్ఞమంటపపు విశాలద్వారాన్ని సమీపించారు.

"మహాప్రభువులవారు యజ్ఞమంటపాన్ని పరిశీలించాలి" అని శిల్పి విన్నవించుకున్నాడు.

మహారాజూ- మంత్రీ గుర్రాలు దిగారు.

వేలాదిమంది ఒక్కమారే కూర్చోగలిగే ఏర్పాట్లున్న యాగమంటపం కొంచెం ఎత్తులో ఉంది. యాగ మంటపానికి చుట్టూ ఎత్తైన గోడలు, వానా ఎండా లోపలకు ప్రవేశించకుండా బలమైన కప్పు- నాలుగు దిక్కులా నాలుగు పెద్ద పెద్ద తలు

పులూ, గాలి వెల్తురూ యథేచ్ఛగా సంచరించటానికి వీలుగా ఏర్పాటు చేసిన విశాలమయిన కిటికీలు.

మెట్లు ఎక్కి, రాజూ మంత్రీ శిల్పితోబాటు యాగ మంటపం లోనికి వెళ్ళారు. పూర్వాభిముఖంగా ఎత్తుగా వేదిక ఉంది. యాగం చేసేటప్పుడు హోతృ, అధ్వర్యులూ, ఋత్విక్కులూ కూర్చునే చోటు అది. ఇరవై వొక్క యూప స్తంభాలు ఉన్నాయి. వేదికకు కుడివేపు, ఎడంవేపు విశిష్టులయిన అతిథులు కూర్చునేందుకు ఏర్పాట్లు చేశారు. వెనుకభాగం అంతఃపుర కాంతలకోసం ప్రత్యేకింప బడింది. ఎదురుగా ఉన్న చోటు ప్రజలకోసం ఏర్పాటు చేశారు. అక్కడ ఒకదానిపై ఒకటి వరసగా మెట్లున్నాయి. మంటపంలో వందలాది స్తంభాలున్నాయి. ప్రతీ స్తంభానికీ రంగు రంగుల బట్టలు చుట్టారు. గోడలకు నిలువెత్తు చిత్రాలున్నాయి. ఋష్యాశ్రమాల దృశ్యం ఓ వేపున ఉంటే మరో వేపున కొండలూ, జలపాతాల అందాన్ని ప్రతిబింబించే దృశ్యం. ఓ దిక్కున మహారాజు దివోదాసు సింహాసనం మీద కూర్చున్నట్టున్న దృశ్యమయితే ఇంకోవేపు అతని తండ్రి భీమసేన మహారాజు దేవతార్చన చేస్తున్నట్టున్న దృశ్యం. మరింకోచోట వైదికబృందంలో నిల్చున్న దివోదాసు.

అదంతా చూస్తున్న మహారాజుకు అపరిమితానందం. అతను శిల్పిని "భళీ. ఎంత అద్భుతంగా అలంకరించారు" అని పొగిడాడు.

"అవును. మంటపపు అలంకరణ మహాబాగుగా ఉన్నది." అంటూ మంత్రి కూడా తన మెప్పుదలను వ్యక్తం చేశాడు.

"యాగానికి వచ్చే రాజులూ, బ్రాహ్మణులూ అందరూ మహా ప్రభువుల వారిని పొగిడితే దానిలో ఆశ్చర్యం లేదు."

రాజు మీసాల చాటునుండే చిరునవ్వు నవ్వాడు.

యజ్ఞభూమిని పరిశీలించి రాజూ, మంత్రీ, అంగరక్షకులు వెంటరాగా రాజభవనానికి వెళ్ళారు. దారిలో దివోదాసు మంత్రిని అడిగాడు :

"యాగానికిగాను ప్రజల నుండి పన్నులు వసూలయ్యాయా? సామంత రాజుల నుండి కప్పాలూ, కానుకలూ వచ్చాయా?"

"ఖజానా నిండుతోంది మహారాజా. పన్నులు ఇంకా వసూలు చేస్తూనే ఉన్నాం."

ప్రజలు పన్నులు ఏ రూపంలో ఇచ్చినా పర్వాలేదు. డబ్బు కాకపోతే ధాన్యమివ్వనీ. వస్త్రాలూ, పళ్ళూ, కాయలూ, ఏదయినా ఫర్వాలేదు. యాగానికిగాను మనం వాళ్ళని దోచుకుంటున్నాం అన్న అభిప్రాయం వాళ్ళకి రాకూడదు. నిజానికి దీనిలో ఏదీ మనం మనకోసం అట్టే పెట్టుకోం. దక్షిణలూ, కానుకల పేరుతో వాళ్ళకే తిరిగి ఇస్తాం కదా?"

నాకే పాఠం చెప్ప వస్తున్నా డీ రాజు అనుకుంటూ చిరునవ్వుతో తల వూపాడు మంత్రి.

# 11

అప్పుడే రాజసభ ముగిసింది.

కాని మంత్రాలోచనకుగాను మహారాజూ, మంత్రీ, సేనాపతీ ఇంకా సభా మందిరంలోనే ఉండిపోయారు.

దివోదాసు అడిగాడు.

"అశ్వం ఎప్పుడు తిరిగి వస్తోంది?"

"వార్తాహరులు వచ్చి వర్తమాన మిచ్చారు ప్రభూ. పుష్య బహుళ త్రయోదశి, చతుర్దశి వేళకు అశ్వం రాజధాని చేరవచ్చు. ఒకటి రెండు రోజులు ఆలస్యమయినా కావచ్చు" అన్నాడు సేనాపతి.

"అయినా పర్వాలేదు మహారాజా. యాగ ముహూర్తం మనం మాఘ శుద్ధ తదియకు నిర్ణయించాం కనుక మనకే యిబ్బంది ఉండదు" అన్నాడు మంత్రి.

రాజు ముఖంలో ఆందోళన కనిపిస్తోంది.

"ఈ యాగం పూర్తయ్యేవరకూ ఈ అదుర్దా తప్పిందికాదు మంత్రీ! రాత్రిళ్ళు నిద్రకూడా సరిగ్గా పట్టటం లేదు."

"మహా ప్రభువులవారు మరేమీ ఆలోచించకూడదు. కొంతకాలం అంతా మరిచి తమరు విశ్రాంతి తీసుకోండి. మేమిద్దరం పనుల విషయం చూసుకుంటాం" అని ధైర్యం చెప్పాడు మంత్రి.

అంతలో ఓ భటుడు వచ్చి "ఎవరో మహర్షులవారు వచ్చారు" అని విన్నవించాడు.

"ఇదేమిటి భారద్వాజులవారే వచ్చేశారా?" అంటూ లేచాడు రాజు. "మంత్రీ వెళ్ళి వారిని గౌరవ మర్యాదలతో తీసుకుని రండి."

లోపలకు వచ్చినది భారద్వాజులవారు కాదు. గాలవుడూ, మాధవీ. రాజు ఋషికి అర్ఘ్యపాద్యాదులను సమర్పించి సత్కరించాడు. గాలవునితో నారచీర కట్టిన మాధవిని చూసి అందరికీ కుతూహలం.

"గురుదక్షిణకు గాను చంద్రవంశపు యయాతి మహారాజు తన కూతురైన ఈమెను నాకు దానం చేశాడు. చక్రవర్తి అయ్యే కొడుకును కనగల శుభలక్షణా లున్న స్త్రీ యీమె. ఈమెనుండి సంతానం పొందు మహారాజా."

సువర్ణమయమయిన కేయూరాలనూ, అత్యుత్తమమయిన కుండలాలనూ, బంగారు తీగతో చుట్టిన రత్నహారాలనూ ధరించిన రాజును ఓ మారు చూసింది మాధవి. పొడుగ్గా ఆరోగ్యంగా కనిపించే ఆజాను బాహువు. మధ్య వయస్సు సమీపిస్తున్నా అలా కనిపించని అంగసౌష్ఠవం, వ్యంగ్య పూరితమైన నవ్వుతో నిండిన కళ్ళు.

మాధవి ఒక్క నిమిషం ఆలోచించింది, తాను కన్యకాదు, హర్యశ్వుడితో ఉండి వచ్చినది అని ఈ రాజుకు తెలియచేద్దామా అని. అప్పుడు రాజు తననూ, గాలవుణ్ణీ బయటకు గెంటుతాడు. గాలవుడికి మంచి శాస్తి జరుగుతుంది. తనకు ఈ బంధనం నుండి విముక్తి దొరుకుతుంది. కాని మరుక్షణమే అనిపించింది— లేదు, అది జరగదు. ఈ ఋషి గురుదక్షిణ చెల్లిస్తే కాని తనకు విమోచనం లేదు.

మహారాజు మాధవినే చూస్తూ ప్రశ్నించాడు.

"మునివర్యా, మీరు మిగతా రాజులందర్నీ వదిలి నా వద్దకే వచ్చారు. మీ కోరిక నెరవేరుస్తాను. ఈ కన్యకు బదులుగా నేను మీకేమి ఇవ్వాలో చెప్పండి."

"ఏమీ వద్దు. శరీరమంతా తెల్లగానూ, ఓ చెవి నల్లగానూ ఉండే గుర్రాలు ఓ అరువందలిప్పిస్తే చాలు."

రాజు ముఖంలో 'ఇంతేనా?' అన్న భావం కనిపించింది. అతడు సేనాపతివేపు తిరిగి ఆజ్ఞాపించాడు.

"సేనాపతి, వెంటనే అలాంటి గుర్రాలను వీరికి అప్పగించండి."

సేనాపతి కొంచెం ఆలోచించి చెప్పాడు.

"కాని మహాప్రభూ, అలాంటి గుర్రాలు మనవద్ద ఓ రెండు వందలుంటా యేమో అంతే. వాటికి బదులుగా తిత్తిరి, కల్మాషము అనే ఉత్తమ జాతి అశ్వా లున్నాయి, అవి ఇవ్వవచ్చు."

"వేరే జాతుల వేపే వద్దు." అని కచ్చితంగా చెప్పిన గాలవుడు రాజువేపు తిరిగి "తమ వద్ద ఏకాంతంలో కొన్ని విషయాలు చెప్పాలి ప్రభూ" అని చిన్నగా చెప్పాడు.

అప్పటికి తమ పని పూర్తి అయినందువల్ల "మహాప్రభువుల వారు అనుమతించాలి" అంటూ మంత్రి సేనాపతి నిష్క్రమించారు.

గాలవు డన్నాడు:

"పోనీ ఇలా చేద్దాం. ఓ కొడుకు పుట్టేవరకు మాధవిని మీ వద్ద ఉండనీ. ఆ తర్వాత వేరే రాజుల వద్దకు తీసుకొని వెళ్ళి మిగిలిన గుర్రాలను సంపాదిస్తాను."

అవనతముఖియై నిల్చున్న మాధవి. తనను గుర్రం, ఆవుల లాగానే వ్యాపారం చేస్తున్నారే వీళ్ళు అని నిట్టూర్చింది. తానూ ఒక వ్యక్తి అని వీరిలో ఎవరికీ అనిపించదా? తాను పుట్టకనే పోతే ఎంత బాగుండేది. ఇలాంటి బ్రతుకు ఏ ఆడదానికీ వద్దు అనుకుంది.

"కావచ్చు. నా అభ్యంతరం ఏమీలేదు మునివర్యా. కాని ఒక్కమాట. రాజునైన నేను పరనారీ సహోదరుడ్ని. అగ్నిసాక్షిగా పెళ్ళాడినదే భార్య. వంశానికి పవిత్రత రావాలంటే అది శాస్త్రోక్తమయిన సంబంధం కావాలి."

[—ఆహా! ఎంత గొప్ప మాట లివి. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యలు ఎంత మందున్నారో ఈ రాజుకు. పవిత్రత లాంటి మాటల కర్థం ఉందా? వంద లాది స్త్రీలతో సంభోగించిన ఈ రాజు పవిత్రుడా? లేక హర్యశ్వునితో పడుకుని, ఇప్పుడు ఇతనితో జీవించ వచ్చిన తాను పవిత్రురాలా?—]

గాలవుని ముఖంలోని ఆందోళన మాయమయింది. అతనేదో మాటలాడదామని నోరు తెరిచేసరికి రాజే అన్నాడు.

"ఇంకో పక్షంలో నేను అశ్వమేధ యాగం చెయ్యటానికి కంకణం కట్టుకున్నాను. ఈ మధ్యలో ఈమె పాణిగ్రహణం చెయవచ్చునో కూడదో అని సందేహం."

"పాణిగ్రహణం శుభకార్యం కనుక, అది చేసేది ప్రజాపతి అయిన రాజు కనుక, ఇతరులకు వర్తించే నియమాలు నీకు వర్తించవు" అని తెలివిగా జవాబిచ్చాడు గాలవుడు.

దివోదాసుకు ఉన్నట్టుండి మహారాణి సత్యవతి గుర్తుకొచ్చింది. ఈ పాణి గ్రహణం విషయం మహారాణికి చెప్పటమా వద్దా అని సందేహం వచ్చింది. చెబితే విసుక్కోవచ్చు, అసూయ చెందవచ్చు. పాణిగ్రహణానికి అడ్డురావచ్చు. నిజానికి ఈ యువతిని చూసిన క్షణమే తన మనసూ, దేహం ఆమెలో బందీ అయింది. ఎప్పుడు ఆమె పొందు లభిస్తుందా అని పట్టరాని కోర్కె కలుగుతోంది. అయినా ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు! ఈ ముని చెప్పినట్టే ఈమె వల్ల తనకో కొడుకు పుట్టినా పుట్టవచ్చు. కాని రాణికి మాత్రం ఈ విషయం చెప్పకపోవటమే మంచిది. ఏదో తొందర్లో అయిపోయింది అని చెప్పవచ్చు.

అలాగే ఆలోచిస్తూ రాజు "మీరు మా అతిథిగృహంలో విశ్రాంతి తీసుకోండి. నేను జ్యోతిషికులను సంప్రదించి ఏ విషయమూ చెబుతాను" అన్నాడు.

రాజు కోరికకు ఎదురు చెప్పే ధైర్యం జ్యోతిషికుడికి లేదు. ఆతడు మర్నాడు మొదటి జాములో ఓ శుభఘడియను పాణిగ్రహణానికి నిశ్చయించి, తను చేయాల్సిన పనులు చేసుకోవటానికి మొదలుపెట్టాడు.

మరునాడు దాసి ఒకతె వచ్చి మాధవికి సుగంధ తైలాలతో స్నానం చేయించి పట్టుబట్టలతోనూ, రకరకాల ఆభరణాలతోనూ అలంకరించించిది. ముహూర్తపు వేళకు దాసీ, గాలవుడూ వెంట రాగా మాధవి వివాహం జరగనున్న గదికి వచ్చింది.

గది మధ్యలో శాస్త్రోక్తమయిన వేదిక ఉంది. దానిచుట్టూ గంధపుష్పాలతో అలంకరించాడు. నవధాన్యాలు మొలకెత్తిన బంగారు గిన్నెలు అక్కడే పెట్టారు. పురోహితులు ధూపదీపాదులనూ, అర్ఘ్యపాత్రనూ, పేలాలనూ, స్రుక్ స్రువాది హోమద్రవ్యాలను ఓ వరసలో అమర్చారు. ఆ తర్వాత శాస్త్రోక్తంగా, మంత్రపూర్వకంగా పరిస్తరణం చేసిన (చుట్టూ దర్భలు పరిచిన) వేదిక యందు అగ్ని ప్రతిష్ఠించి వధూవరుల క్షేమం కోసం హోమం చేశారు.

గాలవుడు మాధవి చేతిని రాజు చేతిలో ఉంచి, దానజలం వదిలి "చేయి పట్టుకుని ఈమెను పరిగ్రహించు" అన్నాడు.

దంపతులు మూడుమార్లు అగ్ని ప్రదక్షిణ కావించి పెద్దలకు నమస్కరించారు. మాధవి మాత్రం ఒక్కమారు కూడా కన్నెత్తి రాజును చూడలేదు.

శాస్త్రోక్త విధులన్నీ పూర్తయ్యాక గాలవు డన్నాడు.

"నేను వచ్చిన పని అయింది. నేనింక వెళ్ళివస్తాను. కాశీ రాజ్యానికి పశ్చిమంగా ఉండే అడవిలో ఆశ్రమం కట్టుకుని ఉంటాను. మహారాజా, నీకు పుత్రోత్సవ మయ్యాక కబురు పంపు."

మందహాసంతో రాజు అన్నాడు.

"మీ ఆశీర్వాదం నిజం కానీయండి మునివర్యా. భోజనానంతరం తమరు అగణ్యానికి బయలుదేరవచ్చు. నా సేవకులు వచ్చి మీకు ఆశ్రమం నిర్మించి ఇస్తారు. అక్కడ మీకే విధమయిన ఇబ్బందీ కలగకూడదు."

బయలు దేరేటప్పుడు గాలవునికి ఎందుకో ఋషిపత్ని వేదవతి మాటలు గుర్తువచ్చాయి.

"బాలింతరాల్ని ఇలా గాలీవానల్లో నడిపించుకుని వస్తారా ఎవరయినా! ఆమెకు సన్నిపాతగిలి జ్వరం వచ్చింది."

"ఆడది అన్న కనికరమయినా వద్దా మీకు? ఆమె చస్తే ఏం గతిప్పుడు!"

'మీ పుణ్యం—మాధవి బతికింది. ఆమె చస్తే స్త్రీ హత్యా పాతకం మిమ్మల్ని చుట్టుకునేది."

గాలవుడు మళ్ళీ వెనక్కు ఒక అడుగు వేసి చిన్నగా చెప్పాడు రాజుతో.

"మాధవి కాన్పు అయ్యాక మూడు నాలుగు నెల్లు పోయాక నాకు కబురు పెట్టండి. తొందరేముంది?"

రాజుకి నవ్వు వచ్చింది. ఆడది గర్భవతి కావటం అంత తేలిక కాదని ఈ మునికి ఏం తెలుసు? తాను పదేళ్ళుగా తన్నుకుంటున్నాడు— సత్యవతికి తనవల్ల పిల్లలు పుట్టాలని. పాణిగ్రహణమయిన రోజే పుట్టబోయే బిడ్డ మాట ఆడతాడే ఇతడు. మాధవి ఇంకా గర్భవతి అవ్వు— అయితే గియితే— ఆ తర్వాత కదా పంపేమాట. ఆమెకు పిల్లలు పుట్టకపోతే శాశ్వతంగా నావద్దే ఉండిపోతుంది. ('ఓ కొడుకు పుట్టే వరకూ మీ వద్ద ఉండనీ' అని కదా గాలవుడు అన్నది.) చూద్దాం ఎవరు గెలు

స్తారో? ఏమయినా రెండు వందల గుర్రాలే ఇచ్చి ఈ యువతిని నావద్దే ఉంచుకో గలిగితే ఎంత బాగుంటుంది!

మర్నాడు దివోదాసు, మహారాణి సత్యవతిని అంతఃపురంలో చూసేసరికి పాణిగ్రహణ వార్త అక్కడికి చేరిపోయింది. సత్యవతి మండిపడి పోతోంది. భార్యను ఓదార్చటంలో రసికుడైన రాజు దివోదాసు మంచి నిపుణుడు. అతడు ఆమెను తన గుండెల మీద పడుకోపెట్టుకుని, తల నిమురుతూ మృదువుగా చెప్పాడు.

"బ్రాహ్మణుడు వచ్చి 'కన్యని స్వీకరించండి' అన్నప్పుడు రాజునైన నేను వద్దు అనకూడదు. ఇదీగాక మాధవి ఇక్కడ శాశ్వతంగా ఉండిపోదు. ఆమెకి ఓ బిడ్డ పుడితే...పుట్టాక ఆమెను పంపివేయాలని నిర్ణయమయింది. దేవి నామీద కినుక వహించకూడదు."

స్త్రీ సహజమయిన కుతూహలంతో సత్యవతి అడిగింది :

"మాధవి ఎలాగుంటుంది? చాలా అందగత్తా?"

"లేదబ్బా! నీ రూపం ముందు ఆమె దిగదుడుపే" అని అన్న రాజు మనసులో అనుకున్నాడు. నిజం చెప్తే ఈమెకు కోపం రావచ్చు. మాధవి అప్సరస- సత్యవతి మానవ మాత్రురాలు.

"అంతేనా?" అంటూ సత్యవతి మరింత గట్టిగా కౌగలించుకుంది రాజుని.

అయితే మాధవి తన సవతి అయి, భర్త ప్రేమలో భాగం పంచుకోవటానికి రాలేదు అనిపించింది సత్యవతికి. రాజు కామంలో పాలు పంచుకోనీ. అలాంటి వాళ్ళు ఈ రాణివాసంలో ఎంతోమంది ఉన్నారు. ఆమెకు బిడ్డపుడితే...నేనే పెంచుకుంటాను. కాని పుత్ర కామేష్టి అయ్యాక తనకూ ఓ బిడ్డ పుడితే...? నా బిడ్డతో బాటే ఇదీ ఒకటి.

# 12

అశ్వమేధయాగానికి కాశీనగరం సిద్ధమయింది. రాజభవనాన్ని ప్రత్యేకంగా అలంకరించినట్టే ప్రతి ఇంటినీ పచ్చని తోరణాలతోనూ– రంగవల్లులతోనూ అలంకరించారు. ఇళ్ళకు సున్నాలూ, రంగులూ వేశారు. నాలుగు వీధులు కలిసే చోట– ఎత్తైన గోపురాలమీద మంగళధ్వజాల్ని నిలిపారు.

చుట్టుపక్కల రాజులూ, వారి పరివారమూ రథాలూ, గుర్రాలూ, ఏనుగుల మీద వేంచేశారు. ఈ వాహనాలు యజ్ఞభూమి దాటి ఓ ఆమడవరకూ కనిపిస్తున్నాయి. బ్రాహ్మణులూ, విద్వాంసులూ, ఋత్విక్కులూ ఎంతోమంది వచ్చారు. వారి మంత్రాలతో ఆ ప్రదేశానికే విచిత్రమయిన కళ వచ్చింది. పాకశాలనుండి వస్తున్న పరిమళాలు పదిదిక్కులా వ్యాపించి అతిథుల నోట్లో నీళ్ళూరేలా చేస్తున్నాయి.

అక్కడక్కడా నిల్చున్న రాజసేవకులు వచ్చిన వారిని సత్కరిస్తున్నారు.

"మీకు ఉండటానికి చోటు దొరికిందా బాబూ? రాత్రి నిద్ర బాగా పట్టిందా?"

"భోజనం అయిందా?"

"వస్త్రాలు కావాలా? ఆభరణాలు కావాలా?" అని అడుగుతున్నారు.

యజ్ఞభూమిలో అక్కడక్కడా చలివేంద్రాలు, భోజనశాలలు నిర్మించబడ్డాయి.

"యజ్ఞం జరుగుతుండగా ఎవరూ ఆకలి దప్పులతో బాధపడకూడదు" అని మహర్షి భారద్వాజులవారు చాలా నిక్కచ్చిగా చెప్పారు. అందువల్ల కావాలన్న వారికి చాలనేంతవరకూ ఆహార, పానీయాలను ఇవ్వాలని రాజాజ్ఞ అయింది.

కడుపు నిండిన బ్రాహ్మణులు బానల్లాంటి తమ బొజ్జలను నిమురుకుంటూ, బ్రేవ్‌మని త్రేనుస్తూ, తమలో తామే మాట్లాడుకుంటున్నారు.

"అన్నదాత అయిన చక్రవర్తి దివోదాసు దీర్ఘాయుష్మంతుడు అవుగాక!"

"అతనికి సమస్త శుభాలు కలుగు గాక!"

యజ్ఞమంటపం అతిథుల కనులను మనసును ఆకర్షిస్తోంది. అన్ని స్తంభాలకూ స్తంభాలకూ మధ్య పూవులూ, చిగురుటాకులు, పచ్చని ఆకులతో తోరణాలను కట్టారు. మల్లె, తామర, సంపెంగల హారాలు అక్కడక్కడా కళకళలాడుతున్నాయి. పరిమళయుక్త వాతావరణంలో మంత్ర ఘోష ధార్మిక విజయాన్ని చాటుతోంది. ప్రజలు, సామంతులు, రాజులు, శిల్పులు, కళావిదులు, కవులు, విద్వాంసులతో సభ నిండిపోయింది.

మాఘ శుద్ధ తదియనాడు శాస్త్రోక్తంగా అశ్వమేధ యాగం మొదలయింది. యజ్ఞ పౌరోహిత్యాన్ని వహించిన తెల్లటి శిఖ, గడ్డం, మీసాలతో, ప్రకాశవంతమయిన కళ్ళతో తెల్లటి పంచె కట్టిన భరద్వాజ మహాముని అందరి దృష్టిని ఆకర్షించారు. ఆయన పక్కనే దీక్షలో ఉన్న రాజు కూడా అందరి దృష్టికి కేంద్రమయ్యాడు.

"ఇంత మహాయాగం చేస్తున్నాడు. రాజుకి స్వర్గప్రాప్తి తప్పక అవుతుంది."

"స్వర్గప్రాప్తేం ఖర్మ! ఇంద్రపదవే దొరకాలి!"

"అదీ చూడాలి. నాకూ నీకూ మాత్రం పసందైన విందు భోజనము దొరుకుతుంది."

"దక్షిణ కూడా కావలసినంత ఇస్తారట."

రాజగృహం నుండి రాణివాసం వారు పల్లకీలలో వచ్చి దిగారు. యజ్ఞవేదిక వెనకాలనున్న స్థలాన్ని వారికోసం సిద్ధపర్చారు. మహారాణి సత్యవతి ముందు వరసలోని పద్మాసనాన్ని అలంకరించింది. ఆమె వెనక ఆమె సఖీజనం. మాధవి, ఆమె సఖులూ ఇంకా వెనక కూర్చున్నారు.

అశ్వమేధం మూడురోజులు జరిగే యాగం. భారద్వాజుల వారి ఆధ్వర్యంలో, వేద పారంగతులయిన ఋషులు మీమాంసా శాస్త్రంలోను, కల్ప సూత్రాల్లోనూ నిర్దేశించినట్లుగా, శాస్త్రోక్తంగా యజ్ఞ కర్మలను చేశారు. ప్రవర్గ్యము, పాత్రస్నపనమనే కర్మలు, ఉపసత్తనబడే ఇష్టి బ్రాహ్మణులచే యథావిధిగా నడి

పింపబడ్డాయి. యజ్ఞవేదిక దర్భలూ, సమిత్తులూ. స్రుక్కు, చమసము మొదలైన వస్తువులతో మండ నారంభించింది. ఎర్రటి జ్వాలలతో నల్లటి పొగకూడా చేరి ఒక విధమయిన రౌద్రకళ వచ్చింది ఆ సభకు. అగ్నిహోత్ర ధూమ పరంపర నల్లటి మబ్బులా యజ్ఞవేదిక నంతా ఆవరించింది.

"ఇప్పుడు ఇంద్రుని హవిర్భాగము" అని మంత్ర పూర్వకంగా ఘోషించారు భారద్వాజులవారు. అలాగే ఆయా దేవతలకు హవిర్భాగం సమర్పింపబడింది.

"ఆఁ. నేను ఇంద్రుడ్ని చూశాను!"అని ఆ సభలో వున్న బ్రాహ్మణు డొకడు తన పక్కవానితో చెప్పాడు.

"ఈ పొగలో ఇంద్రుడు కాదు– ఏ దేవత వచ్చినా ఏమీ కనిపించదు."

"ఎవరికి తెలుసు? ఇంద్రుడికి వీడంటే పక్షపాతమేమో ?"

మొత్తానికి జరగాల్సిన కార్యమంతా మంత్రలోపం, క్రియాలోపం, ద్రవ్య లోపం లేకుండా జరిగాయి.

యజ్ఞవేదికపై జరుగుతున్న హోమా లన్నిటినీ చూస్తున్న మాధవికి ఓక్షణం అనిపించింది– ఈ అశ్వమేధ యాగానికి మహారాజు సహస్రకోటి వరహాలనయినా ఖర్చుపెట్టి వుండాలి. దానివల్ల ఎవరికి ప్రయోజనం? తన తండ్రి యయాతి కూడా ఇలాంటి యాగాల్ని చేశాడు. అప్పుడు ప్రజలపై ప్రత్యేకమయిన పన్నులు విధించేవాడు. పన్నులు చెల్లించని వారిని రాజభటులు కొట్టేవారట. పేదవాళ్ళ ఇళ్ళలోంచి దొరికిన సామాగ్రిని దోచుకుని వచ్చేవారట. ఇవన్నీ దాసీల నుండి విన్న కథలు. అలాంటివి ఈ కాశీరాజ్యంలోనూ నడిచే ఉండాలి.

తనను రోజూ ఆభరణాలతో అలంకరించే దాసీని మాధవి అడిగింది :

"ఈ యాగం ఇప్పు డెందుకు చేస్తున్నారు ?"

"ఇంకెందుకు? మహారాజులుం గారికి పుత్రోదయం కావాలని,"

"యాగం చేస్తే పిల్లలు పుడతారా ?"

"అవును రాణీ."

తాను అధిక ప్రసంగం చేశానేమో ననిపించింది ఓ క్షణం మాధవికి. తన మాట ఎవరయినా విన్నారేమోనని భయం భయంగా చుట్టూ చూసింది. అందరి దృష్టి యజ్ఞవేదికపై కేంద్రీకృతమై ఉండటాన్ని చూసి నిశ్చింతగా నిట్టూర్చింది.

దాసి మేఖల ఆమె చేయి తట్టి- "రాణీ! యూపస్తంభాల్ని చూడండి" అన్నది చిన్నగా.

వేదికపై మొత్తం ఇరవైయొక్క యూపస్తంభా లున్నాయి. ఒక్కొకక్కటి ఇరవైయొక్క మూరల పొడుగున్నాయి. ఒక్కో స్తంభంమధ్యా నాలుగు మూరల చోటున్నది. బిల్వము, ఖదిరము, మద్ది చెట్లతో ఆరారు స్తంభాలు, శ్లేష్మాతకముతో ఒక స్తంభము, దేవదారు వృక్షంతో రెండు స్తంభాలు నిర్మించారు. స్తంభాలను బంగారు చుట్లతో అలంకరించారు. ఒక్కొకక్కదానికి ఒక్కోరకమయిన వస్త్రాన్ని చుట్టారు. శాస్త్ర విహితములయిన సర్పాలు. పశువులు, పక్షులు ఆయా దేవతల కుద్దేశింపబడి ఆయా స్తంభాలకు కట్టబడి వున్నాయి. పశువు మొదలయిన వాటిని వధించవలసి వచ్చినప్పుడు ఆ యాగానికి సంబంధించిన గుర్రాన్ని, తాబేలు మొదలైన జలచరాలనూ, ఇతర పశువులనూ ఋత్విక్కులుతెచ్చి ఉపయోగించారు. ఆ యూపాలలో మూడువందల జీవులతోబాటు, అశ్వమేధ యాగపు అశ్వరత్నంకూడా కట్టబడింది.

"మహారాణీవారు వచ్చి అశ్వాన్ని పూజించాలి" అని ఆజ్ఞాపించారు భారద్వాజులవారు.

ముత్యాలకుండలాలనూ, హారాలనూ ధరించిన శ్వేతవస్త్ర ధారిణి మహారాణి సత్యవతి వేదికపైకి వెళ్ళి శాస్త్రోక్తంగా అశ్వాన్ని పూజించింది.

"మహారాణి పుణ్యవంతురాలు" అని సభీజనమంతా తమ సంతోషాన్ని వెలిబుచ్చారు.

పూజ చేశాక సత్యవతి గుర్రానికి ప్రదక్షిణ చేసి మూడు కత్తులతో గుర్రానికి గాట్లు పెట్టింది.

ఋత్విక్కు గుర్రపు వపను తీసి శాస్త్రి బద్ధంగా పచనము చేశాడు. ఆ వపను ప్రేల్చుతున్నప్పుడు రాజు తన పాపపరిహారార్థమై దాని పొగను శాస్త్రరీతిగా ఆఘ్రాణించాడు. చచ్చిన గుర్రపు అవయవాలు అరణులచే పుట్టిన అగ్నిలో ప్రేల్చబడ్డాయి.

ఓ సంవత్సరం పాటు రాజ్యాలన్నీ చుట్టివచ్చిన గుర్రానికి పట్టిన గతి చూసి మాధవికి జాలి వేసింది. ఇన్ని వేలమందికి సంతర్పణ, దక్షిణ, ఉపచారాలు నడిచాయి కదా– ఇదంతా ఓ రాజు వంశాభివృద్ధి కోసమా, అతనికి స్వర్గప్రాప్తి కోసమో అని తప్పుకుంటే బాధ కలిగింది.

"మహారాజా, ఇక వంశాభివృద్ధికై భూదానం చెయ్యి."

భారద్వాజులవారి ఆదేశం.

దివోదాసు రాజ్యంలోని వేర్వేరు దిక్కుల దేశాలను ఋత్విక్కులకు దానం చేశాడు.

అప్పుడు ఋత్విక్కులు ముందుకు వచ్చి–

"రాజా, మేము వేదాధ్యయనంతో కాలం గడిపే వాళ్ళం. రాజ్య భార నిర్వహణము మాకు తెలియదు. మాకు ధనం ఇచ్చి దేశాన్ని తిరిగి తీసుకో. రత్నములు, సువర్ణము, గోవులు వీటిల్లో నీవు ఏది ఇచ్చినా మేము తృప్తులము అవుతాము" అన్నారు.

దివోదాసు పదివేల గోవులనూ, ఒక వెయ్యి బంగారు నాణాలనూ, దానికి నాలుగు రెట్లు వెండి నాణాలను దానం చేశాడు.

అశ్వమేధం ముగిసిన నాడే పుత్రకామేష్టి.

"అధర్వ వేద మంత్రాలతో విధిపూర్వకంగా అన్నీ నిర్వహించాలి" అని ఆజ్ఞాపించారు భారద్వాజులవారు.

విస్తారమయిన యజ్ఞమంటపంలో హోమవాహనాలు ప్రారంభమయ్యాయి. ఋత్విక్కులు మంత్రాలను సామగానం చేయసాగారు. యజ్ఞకుండం ముందు సువర్ణ కలశంలో ప్రత్యేకంగా తయారు చేసిన పాయసాన్ని పెట్టారు. దానికి హారాలు వేశారు. పసుపూ, కుంకుమలు, గంధమూ పూశారు.

దేవత లందరికీ హవిర్భాగాలు అర్పించాక పూర్ణాహుతి కూడా అయింది. ఆ సమయంలో పోసిన నేతితో పెద్ద మంట లేచింది.

అప్పుడు భారద్వాజులవారు ఉచ్చైస్స్వరంతో చెప్పసాగారు.

"మహారాజా. ఆహవనీయ యజ్ఞ కుండం నుండి ఎనలేని కాంతిగల పురుషాకృతి ఉద్భవించింది చూడు."

దివోదాసు కళ్ళు చికిలించి చూశాడు. మంట తప్ప మరేమీ కానరాలేదు.

భారద్వాజుల వారి వర్ణన ఇంకా ముందుకు సాగింది.

"మహావీర్యం కల, ఎరుపూ నలుపూ రంగులతో కూడిన వస్త్రాన్ని ధరించిన ఈ దేవతను చూడు. ముఖం ఎర్రగాను, కంఠం దుందుభి వలెనూ, జుట్టుసింహపు జూలు వలెనూ ఉన్న ఈ దేవతను చూసి ప్రణామం చెయ్యి. శుభ లక్షణాలతో కూడిన దివ్యాభరణాలతో అలంకృతమయిన ఈ మహామహునకు నమస్కారం చెయ్యి..."

భారద్వాజుల వారు వర్ణిస్తూండగా అలాంటి పురుషుని చూడటానికి ప్రయత్నించి విఫలుడైన రాజుకు దుఃఖం కలిగింది. దేవతలు మహామహితుల కళ్ళకు మాత్రం కనిపిస్తారట. అయినా తనకు దేవత కనిపించలేదని మునుల ముందు ఒప్పుకోవటానికి అతని మనస్సు అంగీకరించలేదు.

దివోదాసు అగ్నికి నమస్కరించి "కృతార్థుడ్ని అయ్యాను" అన్నాడు.

"దేవతలు ఆశీర్వదించి ఇచ్చిన పాయసం ఆ కలశంలో ఉన్నది. దానిని నీ రాణికి ఇవ్వు మహారాజా."

దివోదాసు భక్తితో పాయసపు కలశాన్ని అందుకున్నాడు. సత్యవతి గజగంభీర గమనయై రాజు వద్దకు నడిచింది. అత నిచ్చిన కలశాన్ని అందుకుని పాయసాన్ని గటగటా తాగసాగింది.

"పాయసాన్ని మిగిలిన రాణులకు కూడా పంచవచ్చు రాజా!"

దివోదాసు కంగారుగా "సత్యా, సత్యా! కలశాన్నివ్వు" అని కేకలు పెట్టాడు.

కాని ఆ కలశం మిగిలిన చిన్న రాణుల చేతులమీద ఒకరినుంచి మరొకరికి వెళ్ళింది. కొంతమందికి ఒకో గ్రుక్క దక్కితే, మరికొంతమందికి ఒక్క చుక్కే దక్కింది.

"మాధవికి...మాధవికి..." అని రాజు అంటూండగానే పాత్ర మాధవి చేతికి వచ్చింది. కాని ఆ వేళకి గిన్నె ఖాళీ అయింది.

# 13

స్నానగృహంలో సుఖోష్ణమయిన సుగంధ పరిమళ జలంతో మాధవికి స్నానం చేయిస్తూ మేఖల అంది.

"మీవంటి అపూర్వ సౌందర్యవతిని నే నెక్కడా చూడలేదు."

ఒకక్షణం మాధవికి తన దేహ సౌందర్యంపట్ల గర్వ మనిపించింది.

"ఆఁ ఊరుకుందూ. నీకు పొగడటం తప్ప మరోపని లేదు."

మేఖల నవ్వుతూనే ఆమె వళ్ళు తోమింది.

"ఇక మహారాజుగారి కెంత సంతోషం కలుగుతుందో ఏమిటో!"

"మహారాజు" అన్న పదం చెవిన పడగానే మాధవి మోహం వివర్ణమయింది. ఆయన ఇవాళ తనతో గడపటానికి వస్తున్నారనే తనకింత విశేష అలంకరణ.

పరిస్థితులు వేరుగా వున్నట్టయితే ప్రియుడు వస్తాడని తానే అలంకరించుకునేది. తన కిష్టమయిన అలంకరణ, తాను మెచ్చిన ఆభరణాలు, ప్రియుని కిష్టమయిన రంగు దుస్తులు. కాని దివోదాసు తాను కోరుకున్న ప్రియుడు కాదు. తనను నాశనం చేయటానికే పుట్టినవాడు.

మేఖల తన రాణి ఒళ్ళు తుడిచి సుగంధ ద్రవ్యాలను వొంటికి రాయసాగింది, ఆ మాదక పరిమళానికి మాధవి తల తిరిగింది. నీలం పట్టుచీర కట్టి చెవులకు అవతంసాలనూ. కంఠానికి దీంపుల అడ్డిగనూ- అలంకరించింది. చేతులకు పగడాల కంకణాలనూ. నడుముకు నవరత్నాల ఒడ్డాణాన్నీ పెడుతూండగా అసహనంతో 'ఇక చాల్లెద్దూ' అంది మాధవి.

ఇంత అలంకరణా ఒక్క క్షణంలో బూడిద పాలవుతుంది. రాజుకి కావాల్సింది ఈ అలంకరణ కాదు. అతడు కోరుకునేది తన దేహాన్ని మాత్రమే. అందు కోసం ఇంత కష్టపడటం దేనికి? ఓ చీర కట్టినా చాలు.

జాలకము బయట ఎవరో బిడ్డ ఏడ్చిన ధ్వని విని ఉలిక్కిపడింది మాధవి. కిటికీ దగ్గరకు వెళ్ళి చూసింది. ఆవరణలో ఎవరో బిడ్డ ఏడుస్తోంది. దాసి ఒకతె ఊరుకో పెడుతోంది.

దూరంనుండి బిడ్డ ముఖం సరిగ్గా కన్పించటంలేదు. కాని ఎవరయినా వసుమంతుణ్ణి ఇక్కడికి తీసుకుని వచ్చారేమో. అమ్మ ఏదీ అని ఏడుస్తున్నాడేమో! మాధవి గుండె వేగంగా కొట్టుకోసాగింది.

"వెళ్ళు ఆ బిడ్డ ఎవరిదో చూసుకుని రా" అంది వణికిపోతూ. దాంతో కిటికీలోంచి చూసిన మేఖల—

"అయ్యో! బిడ్డ ఆ దాసిది. బిడ్డకు వంట్లో బాగాలేదని చెప్పింది" అని నిర్లక్ష్యంగా చెప్పి మాధవి తల దువ్వసాగింది.

వసుమంతుడికిప్పుడు నాలుగయిదు నెలలయి ఉండాలి కదా? ఈ బిడ్డ ఇంకా పెద్దవాడు. అదయినా ఎందుకు తోచలేదు. ఆ వసుమంతుణ్ణి ఇప్పుడు కనకాంబరి పెంచుతోందో, మహారాణే చూసుకుంటోందో! ఏమయినా తల్లి గుర్తే ఉండదు. సుఖంగా పెరుగుతాడు. ఓ రోజు మహారాజవుతాడు, ఆ తర్వాత తన తండ్రిలా రాజ్యం ఏలుతాడు.

హర్యశ్వుడు! ఓ సంవత్సరం ప్రేమను నటించాడు. గాలవుడు రాగానే మరో మాట లేకుండా పంపేశాడే! కొత్త వస్తువులు రాగానే వాటిని వదిలిపెట్టేలాగా ఎంత సులభంగా తనను బయటకు పంపివేశాడు!

"రాణీ, అలంకరణ అయింది. వీణ శ్రుతి చెయ్యనా? మహారాజుగారికి సంగీతమంటే బహు ప్రీతి."

"ఏమీ వద్దు!" విసుగ్గా అంది మాధవి. "నీవనయితే నువ్వు వెళ్ళొచ్చు."

"అవును, ఇక మహారాజుగారే వచ్చేటప్పుడు మేమెందుకు?" అని హాస్యమాడుతూ మేఖల దీపానికి మరికాస్త నూనె వేసి, వత్తి సరిచేసి చిరునవ్వుతో బయటికి వెళ్ళింది.

ఈ మాటలకి తాను పులకరించాలి. ఒళ్ళంతా సిగ్గుతో వణకాలి. మొఖం ఎర్రబడాలి. కాని తనకేమీ కావటం లేదే! ఎందుకు? తనలోని ప్రేమభావం కాలి

ఖాడిదయి పోయిందా? ఇంకా అలా చూడబోతే దివోదాసు నడి వయస్సులో వున్నాడు. మంచి రూపం వుంది. తాను కోరుకున్న కలల్లోని రాజకుమారుడు కాక పోయినా కాశీరాజ్యంలోని ప్రతి స్త్రీ కోరుకునే సంపదా, అధికారం కలవాడు. అయినా ఈ మహారాజుపట్ల తాను కట్టెలాగానే ఉంది. పేటల్లో పేటల్లోనూ ఎవరూ తన ఇష్టాఇష్టాలను అడగలేదు. కర్తవ్యానికి బద్ధురాలై ఇంకా ఊపిరి తీస్తున్న దంతే. ప్రపంచ దృష్టిలో తనకీపాటి కష్టమే రెండుమార్లు పెళ్ళయింది. ఇది ఓ సంవత్సరం పాటు మాత్రం ఉండే బంధనం. ఆ తర్వాత ముక్తి. మళ్ళీ కారాగృహం—మరోచోట.

బయట ప్రతీహారుల ఉద్ఘోష రాజు రాకను తెలిపింది. తలుపు తోసుకుని వచ్చిన దివోదాసు ఆమెను చూసి నవ్వి తలుపు గడియవేశాడు. మాధవి తన వద్దకు పరిగెత్తుకుని వస్తుందని అతని ఊహ. ఆమె నిల్చున్న చోటునుండి కదల్లేదు. అతనే ఆమె వద్దకు వచ్చి గట్టిగా కౌగలించుకుని ముద్దుల వర్షం కురిపించాడు.

మాధవి మౌనంగా ఉండటాన్ని చూసి రాజు— "ఏదీ తాంబూల మివ్వు" అన్నాడు.

హంసతూలికా తల్పం పక్కనున్న తాంబూలపు పళ్లెంనుండి ఒకటి తీసి అతని చేతి కివ్వబోయింది.

"నోట్లో పెట్టు."

ఆమె ఇచ్చిన దాన్ని సగం కొరికి మిగిలినది ఆమె నోట్లోనే పెట్టాడు. మద్యంవాసన వేస్తున్న తాంబూలాన్ని మందు మింగినట్టుగా మింగింది మాధవి.

"నువ్వు అరసికురాలివి. ఇంకొకర్ని ఉద్రేకపరిచే రూపం ఉంది నీకు. నీకేమీ అనిపించదా?"

"లేదు" అందామనుకుంది మాధవి. ప్రశ్నలెందు కడుగుతావు? నాకోసం కన్యాశుల్కం ఇచ్చావు. నీకు కావలసినట్టు అనుభవించు అన్న మాటల్ని అలాగే మింగేసింది.

దివోదాసు ఆమె స్తనవస్త్రాన్ని లాగి పారవేశాడు. పయ్యెదను చింపి పారేశాడు.

"కుచకుంభ సుందరి అని కవులు వర్ణించటం విన్నాను. కాని అలాంటి సౌందర్యాన్ని చూడటం ఇవాళే మొదలు."

[—ఇతనికి చెప్పి వెయ్యనా, నేను హర్యశ్వునితో పడుకున్నాను. అంతే కాదు- ఓ బిడ్డ తల్లిని అని?—]

దివోదాసు ఆమె స్తనాలకు చక్కిలిగింతలు పెట్టాడు.

"వద్దు."

"అలా చేస్తే నీకిష్టం కాదా!"

[-లేదు. ఇది నరకయాతన. తన మనస్సు కోసుకొని వాడితో ఎలా సుఖపడగలదు?-]

దివోదాసు ఆమె చెవి వెనకాల భాగాన్ని ముద్దుపెట్టుకున్నాడు. మేఖల అక్కడ రాసిన సుగంధ ద్రవ్యం అతన్ని మరింత ఉద్రేకపరిచింది. ఆమె చెవిని. మెడనూ. వీపునూ కొరికాడు.

"అయ్యో!" అంది మాధవి నొప్పితో,

"నీకు కామశాస్త్రం తెలియదా! అది తెలిసిన కొద్దీ జీవితంలో ఆనందం ఎక్కువ."

"ఇదే ఆనందమా మహారాజా?"

'మరింకేముంది? స్వర్గంలో అప్సరసల పొందు లభిస్తుందట. నీలాంటిది ఉండగా నాకింకెవరూ వద్దు. రా దగ్గరకు రా."

మాధవిని పాన్పుమీదికి తోసి దివోదాసు ఆమె శరీరాన్ని నుగ్గునుగ్గు చేశాడు.

ఎంతోసేపు అలాగే మత్తు. అలసట. మళ్ళీ ఓడిపోయానని మాధవికి దుఃఖం. ఏడవా లనిపిస్తుంది. కాని కన్నీళ్లే రావు.

దివోదాసు మెల్లిగా అడిగాడు.

"మాధవీ! ఆరోజు పాయసం తాగావా?"

"లేదు. నాకు దొరకలేదు."

[ఆ మాట చెప్పేటప్పుడు ఎంతో సంతోషం!]

"అయ్యో, ఎంతపని జరిగింది! నాకు తెలుసు. సత్య ఇంతా తాగేసింది' ఇంకెవరికీ పిల్లలు పుట్ట కూడదని..."

"మహారాజా!' పాయసం తాగితేనే పిల్లలు పుడతారా!"

"అవును. మరి పుత్రకామేష్టి ఎందుకు చేశా ననుకున్నావు?"

మాధవి బదులు చెప్పకుండా చిరునవ్వు నవ్వింది.

మరునాడు మేఖల కళ్ళు ఎర్రగా ఉన్నాయి. ముఖం కూడా వాచినట్టుంది. తన కష్టం తనది. ఇంకొకరి కష్టసుఖాల గొడవ తన కెందుకని మాధవి అంతర్ముఖియై కూర్చుంది. చాలా సేపయినా మేఖల నోరు విప్పలేదు.

దాసి అయినా ఈ రాచనగరులో తనతో ప్రేమగా ప్రవర్తించేది మేఖల ఒక్కతే. ఆమె కష్టం ఏమిటో కనుక్కుంటే, ఆమె దుఃఖాన్ని తనతో పంచుకుంటే కొంచెం బాధ తగ్గవచ్చు కదా! అనిపించింది మాధవికి.

"ఏమయింది మేఖలా?"

"ఏమీలేదు రాకుమారీ. మీరు సంతోషంగా వుండగా నా దుఃఖంతో మిమ్మ ల్నెందుకు విసిగించటం?" అంటూ మేఖల వెక్కి వెక్కి ఏడవసాగింది.

"నేను సంతోషంగా ఉన్నానా? అయ్యో నీకేమీ అర్థం కాదులే. త్వరగా చెప్పు. మిగిలిన దాసీలు వచ్చే వేళ అయింది." అంటూ మాధవి ఆమె వీపు నిమి రింది ఓదార్పుగా.

మేఖల మరికొంత సేపు ఏడ్చి తర్వాత చీరచెంగుతో కళ్ళు తుడుచుకుని తన్ను తానే నిగ్రహించుకుని చెప్పింది.

"తెల్లవారుజామున మా అమ్మ వచ్చింది."

"నీకు తల్లి ఉందనే విషయం కూడా నాకు తెలియదే! ఎక్కడున్నదామె ? ఇక్కడికి తీసుకుని రా. చూడా లనిపిస్తుంది. నాకైతే తల్లి ముఖమే తెలియదు."

"అమ్మ ఊళ్ళో ఉంది. నన్ను చూసి వెళ్ళింది. ఓ వారం క్రితం రాజ భటులు ఆమెను పట్టుకుని బాదారుట. చూపించింది. వీపంతా వాతలు వాతలు తేలి నల్లగా అయింది. అది చూడలేక పోయాను రాణీ."

"ఉండు. మహారాజు గారితో చెప్తాను."

"మీకు దండం పెడతాను. ఆ పని మాత్రం చెయ్యకండి. నా తమ్ముడి గురించి ఇలా అయింది. అతను సైన్యంలో చేరాలని రాజాజ్ఞ. నా తమ్ముడి కది ఇష్టంలేదు. 'వ్యాపారం చెయ్యాలని ఉంది' అన్నాడట. 'వీల్లేదు' అన్నారట. వాడెక్కడో తల దాచుకున్నాడు..."

ఉన్నట్టుండి మౌనం వహించింది మేఖల. ముందుకు చెప్పటమా అని ఆలోచించింది. ఇంకెవరయినా తమ సంభాషణను రహస్యంగా వింటున్నారేమోనని అటూ ఇటూ చూసింది.

"చెప్పు" అంది మాధవి.

"తమ్ముడు రహస్యంగా వేరే రాజ్యానికి వెళ్ళాడట. వాడెక్కడికి వెళ్ళాడు అని రాజభటులు అమ్మ నడిగారట. తెలీదు అందిట. దబదబా దెబ్బలు పడ్డాయట. నాకు తెలియదు మహాప్రభో అందిట. మళ్ళీ దెబ్బలు."

"కసాయివాళ్ళు. ఎవరికిష్టం వచ్చిన ఉద్యోగం వారెందుకు చెయ్యకూడదట ?"

"అశలు. ఆపేక్షలు మహారాజుగారికి మాత్రమేనమ్మా. ప్రజలకు హక్కులేదు."

అశాంతితో లేచి అటూ ఇటూ పచార్లు చేసింది మాధవి. తానొక్కతే బాధ పడుతున్నది అనుకున్నది. తనకన్నా వెయ్యిరెట్లు బాధపడే వాళ్ళు ఉన్నారనుకుంటే మనస్సుకు కొంచెం శాంతి లభించింది.

"ఇదంతా మాట్లాడుతున్నావు మేఖలా! నువ్వెందుకు వచ్చావిక్కడకు ? మీ అమ్మతోనే వుండవచ్చును కదా?"

"ఉండవచ్చును. కాని రాజుగారు కొనుక్కున్నాడు నన్ను – వట్టి వంద వరహాలకు !"

[—తనది దానమయితే ఇది అమ్మకం. మేఖల వెల వంద వరహాలు. తనది ఒక్కరాజుకి రెండు వందల గుర్రాలు—]

"ఓ రోజు మహారాజు ఊరేగుతున్నారు. నేను ఆశగా ఇంటి మేడ మీద నిల్చుని చూస్తున్నాను. రాజుగారు నన్నెలా చూశారో ఏమో. ఆ మరునాడు రాజభటులు వచ్చారు. నా చెలకట్టి తీసుకుని వచ్చేశారు. ఆ వొక్క రోజు రాజుగారితో గడపన్నాను. మళ్ళీ వారి మొహం చూసే అవకాశం కూడా నాకు రాలేదు."

మేఖల నిశ్శబ్దంగా పేకప సాగింది.

"మీ అమ్మ ఎలా ఒప్పుకుంది దీనికి ?"

"ఒప్పుకునే ప్రశ్నే లేదు రాకుమారీ. రాజు కావాలి అంటే లేదనే ధైర్యం ఎవరి కుంది ?"

తామిద్దరిదీ సమానమైన దుఃఖం అనిపించింది మాధవికి. బాధతో అడిగింది :

"ఈ రాజభవనం నుండి పారిపోవాలని పించదా నీకు ?"

"అనిపిస్తుంది. కాని ప్రయోజనం లేదు. ఎక్కడికి వెడతాను చెప్పండి. అమ్మ వద్దకు వెడితే రాజభటులు చేతులూ కాళ్ళూ కట్టి మోసుకుని వస్తారు. ఆవిడకు భారం కావటానికి బదులు ఇక్కడుండటమే నయం. ఇంకేం లేకపోయినా ఇక్కడ కడుపునిండా భోజనం దొరుకుతుంది. శరీరం కప్పటానికి బట్ట దొరుకుతుంది. ఆడ దానికి అంతకన్నా ఎక్కువ ఇంకేం కావాలి చెప్పండి?"

తిండీ, బట్టా తప్ప ఆడదానికి ఇంకేం అక్కర్లేదా? ఇదెలాంటి కటువైన నిజం — అని మాధవికి ఖేదం కలిగింది.

# 14

'ఇవాళ రాజసభలో మందారమాల నాట్యముంది. రాణీ వాసంలోని వారందరూ రావాలి' అన్న రాజాజ్ఞను దాసీ ఒకతె అన్నిచోట్లా చెప్పుకుని వచ్చింది.

తన పొడుగాటి జుట్టును దువ్వించుకుంటూ కూర్చున్న మాధవి "అదేమిటి విశేషం?" అని మేఖలను అడిగింది.

"మందారమాల బహు చక్కగా నాట్యం చేస్తుంది. రాజుగారికి ఆమె అంటే మహా ప్రేమ."

"మహారాజుగారికి ఎవర్ని చూస్తే ప్రేమలేదు చెప్పు?"

–అని వ్యంగ్యంగా అడిగింది మాధవి. ఆ మాటలకు జవాబు చెప్పకుండా జడ వేయసాగింది మేఖల.

"సభకు నేను రాను. నువ్వు కావాలంటే వెళ్ళిరా."

"అలా కుదరదు రాకుమారీ. వెళ్ళకపోతే తప్పుగా అర్థం చేసుకుంటారు. పైగా ఇదొక్కటే మనందరికీ పై వాళ్ళను చూసే అవకాశం. మహారాణి సత్యవతి కూడా వస్తారు. వారిని మీరు పలకరించవచ్చు."

మాధవి కోపంగా "నేనెవర్నీ పలకరించ నక్కర్లేదు" అంది.

అయినా మేఖల మాట తీసేయలేక ఆమె సభకు బయలుదేరాల్సి వచ్చింది.

హారిలాగానే రాణివాసం స్త్రీలు రాజసభ కని ప్రత్యేకంగా అలంకరించు కున్నారు. రంగురంగుల పట్టుచీరలు. రకరకాల ఆభరణాలు. ఎక్కడ చూసినా సంబరం. హడావిడి.

సభామందిరం విశాలంగా వుంది. దానిలో మహారాజు ఎత్తైన కనక సింహాసనం మీద కూర్చున్నాడు. అతనికి రెండు వేపులా దాసీలు ఛామరాలతో వీస్తు

న్నారు. మంత్రి సేనాపతీ అటూ ఇటూ కూర్చున్నారు. వందలాది ప్రజలు తమ తమ స్థానాల్లో ఆసీనులయ్యారు. దండధారులు ఎక్కడా గొడవ రాకుండా అందర్నీ కూర్చోబెడుతున్నారు.

కవిపుంగవు డొకడు తాను రచించిన పద్యాన్నొకదాన్ని పాడసాగాడు. అతని కంఠం కర్కశంగా ఉన్నా పాడాలన్న పట్టుదల మాత్రం ఎక్కువగా ఉన్న ట్టుగా కనిపించింది. కవిత లోని భావం అర్థంకాని దాసీజనం కొంగుతో నోళ్ళు కప్పుకుని నవ్వుకున్నారు.

మేఖల మాధవిని తీసుకుని ముందు వరసకే వచ్చింది. సత్యవతి పక్క నున్న ఆసనం ఖాళీగా ఉంది. అక్కడే మాధవిని కూర్చోబెట్టింది. సత్యవతి తన పక్కన కూర్చున్న దెవరా అని చూస్తూండగానే మేఖల చెవిలో చెప్పింది.

"ఆమె మహారాణి. నమస్కరించండి."

మాధవిని పరిశీలిస్తూ ఈ అపూర్వ రూపరాశి ఎవరా అని ఆశ్చర్యపోయింది. అది గమనించిన మేఖల చిరునవ్వుతో—

"మహారాణీ, ఈమె యయాతి మహారాజు కుమార్తె మాధవి" అన్నది.

'ఆఁ' అన్న మహారాణికి "నీ రూపం ముందు ఆమెది దిగదుడుపే" అని మహారాజు చెప్పింది ఈమె గురించేనా అనిపించింది.

మహారాజు చెప్పింది అబద్ధం అని కొంచెం కోపం కూడా వచ్చింది. ఇక నాట్య వేదికపైకి దృష్టి మరల్చింది.

తాళం, మృదంగం, వేణువుల మేళానికి తన బంగారు గజ్జెలు ఘల్లుఘల్లు మనగా నడిచి వచ్చింది మందారమాల.

రూపానికి తోడైన యౌవనం, దానికి ఈడైన సింగారం— వీటితో దేవ కన్యలా శోభించింది ఆమె. వసంత ఋతువును ప్రతిబింబిస్తూ నాట్యమాడిందామె; చెట్లు చిగుర్చి పూలు పూసినట్టుగా, కోయిలలు కుహూ కుహూ అన్నట్టుగా అదిచూసి నెమలి నాట్యమాడినట్టుగా, ప్రకృతి అందచందాలు చూసి ప్రేమికులు ఉన్మాదంతో నృత్యం చేసినట్టుగా ఆమె నాట్యం చేసింది. నృత్యంలో నూట ఎనిమిది కరణాలు, నూటెనిమిది భంగిమలు చూపింది. భావము, విభావము, అనుభవము మొదలైన కళలను రేఖలోనే చూపి ప్రేక్షకుల మనుస్సులు గెలుచుకొంది. మందారమాల

రాజు ముందు కొంగు పట్టుకుని నిల్చునే సరికి దివోదాసు మెచ్చుకుని తన చేతి నవరత్న కంకణాలనే తీసి ఇచ్చాడు.

మందారమాల అపూర్వ కళావేత్త్రి అనిపించింది మాధవికి. ఆమెతో మాట్లాడాలన్న కోర్కె కలిగింది. కని తానో కారాగృహంలో బందీయై ఉంది. దేనికీ స్వాతంత్ర్యం లేదు. మందారమాలను కట్టివేసే బంధనమేదీ లేదు.

సత్యవతి లేచింది. మాధవి వేపు తిరిగి చూడనైనా చూడకుండా బయటకు నడిచింది. ఆమె వెనకే ఆమె సఖులూ వెళ్ళిపోయారు.

"ఇంక చిన్న చిన్న నర్తకుల నాట్య ముంటుంది."

"ఎందుకో తలనొప్పిగా వుంది. మనమూ పోదాం" అంటూ లేచింది మాధవి. సత్యవతి చేసిన అవమానం బల్లెంలా గుచ్చుకుంది ఆమె మనస్సులో.

గదిలో సుఖాసనం మీద అలాగే పడుకుంది. తలనొప్పి మందును మేఖల రాస్తూ–

"కొంచెం నిద్రపోండి. సర్దుకుంటుంది" అంది.

నిద్ర రావటం కోసం మంద్ర ధ్వనిలో వీణ వాయిస్తూ కూర్చుంది మేఖల.

అలా ఓ గడియ గడిచిందేమో. తలవాకిలి వద్ద ఎవరో నిల్చున్నట్టయింది. దాసి ఒకతె తొంగి చూసి–

"మందారమాలగారు వచ్చారు. లోపలకు రావచ్చునేమో అడిగి రమ్మన్నారు" అంది.

మందారమాల అనగానే చటుక్కున లేచికూర్చుంది మాధవి.

"లోపలకు రమ్మను."

మేఖల వీణ కిందపెట్టి తెర తొలగించి మందారమాలను లోపలకు పిల్చుకు వచ్చింది.

పరస్పర అభివాదన లయ్యాక మందారమాల అన్నది.

"మీరు అపూర్వ సుందరి అని దాసీలు పొగడటాన్ని విన్నాను. మిమ్మల్ని చూడాలని చాలా రోజులుగా అనుకుంటున్నాను."

"మీరు చాలా బాగా నాట్యం చేశారు."

"అయితే మీరు ఇవాళ రాజసభకు వచ్చారా?" అనడిగింది మందారమాల మెరుస్తున్న కళ్ళతో నవ్వుతూ.

"ఊఁ."

"మీరు ఈ విద్యనే పోషిస్తున్నారు. ఈ కళ నేను జీవనోపాధి కోసం నేర్చుకున్నదే."

"కళాకారులు తమ కళలో లీనమయితే అది శ్రేష్ఠమైన కావ్యమౌతుంది."

"మీది చాలా ఉదారస్వభావం."

"అదలా వుంచండి. మీ ఇల్లెక్కడ?"

"నగరంలో."

"ఇంట్లో ఎవరెవరున్నారు?"

"తల్లి, అన్నయ్యొక్కడు."

"ఇంకెవరూ లేరా?"

మాధవి మాటల్లోని భావాన్ని గమనించిన మందారమాల సూటిగా జవాబు చెప్పింది.

"లేదు. నేను దేవదాసిని. పెళ్ళి చేసుకోవటానికి వీల్లేదు. రాజుగారు ఇష్టపడినప్పుడు రాజభవనానికి వచ్చి వెడతాను. ఇక్కడే ఉండిపో అని ఎన్నోమార్లు మహారాజుగారు చెప్పారు. పంజరంలోని పక్షిలా ఇక్కడ ఉండటం నాకిష్టంలేదు. బయటే బాగుంటుంది. నాకిష్టమయిన వాళ్ళతో వస్తుంటాను. ఇలా చెప్పానని రాజకుమారి నన్ను అపార్థం చేసుకోకూడదు. ఇంతవరకు నేను స్వతంత్రను."

దాపరికంలేని మందారమాల స్వభావం మాధవికి చాలా నచ్చింది. దాంతో పాటే ఈ సంభాషణ ఎన్నో ఆలోచనలకు దారి తీసింది. ఓ విధంగా మందారమాల లాగానే తనూ ఒక వేశ్య. కాని ఆమెలా ఇష్టపడిన వాళ్ళ పొందు పొందే స్వాతంత్ర్యం తనకు లేదు. విధి ఎక్కడకు లాక్కుని పోతే అక్కడకు పోయే మూగప్రాణి తాను. ప్రతిఘటించే హక్కు కూడా లేని క్షుద్రజంతువు. మాధవికి ఏడుపు వచ్చింది. రాజకుమారిగా పుట్టిన తనకు ఎలాంటి గతి పట్టింది! దీనికి బదులు

ఏ పేద ఇంట్లోనో పుడితే తాను సుఖంగా ఉండేదేమో! కాని ఇంతలో మేఖల విషయం గుర్తు వచ్చింది.

• • • •

చైత్రం వెళ్ళి వైశాఖం అడుగు పెట్టింది! ఉద్యానవనంలో ప్రతీ చెట్టూ, మొక్కా చిగిర్చి పూలు పూసింది. ఎర్రని చిగుళ్ళు, లేత ఆకుపచ్చ ఆకులు, ముదురాకు పచ్చ ఆకులూ— వీటి మధ్య రంగురంగుల పూల భూమికలో వర్ణ చిత్రాలలాగ కళకళలాడుతున్నాయి. మాలతి, సన్నజాజుల పరిమళం రాణీవాసాన్నంతా ఆవరించింది. కోయిలల సంగీతం వాద్యనాదంతో పోటీ చేస్తోంది. చిలకల గుంపులు మనోహరంగా తిరుగుతున్నాయి.

ఒక్కో మాసం గడుస్తున్న కొద్దీ సత్యవతి ఆత్రుత హెచ్చసాగింది. ప్రతీ నెలా బహిష్టు అయినప్పుడల్లా ఆమె చిరాకు ఇంకెంత ఎక్కువయ్యేది. కనిపించిన వాళ్ళందరి మీద కోపగించుకునేది. రాజు కూడా ఈ కోపానికి గురి అయ్యేవాడు. "నిగ్రహం కోల్పోకు సత్యా, ఈ నెల కాకపోతే వచ్చేనెల నిలుస్తుంది" అంటూ భరోసా ఇచ్చేవాడు.

సత్యవతి రాణీవాసంలోని రహస్యాలను తెలుసుకోవడానికి తన దాసీలను గూఢచారిణులుగా పంపింది. వారు తెచ్చిన వార్తలు విని మరింత దుఃఖం ఆమెకు.

"[illegible] రాణీ వాసానికి వచ్చింది కదా మందాకిని. ఆ పొట్టిపిల్ల గర్భిణట. రెండు నెల్లయిందట."

"దాన్ని వదిలేయి. క్షత్రియ కన్యకాదు కదా అది!"

"మందాకినికి ఒక్క గుక్క పాయసమే దొరికిందట. అయినా..."

[తాను కలశంలోని మూడొంతులు పాయసం తాగింది. అయినా...]

"నోర్మూయ్యి. ఎక్కువగా మాట్లాడకు."

ఇంకో దాసీ చెప్పింది.

"మాధవి రెండ్నెల్ల గర్భిణీయట"

"అవునా?"

(ఇది నిజంగా ఏడవాల్సిన విషయం.)

"ఒక్క చుక్క పాయసం కూడా దొరకలేదట ఆమెకు."

"అబద్ధం? అబద్ధం. ఇదెవరు నమ్ముతారు? పాయసం తాగకుండా అదెలా గర్భవతయింది?"

"ఏమో తెలీదు మహరాణీ. మాధవి చెలులు అలా అంటున్నారు."

సత్యవతి ఆలోచించ సాగింది. దాసీలు చెప్పిన విషయం నిజమే అయితే మాధవి తమ వంశోద్ధారకుడికి జన్మనిస్తుంది. పరిస్థితులు ఇలా ఉన్నప్పుడు తాను అసూయపడి ప్రయోజనం లేదు. అదీ కాకుండా బిడ్డ పుట్టాక రాజ్యం పిల్లిపెట్టి వెళ్ళిపోతుంది. ఆ శిశువుని సంరక్షించే భారం తనదే. తనకు పుట్టకపోయినా మాధవి కొడుకు తనకు దత్త పుత్రుడవుతాడు. అందుకనైనా మాధవి పట్ల కాస్త ఆదరాభిమానాలు చూపాలి. ఇందువల్ల ఉపయోగం తనకే.

మహారాణి మంగళ ద్రవ్యాలను, ఫల తాంబూలాలను రత్నపు పళ్ళెం లోనూ, పీతాంబరం, ఆభరణాలనూ బంగారుపళ్ళెంలోనూ దాసీలచేత మోయించు కుని మాధవి అంతఃపురానికి వచ్చింది. ఆమెను చూసిన మాధవికి పరమాశ్చర్యం.

సత్యవతి తనకు నమస్కరించిన మాధవిని తల తాకి ఆశీర్వదించి,

"శుభవార్త తెలిసింది మాధవీ. చాలా సంతోషం. ఈ ఫల తాంబూలాలనూ, కానుకలను స్వీకరించు. ఇది మా సంప్రదాయం" అన్నది.

ఓ క్షణం మాధవికి అవ్వ గుర్తొచ్చింది. దుఃఖంతో గొంతు పూడుకు పోయింది. నోట మాట రాక, తలవంచుకుని నిలబడింది.

"కూర్చో మాధవీ. నువ్విప్పుడు విశ్రాంతి తీసుకోవాలి. నీకేమన్నా అస్వ స్థత వుంటే రాజవైద్యులు వచ్చి చూస్తారు."

తల అడ్డంగా వూపింది మాధవి.

"నీకేమన్నా కోరికలుంటే చెప్పు. చేయించి పెడతాను."

"ఏమీ లేదు."

"మా వంశోద్ధారకుణ్ణి మోస్తున్నావు. కోరిక ఎవరికుండదు? చెప్పు. సిగ్గు పడకు."

[—నా కోరికా? నన్ను స్వేచ్ఛగా వదిలిపెట్టండి. ఈ బిడ్డనయినా పెంచే అవకాశం ఇవ్వండి అనడగాలని ఆశ. కాని రెండిటికీ వీల్లేదన్న జవాబు వస్తుందని తెలుసు—]

ఆమె నుండి జవాబు లేకపోయేసరికి సత్యవతి నిరాశ చెందింది.

"పోనీలే. నీ పరంగా నేనే ఆలోచిస్తాను. ఎప్పుడయినా నీకేమన్నా కావాలనిపిస్తే నాకు కబురు పంపు. ఎంతయినా నేను అక్కను. నువ్వు చెల్లివి. అవునా!" అని ఎంతో అభిమానంగా మాట్లాడింది.

సత్యవతి పగలూ రాత్రీ ఆలోచించింది. తనకేం కోరిక లున్నాయబ్బా? తిండికీ బట్టకూ తనకేమీ లోటులేదు. సఖులు ఉన్నంతవరకూ వినోద కాలక్షేపం అవుతుంది. మరి కేం కావాలి? ఉన్నట్టుండి వన విహారం గుర్తొచ్చింది. రాజభవనం దాటి బయటకు వెళ్ళి రెండు సంవత్సరాలు గడిచి ఉండాలి. ఆ విహారపు జ్ఞాపకాలింకా పచ్చగా ఉన్నాయి. అదే బాగుంది అనుకుంది సత్యవతి.

మాధవి గర్భవతయిన విషయం తెలిసి దివోదాసుడు చాలా ఆనందం కలిగింది. ఆ సమయం చూసి సత్యవతి అడిగింది.

"మహారాజా, మాధవికి వనవిహారానికి వెళ్ళాలని కోరికగా ఉందిట."

"ఆమాట మాతో చెప్పలేదే!"

"ఎలా చెబుతుంది? సిగ్గు కదా? అందులో కొత్త చోటు, కొత్త మనుష్యులు..."

"ఏదాగయినా అక్కా చెల్లెళ్ళు ఒకటయ్యారు." అంటూ చిన్నగా నవ్వాడు రాజు.

"మాట దాటించకండి. వనవిహారానికి రోజు నిశ్చయించండి."

రాజు కిప్పుడు చిక్కువచ్చి పడింది. ఒక్కరాణితో ఉండటమే కష్టమయితే మొత్తం రాణివాసం అంతా బయలుదేరితే, వారందరితో తానొక్కడూ ఎలా కాలం గడపటమబ్బా? దానికి బదులు తాను వేటకు వెడితే?

"ఇలా చేద్దాం. జ్యోతిషికులనడిగి మనం వెళ్ళేరోజు నిశ్చయం చేస్తాను. మీరందరూ వనవిహారం చేయండి. నేను సైనికులతో వేటకు వెడతాను."

"మీ ఇష్టం" అంది సత్యవతి.

# 15

వైశాఖ శుద్ధ సప్తమినాడు రాజపరివారం రాజభవనం నుండి బయలు దేరింది. ముందువరుసలో ఖడ్గము, శస్త్ర్యాయుధము, గద, ముసలము, ప్రాసము, తోమరము మొదలైన ఆయుధాలను ధరించిన యోధు లున్నారు. వారి వెనకాల రాజూ, సేనాధిపతి వసు పల్లి రంగు గుర్రాల మీద బయలు దేరారు. వారి గుర్రాలకు బంగారు కళ్ళెములున్నాయి. రత్నాల జీను, బంగారు పూలున్న బాసింగాలతో ఆ అశ్వాలు మెరిసిపోతున్నాయి. ఆ గుర్రాల వెనకాల రాణివాసం పల్లకీలు, వారి వెనకాతల కాపలా భటులు, విహారానికి కావల్సిన సామగ్రిని మోస్తున్న సేవకులు.

పుణ్యస్త్రీలు మహారాజుపై పుష్పవృష్టి కురిపించి ప్రయాణంలో శుభం కలగాలని దీవించారు. బ్రాహ్మణులు మంగళా శాసనం చేశారు. ఆ తరువాత పరివార మంతా ఉత్తర దిక్కుగా, అరణ్యం వేపు కదిలింది.

కొంచెం సేపట్లోనే వారు నగరు దాటారు. అరణ్యం మొదలయింది. చిన్న చిన్న చెట్లు. ఆ తరువాత విశాలమయిన వృక్షాలు కనిపించసాగాయి. అపరిచితులు వచ్చారని అరిచే పక్షులూ. కంగారుపడి చెట్టునుండ చెట్టుకు ఎగిరే కోతులు. కొన్ని చోట్ల కాలిబాట వుంటే, మరెన్నో చోట్ల వంగి, త్రోవ చేసుకుని వెళ్ళాలి. యోధులు సింహనాదం చేశారు. శంఖ దుందుభుల శబ్దం మిన్ను ముట్టింది. గుర్రాల సకిలింపు- పందలాది భటుల అడుగుల చప్పుడూ అడవిలోని నిశ్శబ్దాన్ని భంగ పరిచాయి.

"అడవి అంటేనే భయం నాకు." పల్లకీలో మాధవితో కూర్చున్న మేఖల అంది.

—ఇలాంటి అడవుల్లోనే తాను నడిచింది. నిద్ర పోయింది. తన కెలాంటి భయమూ లేదు అనుకుంది మాధవి. తనకు అడవి అంటే భయం లేదు. భయమల్లా మనుష్యులను చూసే.—

వాళ్ళు బిల్వము, అర్కము, ఖదిరము, కపిత్థము మొదలైన వృక్షాలను దాటి లోపలకు సాగారు. తెర తొలగించి అడవి అందాన్ని తిలకిస్తున్న సత్యవతికి అపరిమితమయిన ఆనందం, ఉత్సాహం. మిట్ట పల్లాల్ని దాటిన వారికి ఓ విశాల మయిన బయలు కనిపించింది. అక్కడ విశాలమయిన చెట్లకింద చల్లటి నీడ వుంది. పక్కనే చిన్నవాగు పారుతోంది కనుక నీటికి లోటులేదు.

విహారానికి అదే సరయిన చోటని రాజు గుర్రం దిగాడు. పల్లకీలలోనివారూ ఉత్సాహంతో బయటకు వచ్చారు. సేవకులు పచ్చిక మీద తివాచీలు పరవ సాగారు. దాసీ జనం ఆహార పానీయాల్ని దింపి సర్దసాగారు.

సత్యవతితో రాజు "మీరిక్కడ విశ్రమించండి. మేము వేట ముగించి వస్తాము" అన్నాడు.

సత్యవతి దాసిని పిల్చి పానపాత్ర నుండి రాజుకు ద్రాక్షారసం ఇచ్చింది. అది సేవించి మహారాజు సేనాపతితో గుర్రాల మీద అడవిలోకి దౌడు తీశాడు. అడవి మృగాల్లా కేకలు వేసుకుంటూ యోధులు వారి వెంబడే వెళ్ళారు.

తివాచీ మీద విశ్రమించిన మహారాణి ద్రాక్షారసం తాగుతూ "రాచ నగ రెందుకు మనకు. ఇక్కడే ఉందాం అనిపిస్తోంది" అంది.

"నిజం, నిజం" అని వంతపలికారు రాజు మిగతా భార్యలు.

తాగటానికి ద్రాక్షారసం కాని, భక్ష్య భోజ్యాలు కాని లేకుండా, కప్పుకోవ టానికి ఖరీదైన ఉన్ని కంబళ్ళూ, హంస తూలికా తల్పాలు లేకుండా వీరెన్ని ఘడి యలు ఈ చోట్లో ఉంటారబ్బా!- అని ఆలోచించింది మాధవి.

ద్రాక్షారసం తాగిన రాణులకు మత్తెక్కింది. మాధవికి ఎక్కువగా తాగక పోయినా విచిత్రమయిన ఆలోచన లన్నీ రాసాగాయి. దాసీలు గంతు లేశారు. నాట్యం చేశారు. పాటలు పాడారు. ఒకరి జడ మరొకరు లాగారు. వేళాకోళా లాడు కున్నారు. పెద్దగా నవ్వుకున్నారు. రాజులాగా తలపాగా చుట్టుకుని ఓ దాసి వచ్చి సత్యవతి కొంగు పట్టుకుని లాగింది. అందరూ విరగబడి నవ్వారు.

సత్యవతి కోపంతో-

"ఈ హాస్యాలు చాలు. సూర్యుడు నడినెత్తి కొచ్చాడు. భోజనాలు ఏర్పాట్లు కానివ్వండి" అని ఆజ్ఞాపించింది.

అరిటాకులలో భక్ష్య భోజ్యాలు వడ్డించారు. రాజభవనంలో కన్నా ఇక్కడ భోజనం రుచిగా అనిపించింది. తామందరూ తినగా మిగిలిందాన్ని దాసీలు సేవకులకు పంచారు.

భోజనాలయ్యేక నిద్రపోయిన వాళ్ళు కొంతమందయితే మరికొందరు ఆ చుట్టుపక్కలే తిరిగి రావటానికి వెళ్ళారు.

మేఖల, మాధవి చిన్నవాగు దాటి అవలకువెళ్లారు. అక్కడ కర్ణికారపుష్పాలు విరివిగా పూసి ఉన్నాయి. మేఖల కొన్ని పూలు కోసి మాధవి ముడిలో పెట్టింది. తానూ కొన్ని ముడుచుకుంది.

"ఎవరికంటా పడకుండా మనమిద్దరమే ఎక్కడికయినా పారిపోతేనో !?"

ఉన్నట్టుండి మాధవి అడిగిన ప్రశ్నకు కంగారుపడింది మేఖల.

"వద్దు రాణీ" అన్నది వణుకుతూ.

ఎందు కిలాంటి ఆలోచన వచ్చింది తనకు– అని తనలో తాను తర్కించుకుంది మాధవి. రాజు బంధం నుండి తప్పించుకుని స్వతంత్రంగా ఉండి పోవాలని అనిపించింది. కాని నడిచి ఎంతదూరం వెళ్ళటానికి వీలవుతుంది? అందులోనూ అబలలైన తాము? రాజు గుర్రాలమీద వచ్చి తమని వెనక్కి లాక్కుపోతాడు. పోనీ తానొక్కతే ఎవరయినా ఓ యువకుడితో జీవితం గడిపితేనేం? అదీ సాధ్యం కాదు. తాను ఇప్పుడు గర్భిణీ కూడా. తన్ను ఎవరు దగ్గరకు రానిస్తారు? పోనీ గంగానదిలో పడి ఆత్మహత్య చేసుకుంటేనో? అదింకా మహాపాపం. రెండు జీవుల హత్యకు కారణభూతురాలయిన తనకు గంగా స్పర్శతో పుణ్యసంచయం కాకపోగా రౌరవనరకం లభిస్తుంది.

చావటానికి భయం, బ్రతకటానికి జుగుప్స — వీటిమధ్య నలిగిపోయింది మాధవి.

"రండి రాణీ, వెడదాం" అంటూ మేఖల ఆమెను లాగి మళ్ళీ వాగు దాటించింది.

రాజూ, అతని పరివారం దట్టమయిన అరణ్యంలోకి దూసుకు పోతూండగానే దూరం నుండి పులి గర్జన వినిపించింది. యోధుల శంఖ దుందుభి నాదంతో అడవి మృగాలు చెల్లాచెదరయ్యాయి.

"అదిగో లేడి, కొట్టు, కొట్టు..."

"అడవి పందిని వదలకండి...కొట్టండి."

పరిగెడుతున్న జంతువులు యోధుల బాణాలకు గురై చనిపోయాయి. అడవి ఏనుగులను గదలతో కొట్టారు. జింకలను శస్త్రాయుధంతో సంహరించారు.

"జింకల చర్మాలను వదలకండి. ఏనుగు దంతం మనకు చాలా అమూల్య మయింది. రాజధానికి వీటన్నిటినీ తీసుకుపోవాలి."

—అని సేనాపతి ఆజ్ఞల నిచ్చాడు.

రాజు, అతని సేనాపతులు యోధులతో పులి గర్జన వినవస్తున్న వైపుకు సాగారు. మార్గాయాసంతో చెమటలు కారుతున్నా సాహసం కోసం మనస్సు తహ తహ లాడుతోంది. గుర్రాలు అలసిపోయాయి. అడవి దట్టంగా ఉండటంతో పగలే చీకటేమోనన్న భ్రమ కలుగుతోంది.

చివరికి వాళ్ళు పులి ఉన్నచోటికి చేరారు.

"మీరా పులిని బెదిరించి ఇటు వేపుకు పంపండి" అని సేనాపతి కొంతమంది యోధుల్ని పంపాడు. మిగిలిన వారు ఆ చోటుకు చుట్టూ చక్రాకారంగా నిలబడి పులి రాకకోసం ఎదురుచూస్తూ నిల్చున్నారు. కేకలకూ, చప్పుళ్ళకూ, బెదిరిన పులి ఎగురుతూ వచ్చింది. దాని గర్జన, మసక చీకట్లో మెరుస్తున్న కళ్ళు పులి రాకను వాళ్ళకు తెలియజేశాయి.

ఒకేసారి రాజూ, సేనాపతి పులిమీదకు బాణాలను గురిచేసి వదిలారు. మిగిలిన యోధుల బాణాలు కూడా పులికి తగిలాయి. ఓ యోధుడు వెనుకనుండి వచ్చి కత్తితో పొడిచాడు. పులి చచ్చిపడింది.

"మహారాజుగారు పులిని చంపారహో!" అని కేకలు పెట్టారు. రాజు తానొక్కడే పులిని చంపినట్టుగా గర్వంతో మీసాలు దువ్వాడు.

"పులిని రాజధానికి తీసుకుని వెళ్ళండి" అన్నాడు రాజు.

"అలాగే మహారాజా" అన్నాడు సేనాపతి. యోధులతో– "వెదుళ్ళతో ఓ పాడి కట్టి పులిని ఊరేగిస్తూ తీసుకు పోదాం" అన్నాడు.

అలసి పోయుండటంతో రాజు, సేనాపతి ఓ చెట్టు నీడలో విశ్రాంతి తీసు

కున్నారు. గుర్రాలకు తగిలించిన పాత్రనుండి మద్యాన్ని సేవించారు. భక్ష్యాల్ని భుజించారు.

వారికి కొంచెం దూరంలో యోధులు నిప్పుచేసి వారు చంపిన జంతువుల మాంసం కాల్చి తిన్నారు. దగ్గర్లోని వాగులో నీళ్ళు తాగారు.

సాయంకాలానికి మహారాజు వులితో తిరిగి వచ్చేసరికి రాణీవాసంవారికి బ్రహ్మానందం కలిగింది. రాజు పరాక్రమం చూసి వారికి గర్వం.

"శౌర్యంలో మహారాజుకి సమానులు ఎవ్వరూ లేరు"– మేఖల మాధవి చెవిలో చిన్నగా అన్నది.

మళ్ళీ రాజధానికి తిరుగు ప్రయాణం. పొద్దుటున్న ఉత్సాహం లేదు. కాని తృప్తి వుంది. ఆనందం వుంది.

ప్రయాణంతో అలసిపోయిన మాధవి భోజనం చేయగానే నిద్రపోవాలని నిశ్చయించుకుంది. నిద్రకు ముందు, ఉక్క పోస్తున్నదని పల్చటి చీరొకటి చుట్టుకుని హంస తూలికా తల్పంపై పడుకుంది.

అంతలో తలుపు చప్పుడయింది. మేఖల ఈ వేళప్పుడు ఎందు కొచ్చిందబ్బా అనుకుంటూ మాధవి మోచేతిపైన ఆన్చి తల పైకెత్తి చూసింది.

లోపల కొచ్చింది మేఖల కాదు, మహారాజు దివోదాసు.

గర్భవతి కావటంతో మాధవి స్తనాలు ఇంకంత పెద్దవయ్యాయి. ఆమె మోచేతి మీద ఆని సగం లేచి కూర్చున్న భంగిమలో, పల్చటి చీరలోంచి చను మొనలు ఇంకంత ఉద్రేక పర్చేలా ఉన్నాయి. దివోదాసు ఆమె పక్కను చేరి గట్టిగా కౌగిలించుకున్నాడు.

"మహారాజా, ఇవాళ వద్దు. నాకు చాలా అలసటగా ఉంది" అని బ్రతిమాలుకుంది మాధవి.

ఆమెను తన బాహువుల్లో మరింత గట్టిగా బిగిస్తూ దివోదాసు అన్నాడు.

"ఎంత బాగున్నావు బంగారూ నువ్వు! అలసటగా ఉన్నప్పుడే ఇదంతా బాగుంటుంది. నీకు తెలీదు, అంతే."

మాధవి గుటకలు మింగింది.

"పది సంవత్సరాల నుండి ఈ వార్త కోసం ఎదురు చూశాను మా ధ వీ. నువ్విప్పు డిచ్చావు దాన్ని. నీకేమన్నా పెద్ద బహుమతి ఇవ్వాలని పిస్తోంది. ఏం కావాలో అడుగు "

"నా కేమీ వద్దు. నన్ను వదలండి."

"రాణీవాసంలో మిగిలినవాళ్లు రాజు తమ వద్దకు రావాలని ఆశగా ఎదురు చూస్తుంటారు. నువ్వు చాలా చిత్రమైన దానివి."

రాజు కౌగిలిలో మాధవి నలిగిపోయింది. ఓ మారు మాత్రం కడుపులో అంతా నొప్పి అయినట్టయి "అయ్యో" అని మూలిగింది. కామోద్రేకంలో ఉన్న మహారాజు చెవికి ఆమె మూలుగు వినిపించలేదు.

రాజు సంతృప్తుడై ఆయాసంతో వెనక్కి వాలాడు. ఎన్నో ఆలోచనలు అతనిముందు దండలాగ తాండవించాయి. అతడు మాధవి దగ్గరకు జారి చిన్నగా అన్నాడు:

"మాధవీ నాకో ఆశవుంది. మనకు పుట్టే కొడుకు నా వైరి వీతహవ్యుణ్ని చంపాలని."

మాధవి విషాదంతో నవ్వింది.

"అదింకా ఎప్పటికి? మీ కొడుకు యుద్ధం చేయాలంటే ఇంకా పదహారు సంవత్సరాలయినా గడవ్వద్దూ? అప్పుడు మీరెక్కడో, నేనెక్కడో ! ? !"

# 16

పొలాలూ, తోటలూ పచ్చగా కళకళ లాడుతున్నాయి. ఎండలెక్కు వయిన కొద్దీ పచ్చటి మొలకలు పెద్దవయినాయి. ఇక పర్జన్యునికోసం ప్రార్థనలు. కాశీనగరంలో అక్కడక్కడా వానదేవుడి గూర్చి పూజలయినవి. ఓ పక్షం ఆలస్య మయినా ఆషాఢంలో వాన పెద్దగానే కురిసింది. శ్రావణంలో దాని హోరుకు తుదీ మొదలూ లేకపోయింది. గంగానదిజలం ఘట్టాల పైకి పారింది. సుస్మితలై చిన్నగా పారుతున్న గంగ ఇప్పుడు ఎర్రనీటి మహాకాళి. నది ఒడ్డుదాటి ఎక్కడ ఊళ్ళోకి వస్తుందోనని అందరికీ భయం.

"ప్రళయం వచ్చేప్పుడు మాత్రం అలా అవుతుందిట."

"ప్రపంచంలో పుణ్యం మాయిమయితే జలప్రళయం తప్పక వస్తుంది."

"అలాంటిది ఈ సంవత్సరం జరగదు. మహారాజు అశ్వమేధయాగం చేశాడు. పర్జన్యుడికి కావలసినంత హవిస్సు అర్పితమయింది."

రకరకాల మాటలు వినిపిస్తున్నాయి ఊళ్ళో. ఓ ప్రక్క భయం. మరోపక్క తమకు తామే ధైర్యం చెప్పుకునే మాటలు. నగరానికేం అపాయం కలగ కూడదని రాజభవనంలో ప్రత్యేకమయిన పూజలు జరిగాయి.

వర్షాలు నిలిచాయి. పంట నిలిచి చేతికొచ్చింది. కొత్త ధాన్యం ఇంటికొచ్చే సరికి మళ్ళీ సంబరం.

కార్తీక బహుళపంచమి నాడు మాధవి మగబిడ్డను కన్నది.

వంశోద్ధారకుడు పుట్టాడని మహారాణి రాజభవనంలో అందరికీ మిఠాయి పంచింది.

దివోదాసుని ఆనందానికి అంతులేదు. తాను చేసిన పుత్రకామేష్టి సార్థక మయిందని పొంగిపోయాడతను. ఊరంతా ఈ వార్త చాటింపు వేశాడు.

రాజకుమారుడు దీర్ఘాయుష్మంతుడు కావాలని సుమంగళులూ బ్రాహ్మణులూ దీవించారు.

కాశీనగరపు దేవస్థానాల్లో ప్రత్యేకమైన పూజలు చేశారు. బ్రాహ్మణులకు విందు భోజనమూ, విరివిగా దక్షిణలూ ముట్టాయి.

"రాజభవనానికి నామకరణ మహోత్సవానికి వెళ్ళారు కదా, పిల్లవాడికి పేరేం పెట్టారు?"

"ప్రతర్దనుడని!"

"ఎంత అందమయిన పేరు!"

ఊళ్ళో ప్రజలకు పిల్లలు పుట్టవచ్చు. దానిలో విశేష మేమీ లేదు. కాని రాజుకి లేకలేక కొడుకు పుట్టేసరికి కాశీరాజ్యంలో ప్రజలకు మరో మాట ధ్యాసే లేకుండా పోయింది.

రాజపురోహితులు దాన దక్షిణలను మూట కట్టుకుంటూ దివోదాసుతోఅన్నారు:

"మీ పుత్రుడు తేజోవంతు డవుతాడు. తండ్రికి కీర్తి తెస్తాడు. మీ శత్రువుల మద మణుస్తాడు."

వీతహవ్యుని చంపే కొడుకు ఆఖరికి పుట్టాడు, తన కల నిజమయింది కదా అని సంబరం దివోదాసుకు.

మహారాణి సత్యవతి బాలింతరాలి పక్కగది ఆక్రమించుకుంది. బిడ్డ ఆలనా పాలనా అంతా తానే చూసుకో నారంభించింది.

మాధవి పక్కమీద పడుకుని ఉంది. బిడ్డ పోషణ భారం లేకపోయినందువల్ల హాయిగా ఉండాలి ఆమె. కాని ఆమె మనస్సంతా ఏదోలా ఉంది.

"బిడ్డను తీసుకుని రండి. పాలు ఇస్తాను."

మహారాణి సత్యవతి దాసీతో కబురంపింది.

"ప్రతర్దనుడికి వేరే పాలు తాగించాము. నీ పాలు అలవాటయితే తరువాత విడిపించటం కష్టమవుతుంది."

మాధవికి ఆ మాట వింటే ఒళ్ళంతా రక్కుకున్న ట్లనిపించింది. పాలతో తడిసిన స్తన పట్టికనూ, చీరనూ చూసి ఆమెకు ఏడుపు వచ్చింది.

"ఈ పాలను ఏం చేసుకోను! పాలు ఇగిరి పోవటానికయినా మందిమ్మని రాజ వైద్యులతో చెప్పు" అని రోదించింది.

రాజవైద్యు లిచ్చిన లేహ్యం, కషాయాలు ఆమె ఒంటికి బలాన్నిచ్చాయి. లేచి కూర్చునే బలం వచ్చింది. కాని చెయ్యటానికే పనీ లేదు.

బిడ్డ ఉదయం పూట ఏడ్చినప్పుడు ఆ బాబుకి స్నానం చేసి తీసుకొస్తున్నారని తెలుసు. ఓ రోజు ఇక ఆపుకోలేక మేఖలతో చెప్పింది.

"వెళ్ళు. బాబుని తీసుకుని రా. ఇవాళ నేను బట్టలు వేస్తాను వాడికి."

కొంచెం సేపయ్యాక సత్యవతి లోపలకు వచ్చింది.

"మాధవీ, నీ ఆరోగ్యం అంత బాగా లేదంటున్నారు రాజ వైద్యులవారు. మేమంతా ఉన్నాం కదా బిడ్డను చూసుకోవటానికి. నువ్వు పనీ అదీ చెయ్యకు. విశ్రాంతి తీసుకో."

బిడ్డను తన కివ్వటం ఈవిడ కిష్టంలేదు. అందుకనే ఇలా తెలివిగా మాట్లాడుతోంది. ఈ విశ్రాంతిలో నాకు చెదలు పడుతుందని ఈమెకు అర్థంకాదు— అని మాధవి మనస్సు గోలపెట్టింది.

"నాకు తెలుసు ఎందుకు వద్దంటున్నారో. బిడ్డకు ఇంకెన్ని రోజులు బట్టలు వేస్తాను చెప్పండి ?"

అంతమటుకు అని మాధవి బావురుమన్నది. సత్యవతికి మరే మనిపించిందో బిడ్డను తెచ్చి మాధవి వడిలో వేసింది. మాధవి వాడిని హత్తుకుని ముద్దుపెట్టుకుంది. రకరకాల మాటలతో ముద్దాడింది. అది చూసిన సత్యవతికి తానెంత ప్రేమ చూపినా బిడ్డకు నిజమయిన తల్లి ప్రేమకన్నా మించినది మరేమీ లేదనిపించింది.

ఓ రోజు మేఖల అడిగింది.

"రాణీ, వెళ్ళే మాట వదిలేసి మీరిక్కడే ఎందుకుండి పోకూడదు ?"

"మహారాజుగారు అడిన మాటతప్పరు మేఖలా. నాకెక్కడా చోటు లేదు. నేను వెళ్ళి తీరాలి. రాజుగారికి కావాల్సిన కొడుకు పుట్టాడు. ఇక నానుండి అతనికేం ప్రయోజనం చెప్పు? చెరుకురసం పీల్చాక పిప్పి ఎవరికి కావాలి ?"

వారాలు గడిచిన కొద్దీ మాధవి గాలవుడు ఎప్పుడెప్పుడు వస్తాడా అని ఎదురు చూడసాగింది. ఎదరుగా వుండి కూడా బిడ్డతో పరాయిదానిలా ఉండటం కన్నా దూరంగా వెళ్ళిపోవటం మంచిదని ఆలోచించసాగింది.

బిడ్డను చూడటానికి వచ్చిన దివోదాసు మాధవితో అన్నాడు.

"గాలవుల వారికి కబురు పంపాను. ఫాల్గుణంలో రావచ్చును ఆయన. నువ్వు చేసిన ఉపకారానికి నీకేం ప్రత్యుపకారం చెయ్యను మాధవీ?"

"ఇది తీర్చే ఋణం కాదు మహారాజా" అని చెప్పబోయిన మాధవి వేరే మాట అంది.

"నాకేమీ వద్దు మహారాజా. బిడ్డను బాగా చూసుకోండి. అంతే చాలు నాకు."

• • • •

గాలవుడు రాజధానికి విచ్చేశాడు. మహారాజు ఆతన్ని అర్ఘ్యపాద్యాదులతోను మధుపర్కంతోనూ సత్కరించాడు. బిడ్డను చూడటానికి అంతఃపురానికి తీసుకుని వెళ్లాడు. తేజస్వియైన ప్రతర్దనుని ఆశీర్వదించాడు గాలవుడు.

పీలగా వున్న గాలవుడ్ని చూసి మాధవిలో కోపం బుసకొట్టింది. ఇంత బక్కగా వున్నా వీడి కేమీ రోగం రాదేం అనుకుంది. ఆరోగ్యంగా కనిపిస్తున్న మాధవిని చూసి "ఎంత ఆశ్చర్యం! ఇద్దరు పిల్లల్ని కన్నా ఇంకా కన్యలాగా కనిపిస్తోందే ఈమె" అనుకున్నాడు.

"బాగున్నావా మాధవీ?"

మాధవి కటువుగా—

"మీ ఆశీర్వాదం వల్ల ఇంకా బ్రతికే వున్నాను" అంది.

"నీ ఆరోగ్యం బాగానే వుంది కదా?"

"నేను బయలుదేరటానికి సిద్ధంగా వున్నాను."

ఆ మాటలు వాడిగా గుచ్చుకున్నాయి గాలవుడికి. మహారాజు అడిగాడు.

"మీరెక్కడికి వెళ్లాలంటే అక్కడికి పల్లకీ కాని రథం కాని పంపుతాను. మాధవిని నడిపించవద్దు."

"ఏమీ అక్కర్లేదు. ఈ శరీరంలో ఇంకా బలం వుంది."

—మాధవి కోపంగా అంది.

"ఆమె అన్నది నిజమే. మేమింకా నీకు ఋణపడి ఉండటం మంచిది కాదు మహారాజా. నాకు నువ్వివ్వాల్సిన గుర్రాలు మాత్రం నీ వద్దే వుండనీ. నాకు కావా లన్నప్పుడు కబురుచేస్తాను. అక్కడికే పంపుదువు గాని."

అంతలో మహారాణి సత్యవతి వచ్చి ముని పాదాలకు నమస్కరించింది.

"దీర్ఘ సుమంగళీ భవ! అష్టపుత్ర బహు ధనమస్తు" అని దీవించాడు గాలవుడు.

వచ్చిన పనయిందని లేచాడు గాలవుడు. రాజూ అతని వెనకే బయలు దేరాడు. చావిడి గడప దాటే ముందు గాలవుడు మాధవికి వినిపించేలాగా-

"దివోదాసూ, మేము ఎల్లుండి బయలుదేరుతాం. మాకు అనుజ్ఞ ఇప్పించు" —అన్నాడు.

"మీరు మా కాశీరాజ్యంలో అడుగుపెట్టటం వల్ల మా రాజ్యం పావన మయింది" అన్నాడు దివోదాసు. మరేమనాలో తోచక గాలవు డన్నాడు :

"ఆ మాట అనాల్సింది నేను. పవిత్ర గంగలో స్నానం చేసిన నాకు పుణ్య లాభం కలిగింది."

"గంగా స్నానం చేస్తే పాపాలన్నీ పోతాయని అంటారు. అదెలా ముని వర్యా ?"

(రోజూ ఈ నదిలో స్నానం చేసే వాళ్ళంతా పుణ్యవంతులా? పాపు లెవరూ లేరా? అనుకుంది మాధవి.)

"మనుష్యుని దేహంలో అన్నమయాది పంచ కోశా లున్నాయి మహారాజా. వాటిలో ఒక్కొక్క దానిలోనూ పాపం చేరుకుంటుంది. గంగా స్నానం వల్ల ఈ అయిదు కోశాల్లోని పాపం నాశనమవుతుంది. పంచకోశాలు పరిపూర్ణం కావటానికి ఇది సహాయమవుతుంది."

"అలా అయితే ఈ నదిలో స్నానం చేసే వాళ్ళందరికీ సమానమయిన పుణ్యం లభ్య మవుతుందంటారా?'

"విద్యావంతుడు చేసే కార్యం విద్యావిహీనుడు చేసే దానికన్నా శ్రేష్ఠం. అందువల్ల పూర్ణ తాదాత్మ్యంతో, జ్ఞానంతో స్నానం చేసేవారికి పుణ్యం లభిస్తుంది. అందరికీ కాదు."

రాణీ, దాసీలు, ముని మాటలను ఆశ్చర్యంగా వింటూ నిల్చున్నారు. రాజు అర్థమయిందని తల వూపాడు.

–నన్ను అయ్యో అనిపిస్తున్న ఈ గాలవుడు పరమపాపి కాదూ? నేను మాత్రం? ఏ కన్నతల్లీ ఇలా తన పిల్లల్ని వదిలి వెళ్ళదే. నా పాపానికి ప్రాయశ్చిత్త మేమిటి? బహుశా మే మిద్దరమూ గంగా స్నానం చేస్తే పుణ్యం లభిస్తుందేమో– అని మనస్సులోనే కుమిలిపోయింది మాధవి.

బయలుదేరే రోజు మళ్ళీ బాధంతా పునరావృత్తం అయింది. దాసీలు గొల్లుమని ఏడ్చారు. సత్యవతి బిడ్డనెత్తుకుని నిల్చున్నది. మాధవి బిడ్డవంక చూడను కూడా చూడకుండా పెదవి బిగించి, గాలవుడి వెనకాల నడిచింది.

పడవమీద నదిదాటి దక్షిణం వేపుకి వచ్చాక మాధవి మాట్లాడింది.

"నేను గంగానదిలో స్నానం చేసి వస్తాను."

ఉదయం నీట్లో మునిగి సంధ్యావందనం మొదలైన ఆహ్నికాల్ని ముగించిన గాలవుడు దూరంగా వున్న బండమీద కూర్చుని కన్ను మూసి ధ్యానమగ్నుడయ్యాడు. మాధవి నీట్లో దిగింది. ఓ మునక వేసింది. సుఖానికి అలవాటు పడ్డ దేహం చల్లటి నీరు తగిలేసరికి వణికింది. కాని మరో రెండు మార్లు మునిగేసరికి అదే బాగుం దనిపించింది. తడిసిన నారచీర విప్పి ఇంకొకటి కట్టింది. తడి చీరను ఇసుక తిన్నెమీద ఎండ వేసింది. ఇసుక తిన్నెమీద కూర్చుని అవతలి గట్టు మీదున్న కాశీనగరాన్ని విచారంగా చూసింది.

గంగ ఒడ్డున పశ్చిమ దిక్కుకు నడిచారు వాళ్ళు. నది అలలు మనోహరంగా ఉన్నాయి. తెల్లటి నురగతో పారుతున్న గంగ మహాశ్వేత. ఓ చోట స్తిమిత గంభీర గమనయైతే మరో చోట శీఘ్రగతిలో పారుతోంది. ఓ మారు గంభీరధ్వని. రాళ్ళు అడ్డం వచ్చినప్పుడు భయంకర ఘోష. అక్కడక్కడా స్నాన ఘట్టాలలో జనులు. ఇసుక తిన్నెలలో హంసలు, నీటికాకులు.

గాలవుడు నది గట్టు వదలి అరణ్యం ప్రవేశించాడు. అడవి చిక్కబడ నారంభించింది. మామిడి, పొగడ, పాటలం, అశోక వృక్షాలు దట్టంగా పెరిగాయి. ముళ్ళపొదలు, ఎమురుగా ఎగిరే మిడతలు. పెద్ద అడవి ఈగలు వారిని చుట్టుముట్టాయి.

మౌనంగా నడుస్తున్న మాధవిని గాలవుడు పలకరించాడు.

"నీకు నామీద కోపం వచ్చి వుండవచ్చు. కాని నేనేం చెయ్యను? నేను నిస్సహాయుడిని."

మాధవి మాట మాట్లాడలేదు. అతడే మాట్లాడాడు.

"గురుదక్షిణ ఇవ్వటం ఒకటే నా జీవిత ధ్యేయం. అది తీరేవరకూ..."

"మీ ధ్యేయంకోసం కష్టపడుతున్నది మీరు కాదు... నేను. ఆ ఆలోచ నేమైనా ఉందా మీకు?"

"నా లక్ష్యంముందు నాది కానీ, మరొకరిది కానీ కష్టాలను నేను లెక్క చేయను."

హృదయంలేని ఈ మునితో మాట అనవసరం అనుకుని మాధవి మౌనం వహించింది. గాలవుడిపట్ల ద్వేషం పెరుగుతూనే వుంది. ఆకలయినప్పుడు యాంత్రికంగా కందమూలాలు, పళ్ళు తిన్నారు. నీళ్ళు తాగారు. మళ్ళీ ప్రయాణం. ఎన్నో రాత్రులూ, పగళ్ళూ ఒకదాని వెనక ఒకటి గడిచాయి. చివరకు ఓ ఆశ్రమం తగిలింది.

ఋషీ, ఋషిపత్నీ అతిథులకు ఆదరంగా స్వాగతం పలికారు. గురుకులం లోని శిష్యులకు కూడా కుతూహలం. గాలవుడూ, ఋషి వేదాంత చర్చ జరుపుతూండగా ఋషిపత్ని మాధవి చరిత్ర అంతా కనుక్కుని జాలిపడింది. "దైవ నిర్ణయం. ఏం చేస్తాం? కర్మఫలితం అనుభవించక తప్పదు" అని వేదాంతం మాట్లాడింది.

ప్రయాణ బడలిక తీరటానికి రెండు మూడురోజులు ఆ ఆశ్రమంలోనే ఉండిపోయారు. ఆ విశ్రాంతి దైహికంగా చాలా సహాయపడింది.

ఒకరోజు ఋషి వటవృక్షం కింద తన శిష్యులకు బోధిస్తున్న దాన్ని వింటూ మాధవీ, ఋషిపత్నీ ఆశ్రమపు తలుపు వద్దనే కూర్చున్నారు.

"ధర్మం అంటే!" శిష్యు డొకడి ప్రశ్న.

"మనుష్యులను నీతి సంహితలో బంధించేది ధర్మం. ఆ యా వర్ణాలవారికి నిర్ణయింపబడిన వృత్తిధర్మాన్ని పాలించటమే ముఖ్యం. అందువల్ల రకరకాల వర్ణాలవారికి వేర్వేరు ధర్మనిబంధన లుంటాయి, ప్రజకు రాజాజ్ఞ పాలించటమే

ధర్మం. రాజుకు ప్రజాపాలన ధర్మం. భోగవిచారం, యోగవిచారం రెండూ అతనికి తెలిసి ఉండాలి. మాటా, మౌనం రాజులో ఉండాలి. రాజు గురువుకు సేవకుడు, ధార్మికులకు బంధువు, యుద్ధంలో శత్రు భయంకరుడు, ప్రజలకు, పరివారానికి హితుడై ఉండాలి. ఇవన్నీ అతను పాలించాల్సిన ధర్మాలు..."

"అందరు రాజులూ ఈ ధర్మసంహితను పాలిస్తారా గురువుగారూ?"

"పాలించాలి. పాలించకపోయినా క్షమార్హుడు. ఎందుకంటే అతను ప్రజాపతి. అతనికి బాధ్యతలు హెచ్చు."

"మునులకున్న ధర్మ సంహిత?"

"ఋషులు ప్రత్యక్షంగా కకపోయినా పరోక్షంగానైనా లోక కల్యాణానికి పాటుపడతారు. వారు తప్పు చేసినా రాజులలాగానే క్షమార్హులే."

"రాజులకు ప్రజలకు ఈ భేదం ఎందుకు? ఈ సంహితలు కాలంతో మారవద్దా?"

ఇక ముందు వాక్యాలు మాధవి చెవిన పడలేదు.

ఆమె మనస్సులో ప్రశ్న లేచింది.

స్త్రీ ధర్మం ఏమిటి?

మౌనంగా దేని గురించి ప్రశ్నించకుండా నడపటమేనా? పిల్లల్ని కనిపించటమేనా ఆడదాని ధర్మం? ఏ అన్యాయాలయినా ప్రతిఘటించకుండా ఉండాలా ?

ఈ ప్రశ్నలకు జవాబు లేదు.

ఆమెకు అనిపించింది. తనకెంత అన్యాయం జరిగినా ఋషులు కాని, ఋషి పత్నులుకాని, ఎవ్వరయినా కాని తన పరంగా మాట్లాడలేదు. బహుశా మాట్లాడకుండా ఉండటమే వారి ధర్మమేమో!

మాధవి నిట్టూర్చింది.

ప్రయాణం ముందుకు సాగింది.

అయిదు యోజనాల దూరం నడిచాక ఓ చిన్న ఊరు తగిలింది.

"ఇది కోసల దేశం" అన్నారు దార్లో పోయేవాళ్ళు.

ఆ ఊరి రాజు గాలవుడ్ని, మాధవినీ సగౌరవంగా ఎదురుకొని–

"మాది చిన్నదేశం. నా వద్ద ఏభై గుర్రాలున్నాయంతే. ఇక్కడ నుండి అయిదు యోజనాలు పశ్చిమ దిక్కుగా పోతే కొండ ప్రాంతం వస్తుంది. దానవతల భోజదేశాధిపతి ఉశీనరుడున్నాడు. అతడు బలాఢ్యుడు. అతని దగ్గరకు పోతే మీ ఇష్టార్థ సిద్ధి కలుగుతుంది. మేము ధనవంతులం కాదు. అయినా మీరు మా ఆతిథ్యం స్వీకరించి వెళ్ళండి" అని రాజు గాలవుని వేడుకున్నాడు.

# 17

సభామందిరంలో మౌనం ఆవరించింది. సింహాసనంమీద ఆసీనుడైన మహారాజు ఉశీనరుడు లేచి చేతులు వెనక్కి కట్టుకుని పచార్లు చేయనారంభించాడు. రాజు లేచాడని మంత్రీ సేనాపతీ కూడా లేచి నుంచున్నారు. ఏం మాట్లాడాలో తోచక ఉశీనరుణ్ణే చూడసాగారు.

పచ్చటి పట్టువస్త్రాన్నీ, కేయూరం, అంగదం చక్రవాలాల్ని ధరించిన రాజు పొడుగాటి వ్యక్తి. గుండ్రటి ముఖం, పెద్దకళ్ళు, విశాలములు, ఉన్నతాలు అయిన మూపులు, శంఖంలాంటి కంఠం, నిండయిన గండస్థలాలు, మోకాళ్ళ వరకూ ఉన్న చేతులు, నున్నటి దేహం, ధీరగంభీరమయిన నడక, దేహంలోని ప్రతి అణువులోనూ స్పష్టమయ్యే రాజఠీవి, పైగా యౌవన ప్రాయం.

ఇలాంటి రూపం ఉన్నందువల్లే చుట్టుపక్కల రాజులంతా నే ముందంటే నే ముందని వచ్చి తమ ఆడపిల్లల్ని మహారాజు గారికిచ్చి పెళ్ళి చేస్తారు- అని మంత్రి మనస్సులోనే అనుకున్నాడు.

రాజుకన్నా కొంచెం పొట్టయిన సేనాపతి మనస్సులో మరో ఆలోచన- మా మహారాజుగారు ప్రక్షేపం, విక్షేపం, పరిక్షేపం, అభిక్షేపం అనే నాలుగు రకాల గదాయుద్ధాలలో నిపుణులు. అస్త్రశస్త్ర విద్యా పారంగతులు, గజయాన, అశ్వ యానాలలో చతురులు. మహారాజు లాగానే తనూ యుద్ధవిద్యలో నిపుణుడు. అందుకే యుద్ధంలో ఎప్పుడూ జయమే లభిస్తుంది.

మహారాజు ఉన్నట్టుండి అన్నాడు.

"ఇది చాలా విచిత్రంగా వుంది. కన్యాశుల్కానికి గాను ధనకనకాలు అడుగుతారు. గోవుల్ని కోరతారు. వజ్రవైడూర్యాల్ని ఆపేక్షిస్తారు. కాని గుర్రాల్ని అడిగింది ఈ గాలవముని మాత్రమే! అదీ గురుదక్షిణకట!"

గాలవుడికి రెండువందల గుర్రాల్ని దానం చేయటాన్ని అంతకు ముందే చూసిన మంత్రి అసహనంగా అన్నాడు.

"ఆ మహర్షి విశ్వామిత్రుడు గుర్రాల్ని పెట్టుకుని ఏం చేస్తాడు? మనవద్ద ఉంటే యుద్ధంలో నైనా ఉపయోగపడేవి!"

సేనాపతికి కూడా ఆ దానం నచ్చలేదు కనుక అతడూ వ్యంగ్యంగా అన్నాడు.

"ఏం చేస్తాడు? ఆ అడవిలో మేతకు వదిలేస్తాడంతే!"

రాజుకి ఆ సంవాదం నచ్చలేదు.

"అలాగనకండి సేనాపతీ. ఋషుల వారికి కోపం రావచ్చు. విశ్వామిత్రుడు వట్టి మహర్షి కాదు. అతడు ఇంతకు ముందు రాజర్షి అన్నమాట మరవకండి. దానం చేయటం రాజధర్మం. అదెలా వినియోగపడుతుంది అని ఆలోచిస్తే ధర్మానికి అర్థం లేకుండా పోతుంది."

అంతలో ద్వారంవద్ద ప్రతీహారి తొంగిచూసి చెప్పాడు.

"మహర్షి గాలవులవార్ని అతిథిశాలలో దింపి వచ్చాను. వారు రేపు ఉదయమే బయలుదేరతారట."

"మంచిది. నీవింక వెళ్ళవచ్చు. బయట కావలా వుండు. మా అనుజ్ఞ లేనిదే ఎవర్నీ లోపలకు రానివ్వకు."

—అని సేనాపతి వేపు తిరిగి. "ఇవాళ్టి మన కార్యక్రమం అంతా అయిపోయినట్టేనా?" అనడిగాడు.

"అయింది. ఇప్పుడే తమరికో విషయం చెప్పాలి. మన గూఢచారుల్నుండి వార్త వచ్చింది. మాహేయురాజు భోజరాజ్యం మీద దండెత్తటానికి సన్నద్ధుడవుతున్నాడట."

"అంత పొగరెక్కిందా? రానివ్వండి. అతని సైన్యాన్ని నేలమట్టం చేసేద్దాం" అన్నాడు ఉశీనరుడు మీసం దువ్వుతూ.

అమాత్యుడు నెమ్మదిగా అన్నాడు.

"వార్త నిజమైనా కావచ్చు. అబద్ధమైనా కావచ్చు."

"ఏమయినా మనం సిద్ధంగా వుండటం మంచిది. కోట, బురుజులు, భద్రంగా ఉన్నాయి కదా? పదండి. ఓమారు అంతా చుట్టి వద్దాం."

శాంతి కాలం కదా అని ఆయుధాగారం నిద్రిస్తోంది. కోట కాపలా కున్న యోధుల సంఖ్య కూడా తక్కువే. అశ్వశాల, గజశాలల్లోని గుర్రాలు, ఏనుగులు తగిన వ్యాయామం లేకుండా వున్నాయి. వాడుకలో లేని శస్త్రాలు తుప్పు పడు తున్నాయి. శిక్షణలేని సైనికులు చైతన్యహీనులుగా వున్నారు. ఈ పరిస్థితిలో రాజు సైన్యం మొదలైన వాటిని చూడటం మంచిది కాదని సేనాపతి-

"మహారాజుగారు అనవసరంగా శ్రమ పడవద్దు. దాన్ని చూసుకోవటానికి నేనున్నాను కదా!" అన్నాడు.

కుశాగ్రబుద్ధి రాజుకు అతని ఆలోచన అర్థం కాకపోలేదు. అతనన్నాడు:

"ఇవాల్టి సభ ముగిసింది. మాకు మాత్రం చేసే పనేం వుంది? కోటనీ బురుజుల్నీ చూసి ఎన్నో వారాలు అయిపోయింది. పదండి. వెళ్ళివద్దాం. మంత్రి గారు, మీరుండండి. సేనాపతి మాతో వుంటారు."

ఓ క్షణంలో సభామందిరం ముందున్న మైదానంలో రెండు గుర్రాలు వచ్చి నిలబడ్డాయి. రాజు ఉశీనరుడు తెల్లగుర్రం ఎక్కాడు. సేనాపతి నల్లగుర్రం ఎక్కాడు. అవి రెండు నగరం వేపు వేగంగా వెళ్ళాయి. నలుగురు అంగరక్షకులు గుర్రాల మీద రాజు వెనకాతలే బయలుదేరారు.

పురవీధుల్లో రాజు గుర్రం వెడుతూంటే జనులు ఆశ్చర్యంతో నిలబడి చూడ సాగారు. 'మహారాజుగారు వస్తున్నారు. ఎవర్ని ఎదుర్కొనటానికి వెడుతున్నారో?'

"యుద్ధం మనిదగ్గర పడిందేమిటి?"

-నమస్కరించే చేతులు, వంగిన తలలు.

రాజు తల మాత్రం కొంచెం వంగి వారి వందనాల్ని స్వీకరిస్తోంది.

ఊరు దాటాక వారు కోట దిడ్డి తలుపు వద్దకు వచ్చారు. అక్కడ కాపలా వారిని చూసిన రాజు-

"సేనాపతీ, ఇక్కడి కాపలా వారి సంఖ్య హెచ్చించాలి. నమ్మకమైన వార్ని మాత్రమే ఇక్కడ నియమించండి" అని ఆజ్ఞాపించాడు.

ఆ తర్వాత ఏటవాలుగా వున్న ఎత్తును దాటి కోట పైభాగానికి వెళ్ళారు. సుమారు అరయోజనం దూరంలో నలుగు రైదుగురు కావలావాళ్ళు మాత్రం వున్నారు. వారి సంఖ్య హెచ్చించమని చెప్పాక రాజు కోట చుట్టూ వున్న కంద కాన్ని పరీక్షించాడు.

కందకంలో ముళ్ళపొదలు అల్లుకుని వున్నాయి. నీళ్ళు మాత్రం లేవు.

"చంబల్ నది నుండి తవ్వించిన కాలువ మూయించేశాం కదా? దాన్ని తీయించి మళ్ళీ కందకానికి నీరు వదల మనండి."

"అలాగే మహాప్రభూ."

ఆ ఎత్తైన చోటు నుండి చుట్టు పక్కలి ప్రదేశమంతా స్పష్టంగా కాన వస్తుంది. ఉత్తరానికి చంబల్ నది, పశ్చిమానికి ఆరావళి. తూర్పున కొండలూ, గుట్టలూ, దక్షిణాన విశాలమయిన మైదానం. ఆ మైదానం అటూ ఇటూ, ఓమూడు యోజనాల వరకూ సూర్యఖండం. చంద్ర ఖండం కొండల వెనుక. అక్కడక్కడా పచ్చిక. నునుపైన రాళ్ళున్న చోట సూర్యప్రకాశపు పరావర్తనం.

"చంద్ర ఖండం, సూర్య ఖండం కొండల మీద కూడా గూఢచారుల్నీ, పహరా వాళ్ళని నియమిస్తాను."

"అవును. అది చాలా ముఖ్యం. శత్రుసైన్యం ఓ యోజనం దూరంలో ఉండగానే మన కంటబడుతుంది."

రాజు, సేనాపతీ కోట బురుజులు దిగి అశ్వశాల, గజశాల, ఆయుధగారాల్ని సందర్శించారు. అప్పుడు రాజన్నాడు :

"ప్రజలకు ఏ ఇబ్బందీ లేకుండా కాపాడటం మన విధి. కోట ఆయుధ సమృద్ధి కలిగి ఉండాలి. నీళ్ళు సమృద్ధిగా ఉండాలి. యోధులు కవాతు ప్రారం భించాలి. నిష్ణాతులైన కర్మకారులు పని ప్రారంభించాలి. మొత్తానికి భోజరాజ్యం సమరానికి సన్నద్ధం కావాలి!"

"ఆజ్ఞ" అంటూ నమస్కరించాడు సేనాపతి.

ఎండలో తిరిగి అలసిపోయిన రాజు మళ్ళీ మంగళస్నానం చేసి బట్టలు మార్చి మహారాణీ అంతఃపురానికి బయలుదేరాడు. ద్వారం వద్దనున్న ప్రతీహారిణి వంగి నమస్కరించి మహారాణీ వున్న చోటికి ఆయనను తోడ్కొని వచ్చింది. రాణీ

చిరునవ్వుతో వంగి నమస్కరించింది. రాజు ఆమెను లేవనెత్తి సుఖాసనంలో ఆసీను డయ్యాడు.

"చాలా ఆలస్యమయింది. ప్రభువులవారు భోజనానికి రాలేదేమో అని కాచుకుని వున్నాను" అంది మహారాణి ఆప్యాయంగా.

మాధవి వచ్చిన విషయం ఈమెకు తెలిసిందా? అని రాజు ఆమె వైపు ఓ దొంగచూపు చూశాడు. మహారాణి నవ్వుతూనే లేచి-

"రండి. భోజనానికంతా సిద్ధంగా ఉంది" అంది.

బంగారు పళ్ళెరంలో రకరకాల భక్ష్యాలు సిద్ధంగా వున్నాయి. గోధుమపిండి వంట, ఉప్పు, నెయ్యి, పనస అప్పడం, మంచి సన్నబియ్యపన్నం. కజ్జాయము, కర్పూర కదంబ భక్ష్యాలు, పరమాన్నం, పళ్ళ రసాయనం, ఆఖర్న కమ్మని పెరుగు.

రాజు తిని నెమ్మదిగా త్రేన్చి "భోజనం అద్భుతంగా వుంది!" అన్నాడు. రాణి పన్నీరు, కర్పూర తాంబూలాల్నిచ్చి చిన్నగా అంది.

"ప్రతిష్ఠాన నగర రాజకుమారి వచ్చిందట!"

"ఊఁ చాలా అందగత్తె."

ఆ మాట విని మహారాణికి చాలా కోపం వచ్చింది.

"కాదా మరి? మహారాజుగారు ఇలాగే రాజకుమార్తెలను చేర్చుకుంటూ పోతే ఇంకో అంతఃపురాన్ని కట్టించాల్సి వస్తుంది!" అని అసూయతో వ్యంగ్యంగా అంది.

ఉశీనరుడి ముఖం కోపంతో ఎర్రబడింది.

"కడదాం. దాన్లో ఏముంది? ఒకటి కాకపోతే నాలుగు. నా స్వంత విషయాల్లో మహారాణి వేలు పెట్టరాదు" అంటూ ఉశీనరుడు లేచి గబగబా అంతఃపురం లోంచి వెళ్ళిపోయాడు.

అక్కడ్నుండి మాధవికి ఏర్పాటు చేసిన గృహంవేపు అతని అడుగులు పడ్డాయి. మహారాజుగారు వచ్చారని కావలా భటులు వెనక్కి నడిచారు. ఉశీనరుడు తలుపు తోసి లోపలకు చూశాడు. అప్పుడే స్నానం చేసి వచ్చిన మాధవి తన

వత్తైన జుత్తును దువ్వుకుంటూ కూర్చుంది. దాసి ఒకతె సుగంధ తైలం పట్టుకుని ఎదుట నిల్చుంది.

ఎంతటి రూపరాశి!- అనుకున్నాడు ఉశీనరుడు. కోరిక అతని వంట్లో మెరుపులా పాకింది.

"ఇక్కడ అంతా అనుకూలంగా ఉందికదా!" అని ప్రశ్నించాడు.

మాధవి తలెత్తి అతన్ని చూసి లేచి నిల్చుంది. జవాబు చెప్పలేదు.

"దాసీ, రాకుమారికి ఏ విధమయిన ఇబ్బంది కాకుండా చూసుకోవాలి. తెలిసిందా?"

"ఆజ్ఞ ప్రభూ!"

బలవంతంగా అక్కడ్నుంచి కదిలాడు రాజు, తన శయనమందిరంలో విశ్రమించడానికి. ఉత్తరీయాన్ని ఓ ఆసనంమీద వేసి హంసతూలికా తల్పంమీదకు ఒరిగాడు. కీలు బొమ్మలు చామరాలతో విసరసాగాయి. ఆ చల్లటిగాలి అతని ప్రణయపు తాపాన్ని శమనం చేయలేక పోయింది.

సాయంకాల మయింది.

ఆడుతూ వచ్చిన అతని పిల్లలిద్దరూ తండ్రి గదిక్కి వచ్చారు. పెద్దవాడికి ఏడు సంవత్సరాలు, చిన్నదానికి నాలుగేళ్ళు. ఇద్దరూ వచ్చి తండ్రి తొడ ఎక్కి కూర్చున్నారు.

"ఇవాళేం ఆటలాడారు?" అనడిగాడు ఉశీనరుడు.

"నేను విల్లూ బాణాలతో ఆడాను" అన్నాడు కొడుకు.

"నేను బొమ్మల పెళ్ళి చేశాను" కూతురి జవాబు.

తలుపు వరదా వెనకాల నిల్చున్న దాసి పిల్లలకు సంజ్ఞ చేసింది. అది గ్రహించిన కొడుకు అన్నాడు:

"నాన్నా, ఇవాళ సాయంత్రం అమ్మ ప్రత్యేకమయిన పూజ చేస్తుందట. రాత్రి ప్రసాదం తీసుకోవటానికి రావాలట."

మధ్యాహ్నపు కోపాన్ని చల్లబర్చటానికి మహారాణి ఆడుతున్న నాటకమని ఉశీనరుడికి తెలియక పోలేదు. ఇవాళ రాత్రి తాను మాధవి వద్దకు వెళ్ళాలి. అది తప్పించటానికి మహారాణి ఈ ఆట ఆడుతున్నదేమోనని అనుమానం వచ్చింది.

"బాబూ, నేను రాజకార్యం మూలాన్ని ఇవాళ రాలేనని అమ్మకు చెప్పు. రేపో, ఎల్లుండో తీరిగ్గా వున్నప్పుడు వస్తాను. దాసీ, పిల్లల్ని తీసుకుని వెళ్ళు."

దాసి వచ్చి పిల్లల్ని తీసుకుని వెళ్ళింది. ఉశీనరుడి ఆజ్ఞ మేరకు సేవకులు సుగంధ ద్రవ్యాలను కలిపి స్నానానికి అంతా సిద్ధం చేశారు. స్నాన మయ్యాక చాలా జాగ్రత్తగా అలంకరించుకున్నాడు రాజు. దాసీలు చందనానులేపాలను అతనికి పూశారు. కొత్త పెళ్ళికొడుకులా తయారై ఉశీనరుడు మాధవి గృహానికి నడిచాడు.

# 18

రాజు తూగుటుయ్యాలమీద కూర్చున్న మాధవి భుజంమీద చెయ్యివేసి "అందాల రాణీ" అన్నాడు.

రాజుని గౌరవించకూడదని మొదటే నిశ్చయించుకున్న మాధవి అతని మాటకు జవాబివ్వలేదు. లేచి నిలబడనూ లేదు.

ఉశీనరుడు ఆమె పక్కన కూర్చుంటూ—

"ఒక్క ఆభరణం కూడా లేకపోయినా ఎంత అందంగా వున్నావు!" అంటూ ప్రీతి మాటలాడాడు.

"మీరు తప్పుగా భావించనంటే ఓ మాట చెప్తాను మహారాజా."

"ఆహా! నా చిలక మాట్లాడిందే! ఒకటి కాదు వంద మాటలు చెప్పు."

ఎలా ప్రారంభించాలో తెలియక సందేహాల మధ్య కొట్టు మిట్టాడి పోయిన మాధవి చివరికి అంది:

"గాలవ మునులవారు మీకు చెప్పారో లేదో, నేను ఇద్దరు రాజులతో ఉండి వచ్చిన దాన్ని. నానుండి మీకేం సుఖం లభించదు. నన్ను వదిలేయండి."

ఉశీనరుడి కా మాట విని చాలా ఆశ్చర్యం కలిగింది.

"నువ్వు ఆడదానివి. నీ మాట నేను నమ్మను. నువ్వు చెప్పింది నిజం కానీ, అబద్ధంకానీ ఫర్వాలేదు. ఆడవాళ్లు కామించిన కొలదీ అందంగా తయారవుతారు. ఇంద్రలోకపు రంభ, ఊర్వశుల విషయం వినలేదా? ఆ వేశ్యల కున్న రూపం ఎవరికుంది చెప్పు?"

వేశ్య అన్న మాటకు చిగురుటాకులా వణికింది మాధవి. తాను వేశ్యే! సందేహమే లేదు. దేవలోకంలోని వారు ఆ వేశ్యాత్వంలో సంతోషంగా వున్నారు. తాను బాధపడుతోంది. ఎందుకంటే తన మనస్సు ఆ పనికి ఒప్పుకోవటం లేదు.

ఉశీనరు డింకా అన్నాడు.

"ఆ గంధర్వ కన్యలను నేను చూడలేదు. కాని మన కవులు కావ్యాల్లో వర్ణించినదాన్ని విన్నాను. నీ రూపం వారి రూపంకన్నా హెచ్చయినది అని పిస్తుంది. నీకు కన్యాశుల్కం ఇచ్చి కొనుక్కున్నాను కూడా. నువ్వు నా దాసివి అన్న విషయం గుర్తుంచుకో. భోజదేశంలో రాజు మాట ధిక్కరించే అధికారం ఎవరికీ లేదు."

అలా అంటూ రాజు ఆమె భుజాల్ని పట్టుకొని తనవేపుకి లాక్కున్నాడు. మాధ విప్పుడు లేడికూన. ప్రతిఘటించే శక్తి కూడా లేదు. మానసికంగా కూడా తాను అతని దాసి అన్న నమ్మకం ఆమెను బలహీనురాల్ని చేసింది.

మంచం నాలుగుమూలలా సుగంధతైలపు దీపాలు మందంగా వెలుగు తున్నాయి. బాగా చెమటపట్టి వణికి పోతున్న మాధవిని మరింత దగ్గరకు లాక్కుంటూ రాజన్నాడు:

"మాధవీ, ఇంతవరకూ ఏ ఆడదీ నాకింత తృప్తి నివ్వలేదు. నీకేం కావాలో కోరుకో ఇస్తాను."

గాయపడిన పెదవులతో తడబడుతూ మాధవి అంది:

"విముక్తి."

"అది వదిలేసి మరేదయినా కోరుకో. నగా నట్రా, వస్త్రాలు, భక్ష్యాలు, కిరం..."

ఏదీ వద్దన్నట్టుగా తల అడ్డంగా తిప్పింది మాధవి.

రాజు లేచి కూర్చున్నాడు.

"అఁ. నాకొకటి తోచింది చూడు. చంబల్ నది ఇద్దరిన గుట్టలలో మంచి మంచి గుహలున్నాయి. జలపాతాలున్నాయి. చాలా బాగుంటాయవి. ఓ మారు మనమిద్దరమే అక్కడికి వెళ్ళివద్దాం."

మాధవి తలగడలో ముఖం దాచుకుంది.

"ఇక యుద్ధం మొదలయితే మరి దేనికీ సమయం ఉండదు. వీలయినంత త్వరలో వెడదాం" అన్నాడు రాజు.

రోజులు గడిచాయి. అంతఃపురంలో ఒక రోజుకు మరో రోజుకూ ఏమీ తేడా లేదు. కాని మాధవికి ఎక్కువగా మాట్లాడాలనే లేదు. అయినా ఎవరితో మనసు విప్పి మాట్లాడాలో! ఆత్మీయు లెవరూ దగ్గర లేరు. దాసీలు తమ పని చేసుకుని వెళ్ళేవారు. బహుశా మహారాణి అలా ఆజ్ఞాపించి వుండవచ్చు. ఎప్పుడు ఏం మాట్లాడితే తప్పవుతుందోనన్న భయం.

ఓ మారు ఉద్యానవనంలో రాజు పిల్లల్ని చూసినప్పుడు "వాళ్ళెవరు?" అని పక్కనున్న దాసిని అడిగింది.

"వారు మహారాణీ పిల్లలు."

"మహారాణికి ఎంతమంది పిల్లలు?"

"ఇద్దరే. ఓ అబ్బాయి, ఓ అమ్మాయి."

"మిగతా పిల్ల లెంతమంది మహారాజుకు?"

"ఉన్నారు. దాసీజనం పిల్లల్నెవరు లెక్కపెడతారు?"

మహారాజుకు పిల్లలున్నా మళ్ళీ తననుండి ఓ బిడ్డ కావాలని ఎందుకు కోరుకోవటం అన్న ఆలోచనలో పడింది.

భోజనం చేసేటప్పుడు మరో దాసి అన్నది:

"దొరసానీ, ఆ దాసి మహారాణీవైపు మనిషి. దాన్ని ఏ ప్రశ్నా అడక్కండి. ఉత్తుత్తినే మీరు కుట్ర చేస్తున్నారని ప్రచారం చేసేయగలదు."

మాధవికి ఓ క్షణం భయం వేసింది. అలా అయితే తన చుట్టూ వున్న వాళ్ళలో ఎవర్ని నమ్మటం? ఇదే అనుమానంతో పగలూ రాత్రీ ఆలోచించి బెంగ పెట్టుకుంది. ఇంక తను చారునేత్ర, అవ్వలను మళ్ళీ చూస్తుందో లేదో? వారీ పాటికి తనను మర్చిపోయి ఉండవచ్చు. తనకు ఈ బాధలనుండి విముక్తి ఎప్పుడు? బహుశా చావుతోటే తనకు విముక్తి అన్న మనఃస్థితికి చేరింది మాధవి.

అలాంటప్పుడే మహారాజు నుండి కబురు వచ్చింది– రేపు ఉదయం మొదటి జాములో ఆరావళి కొండల్లో విహరించటానికి సిద్ధంగా వుండాలని.

ఆనాడు మాధవిని దాసీలు ఎక్కువ శ్రద్ధతో అలంకరించారు. ఎర్రటి పట్టు చీర, కాళ్ళకి అందెలు, నడుముకు సింహమేఖల, చేతులకు నవరత్నాల కంకణ

ణాలు. మెడలో అడ్డిగ. అయిదు పేటల ముత్యాల హారం. చెవులకు అవతంసాలు. పాపిడి ే రు. కలలో నాగరం, జడకు బంగారు కుచ్చులు. సిగలో పరిమళాన్నిచ్చే మల్లెలు. నుదుట ఎర్రటి తిలకం.

వృద్ధ దాసి ఒకతె దిష్టి తగలకూడదని చెక్కిళ్ళు నొక్కి మెటికలు విరిచింది.

అంతఃపుర బహిర్ద్వారంవద్ద మహారాజు రథంలో వచ్చి దిగాడు.

తెల్లటి గుర్రాలతో, బంగారు గజ్జెలతో అలంకృతమయిన రథమది. రజత మయమయి, నవరత్నాలతోనూ, చెక్కడపు పనిచేసిన బంగారు రేకులతో మెరిసి పోతోంది. ఆ రథధ్వని మేఘధ్వనిలా గంభీరంగా ఉంది. రథం బాగా విశాలంగా కూడా ఉంది. బంగారు కళ్ళేలు తొడిగిన తెల్లగుర్రాలు అందంగానూ, బలంగానూ వున్నాయి.

రాజు మాధవికి చేయందిచ్చి రథంలో కూర్చోబెట్టుకున్నాడు. సారథికి అతడు సంజ్ఞ చేయగానే రథం వాయువేగంతో ఊరుదాటి కొండలవేపు సాగింది. వారికి కొంత దూరంలో అంగరక్షకులు గుర్రాల మీద వస్తున్నారు.

వైశాఖపు ఎండ బాగా ఎక్కువగా వుంది. రథంలో మెత్తటి పరుపుమీద పరిచిన పులిచర్మం మీద కూర్చుంది మాధవి. పరిగెత్తుతున్న రథం వేగానికి ఆమె హృదయం దడదడలాడింది. ఉశీనరుడు తన కుడిచేత్తో ఆమెను పట్టుకుని కూర్చున్నాడు.

వారు ఉత్తరాభిముఖంగా సాగుతున్నారు. దూరంలో చంబల్ నది నీరు సూర్యుడి వెలుగులో మెరుస్తోంది. నది ఒడ్డున వున్న పచ్చటి చెట్లు మిగతా ఖాళీ ప్రదేశానికి బొట్టు పెట్టినట్టు కళ నిస్తున్నాయి. రథం పశ్చిమ దిక్కుకి తిరిగేసరికి ఎత్తైన గుట్టలు ఎదురైనాయి. రెండుకొండల మధ్యనున్న ఇరుకైన ప్రదేశంలో రథం నెమ్మదిగా సాగింది. ఎక్కడో నీరు పడుతున్న శబ్దం, అప్పుడప్పుడూ గుర్రాల సకిలింపు తప్ప మరో శబ్దం లేదు.

"రథం నిలుపు" అని ఆజ్ఞాపించాడు ఉశీనరుడు.

సారథి గుర్రాల కళ్ళెం లాగి రథాన్ని నిలిపాడు. మహారాజు, మాధవి దిగారు. రాజు ఆమె చెయ్యి పట్టుకుని బండల మీంచి నడిపించుకు పోయాడు.

పరిచినట్టున్న రాళ్ళ మధ్య సూదిగా వున్న రాళ్లు గుచ్చుకుంటున్నాయి. రాళ్ళ మధ్యలో ముళ్ళు కూడా బోలెడన్ని వున్నాయి. ఎండ రాతిబండల మీద పడి ప్రతి ఫలించటంతో మరింత ఉక్కబోస్తోంది.

రాజు తన చెయ్యి పట్టుకుని నడిపించుకుని వెడుతున్నాడు. ఇతన్ని తాను ప్రేమిస్తోందా అనుకుంది మాధవి. మరుక్షణమే ప్రేమ అంటే ఏమిటి? అన్న ప్రశ్న వచ్చింది. కష్టసుఖాల్లో ఒకటై ఉండటం, ఒకరి కోసం ఒకరు త్యాగం చేయటం, తాను ప్రేమించే వ్యక్తి బాగునే కోరుకోవటం, ఒకే ఆశ, ఆకాంక్షలను కలిగి వుండ టం. తమ ప్రేమకు గుర్తుగా ఓ మొలకను పెంచటం. అంటే తాము చనిపోయినా తమ ప్రేమ నాశనం కాకుండా ముందుకు సాగే చిహ్నాలు పెట్టడం...

"అక్కడ చూడు మాధవీ."

రెండు కొండల మధ్యన లోతైన లోయ.

మాధవి ఉలిక్కిపడింది. తామిద్దరి మధ్యా అలాంటిదే అగాధం ఉంది. తామిద్దరి మధ్యా కామం తప్ప మరే సమాన ధర్మాలు లేవు. అందువల్లే ఇది తెగి పోయే బంధం.

నీళ్ళ హోరుమని దుముకుతున్న శబ్దం దగ్గర పడింది. ఓ మలుపు తిరగ గానే తెల్లటి నురగ చిమ్ముతూ రెన్నెల పండువుగా కిందకు ధారగా పడుతున్న జలపాతం కనిపించింది.

అలాంటి మనస్థితిలోకూడా మాధవికి ఆ అందాన్ని చూసినపుడు ఆనందం కలిగింది.

"ఇలాంటిది ఎక్కడయినా చూశావా ?"

"లేదు."

కింద లోయ. పాతాళంలో పారుతున్న నీరు. దాని అంచులో పచ్చటి చీర కట్టిన చెట్లు. కొండల తెలుపూ నలుపూ రంగుల రాళ్ళ మధ్య కూడా పచ్చటి నక్ష త్రాలు. దూరంలో ఎక్కడో అడవి జంతువు అరిచిన శబ్దం. సౌందర్యం, భీక రత్వం తోడు నీడగా కాపురం చేస్తున్నాయి.

ఇంతకు ముందు అడవిలో నడిచేటప్పుడు ఏనుగొకటి తరుముకుంట వచ్చింది. అడవి దున్న గాలవుడ్ని పొడవటానికి వచ్చింది. అప్పుడు ప్రాణరక్ష

కోసం తాను కేకలు పెట్టింది. ఇప్పుడు ఆ భయం లేదు. తోడుగా రాజున్నాడు. అతని వద్ద కత్తి ఉంది. సింహం, పులి ఏదొచ్చినా దాన్ని చంపే ధైర్యం అతని కుంది. కాని తనకు దుష్ట మృగాలకన్నా రాజు కోరికంటేనే భయ మెక్కువ.

ఎడం వేపున లోతైన లోయ, కుడివేపున వరుసగా గుహలు. పూర్వం ఎప్పుడయినా ఋషులుండే వారేమో అక్కడ.

రాజు ఓ గుహలోకి దారి తీశాడు. అక్కడ చల్లటి గాలి. తల తగలకుండా నడిచేపాటి ఎత్తూ,చోటూ ఉన్నా యక్కడ. అక్కడక్కడా నీళ్ళు నేలలో ఊరి పచ్చటి గడ్డి తల ఎత్తింది. గుహ గోడలపై చిత్రించిన కామకేళీ దృశ్యాలను చూపించాడు ఉశీనరుడు. నగ్నంగా నిల్చున్న స్త్రీ పురుషులు. ఒకర్నొకరు కౌగలించుకున్న రకరకాల భంగిమలు. చూస్తూంటే మాధవికి తల తిరగసాగింది.

ఉశీనరుడు ఆమెను పచ్చిక పాన్పు మీదికి తోశాడు. ఆశ నిండిన కళ్ళతో ఆమెను చూస్తూ—

"విహారం నీకు నచ్చిందా?"

అక్కడకీ ఇక్కడికీ ఏమీ తేడా లేదు. అక్కడ హంసతూలికా తల్పం, ఇక్కడ మట్టినేల అనుకుంది మాధవి.

# 19

"మాహిష్మతి రాజు సుహిష్మతి చతురంగ బలంతో భోజరాజ్యం మీదికి దండెత్తి వస్తున్నా"డన్న విషయం వార్తాహరుల మూలంగా ఉశీనరుడికి తెలిసింది. రాజు భార్యలతో కాలక్షేపం చేయటం మానేసి సమరానికి సైన్యాన్ని సన్నద్ధం చేయటంలో నిమగ్నుడయ్యాడు.

కోట మీద అడుగడుక్కీ కాపలా భటులు నిల్చున్నారు. ప్రతి ఒక్కరి చేతిలోనూ ఈటె, ఒరలో కత్తి, రాత్రులు కాగడాల వెలుగు, చుట్టుపక్కల ప్రదేశాన్నంతా వెలుగులో ముంచింది. దిడ్డి వాకిలి వద్ద రక్షణ ఏర్పాట్లు మరింత కఠినమయ్యాయి. కందకం నిండా నీరు నిండింది. ఆయుధాలు మరింత పదునుగా అయి శత్రు వినాశనానికి సిద్ధమయ్యాయి. రోజూ ఊరి బయట మైదానంలో గుర్రాలు, ఏనుగులు, పదాతులతో కవాతు ప్రారంభించారు.

భోజనగరంలో అందరినోటా సమరం మాటతప్ప మరోటి లేదు.

"శత్రువులను బలి తీసుకోవటానికి నా మనసు ఉవ్విళ్లూరుతోంది."

"మహారాజుగారికి జయం చేకూర్చే వరకూ మాకు విశ్రాంతి లేదు."

సైనికుల ఇలాంటి మాటలంటూంటే వార్ని కన్న వాళ్ళ మనసులో భావమే వేరు.

"యుద్ధం ఎందుకొస్తుందో ఏమిటో దేవుడా!"

అంతఃపురంలో ఇందరి దాసీల మధ్య యుద్ధం గురించిన కబుర్లే.

మాధవి నీరసంగా లోపల గదిలో కూర్చుని ఉండగా బయట గదిలో దాసీలు చాలా జోరుగా మాటలాడుకుంటున్నారు.

వృద్ధ దాసి అన్నది.

"మన రాజగారు గెలవటంలో అనుమానమే లేదు. భోజరాజ్యాధీశులు బలంలో విష్ణువుకు సమానులు. తేజస్సులో సూర్యుడికీ, ప్రశాంతతలో సముద్రుడికీ, ఓర్పులో భూమాతకు సమానులు."

ఇంకొకతె వేళాకోళం చేసింది.

"అవ్వా! నువ్వెందు కిక్కడున్నావు? మహారాజుగారి వందిమాగధుల గుంపులో చేరిపోవచ్చు కదా?"

"నా మాట విని అలాగంటున్నావా? వందిమాగధులు పాడగా విని దాన్ని మీముందు అంటున్నా నంతే."

నవ్వుల కోలాహలం.

"సైనికులంతా యుద్ధానికి సిద్ధమవుతున్నారు."

"అవునమ్మా! నా పిల్లలిద్దరు సైన్యంలో వున్నారు."

మరోదాసి: "మా అన్నయ్య క్రిందటిమారు యుద్ధంలో చచ్చిపోయాడు. నా తమ్ముడు ఈ మారు పదాతిగా వున్నాడు మా అమ్మకు వాడుతప్ప మరో దిక్కులేదు."

"అప్పుడు యుద్ధంలో నా పెద్ద కొడుకును పోగొట్టుకున్నానర్రా. వాడి గుండెల్లో కత్తితో పొడిచారటమ్మా. దాహం దాహం అని కేకలేస్తున్నాడట. వాడి స్నేహితుడొకడు చూసి ఆ తర్వాత నాతో చెప్పాడు. గుర్రాలూ, ఏనుగులూ, మనుష్యులూ ఒకరొన్నొకరు తోసుకుని కొట్టుకుంటూంటే నీళ్ళివ్వటాని కెవరికి ఓపిక? ఒక్క గుక్కెడు నీళ్లు దొరికితే బ్రతికేవాడేమోనమ్మా నా కొడుకు!"

ముసల్ది గొల్లుమంది.

"ష్, ఊరుకో. లోపల అమ్మగారు పడుకున్నారు. యుద్ధంలో చస్తే వీర స్వర్గానికి వెడతారు తెలీదూ?"

"తెలుసు. కానేం ప్రయోజనం? నా కొడుకు నాకు లేకపోయాక అలాంటి వాటి కర్థమేమిటి?"

కొంచెంసేపు మౌనం.

"గొప్పవాళ్ళు గెలవటాని కోసం మనందరం పోట్లాడాలి."

"ఎప్పుడూ ఏడ్చేది మనమే. పేదవాళ్ళకే అన్ని కష్టాలూ! గొప్పవాళ్ళకి ఏమీ కాదు."

"యుద్ధంలో దక్కే డబ్బూ దస్కం, నగానట్రా రాజులకే. మనకు మాత్రం వాళ్ళ సేవ మిగులుతుంది."

"ఆఁ! నీ తిండీ బట్టా వాళ్లు చూసుకోవటంలేదా? దానికన్నా నీకేం కావాలి చెప్పు?"

"ఏమీ వద్దు. దాసీలం మన కలాంటి ఆశలూ ఉండకూడదు."

వృద్ధ దాసి ఏడుస్తూనే అంది:

"చచ్చిన కొడుకు ముఖమయినా చూసివద్దామని కాపలా వాళ్ళకు కనబడ కుండా దిడ్డి వాకిలిలోంచి బయటకు వెళ్ళావమ్మా. అమ్మ బాబోయ్! చూడలేక పోయానమ్మా. గుట్టలు గుట్టలుగా శవాలు. మనవాళ్ళవీ, శత్రువులవీ- బ్రతి కున్నంత వరకూ కొట్లాడుకుంటాం. చచ్చాక అందరం ఒకటే అవుతాం. కొడుకుని వెతుక్కుంటూ పోయానమ్మా. శవాలు కుళ్ళిపోయి వాసన వేస్తున్నాయి. కాకులూ, గ్రద్దలూ, కుక్కలూ శవాల్ని పీక్కుని తింటున్నాయి. నామీదకూ్కడా వచ్చాయి. బ్రతుకు జీవుడా అని పరిగెత్తు కొచ్చాను..."

అదంతా వింటూ పడుకున్న మాధవి కడుపులో తిప్పసాగింది. రాజులు ఎందుకిలా యుద్ధం చేస్తారు భగవంతుడా అనుకుంది. ఇప్పుడు ఉశీనరుడు గెలి స్తే ఆ అవతలి రాజు ఇతనికి శరణాగతు డవుతాడు. కప్పం చెల్లిస్తాడు. కాని సైనికులు చావటం మాత్రం తప్పదు. ఒకవేళ ఉశీనరుడు ఓడిపోతే? తామందరూ శత్రు రాజుల బందీలవుతారు. అప్పుడు తమను ఇష్టంవచ్చినట్టు వాడుకోవచ్చు. ఏమో ఎవరికి తెలుసు? అలాగయినా విముక్తి లభిస్తుందేమో తనకు! మళ్ళీ గాలవుడికి కనిపించకుండా ఏదైనా పరాయి రాజ్యానికి వెళ్ళిపోతే?

దాసి ఒకతె లోపలకు వచ్చి, "అమ్మా! నిద్రపట్టిందా?" అని మెల్లిగా ప్రశ్నించింది.

"లేదు."

"రాజవైద్యుల వారిచ్చిన కషాయం తాగే వేళయింది. గుర్తు చేద్దామని వచ్చాను" అంటూ వెండిగిన్నెలోకి కషాయం వంచి ఇచ్చింది. అది తాగుతూ మాధవి ముఖం చిట్లించింది.

• • •

దశమినాడు విజయయాత్ర ప్రారంభించాలని ఉశీనరుడి ఆజ్ఞగా నగరమంతా చాటించారు. నగరమంతా యుద్ధానికి సన్నద్ధమయింది. నీలం, సునీలం, శ్రీమత్సం, సారంగం, మంగలం మొదలయిన వర్ణ శుద్ధాంగమైన (మేలురంగు) అశ్వాలు, కాంభోజం, బాహ్లిక, వనాయుజం, సింధు మొదలయిన దేశాల్లో పుట్టిన ఉత్తమ జాతికి చెందిన గుఱ్ఱాలు సమరానికి సిద్ధమయ్యాయి. వింధ్య మొదలయిన పర్వతాల్లో పుట్టిన అతి బలమయిన గున్నేనుగులు, ఐరావతం, వామనం, కుముదం, అంజనం మొదలయిన దిగ్గజాల వంశంలో పుట్టిన ఏనుగులు యుద్ధానికి సిద్ధమయ్యాయి.

ఆయుధాగారంలో ఆయుధాలకు ప్రత్యేకమయిన పూజలు చేశారు.

ఆయుధా లన్నిటినీ చక్కగా వరసగా పేర్చారు. భల్లం, బాకు, ఇనుపకట్ల కుసెయ, గడ్డపార, చర్నాకోల, డాలు, కత్తి, కఠారి, గద, ఈటె, విల్లమ్ములు, ఖడ్గం, చంద్రహాసం, కృపాణం, పరశువు, తోమరము, త్రిశూలము, దండం మొదలయిన రణాయుధాలన్నీ ఓ వైపున్నాయి, కొమ్ము బూరాలు, కాహళులు, శంఖాలు, భేరులు, పటహాలు ఇంకో వైపున పూజింపబడ్డాయి. ఎక్కడ చూసినా నేతి దీపాలు వెలుగుతున్నాయి.

శస్త్రాగారంలో రక్తచందనంతో అలికారు, పూశారు. ఎర్రగుడ్డలతోచాందినీ, రక్తవర్ణపు పూలమాలలు, బలిపుష్ప గంధాల పూజ- వీటివల్ల వీరరసం అవతార మెత్తినట్టుగా వుంది. నైవేద్యానికి పంచవర్ణపు బోనం, కజ్జికాయల్ని పెట్టారు. పొంగలి, అప్పాలు కిచిడీ మొదలయినవి పెట్టారు. కణకణ మండుతున్న హోమ గుండం ముందు చెరకు, కొబ్బరి కాయలతో ఖడ్గ పూజయింది. పళ్ళు, కొబ్బరి కాయలు, ఎర్రటి వస్తువుల నైవేద్యం, పొగలు కక్కుతున్న ధూపాలు చూసేవాళ్ళ మనసుల్లో వీరావేశం స్ఫురించేలా చేస్తున్నాయి.

దశమిరోజున మొదటి జాములో మహారాజు ఉశీనరుడు అంతఃపురం ముందు వచ్చి దిగాడు. మహారాణి అతనికి ముత్యాల ఆరతి ఇచ్చి సేసలు చల్లింది.

"మహారాజుకు జయము జయము" అని చిన్నరాజులందరూ ఏక కంఠంతో పలికి అతనిపై పూలవర్షంకురిపించినారు. పిల్లలువచ్చి అతన్ని కౌగలించుకున్నారు.

పిల్లల్ని ముద్దిడుకొని, రాణులకు వీడ్కోలు చెప్పి ఉశీనరుడు అంతఃపురం ముంగిట్లోకి నడిచాడు.

అతని గంభీరగమనం అందరి దృష్టిని ఆకర్షించింది. పొడుగ్గా బలంగా ఉన్న శరీరం, దానికి తగ్గట్టే కాసె బిగించి కట్టిన పంచ, బిగుతయిన కుళ్ళాయి, రొమ్ముకు బంగారు కవచం తొడిగి, అంగుళిత్రాణం, వీపున అంబులపొది ధరించి, విల్లు పట్టుకుని బయలుదేరిన రాజు ఉదయ సూర్యుడిలా మెరుస్తున్నాడు. చెవులకు మెరుస్తున్న కుండలాలు, నుదుటి మీద మెరుస్తున్న కస్తూరి తిలకం అతని సౌందర్యాన్ని ఇనుమడింప చేశాయి.

అంతఃపుర ప్రాంగణంలో పెరుగు గిన్నె, అక్షతలు పట్టుకుని నిల్చున్నారు బ్రాహ్మణులు. వారు స్వస్తివాచకం చేసి "శ్రేయోస్తు - విజయ ప్రాప్తిరస్తు" అని రాజుకు ఆశీర్వాదం చేశారు. వారికి నమస్కరించి రాజు ఏనుగు నెక్కాడు.

రథ, గజ, తురగ, పదాతిసేన ఊరిబయట నున్న జమ్మిచెట్టు వద్దకు నడిచింది. భేరీ శంఖ నినాదాలు సేనరాకని అందరికీ తెలియ జేశాయి.

శమీ వృక్షం ఫలపుష్పాలతోనూ రంగు వస్త్రాలతోనూ అలంకరింపబడింది. మావటీడు ఏనుగును అంకుశంతో నిలిపి కూర్చోబెట్టాడు. రాజు కిందికి దిగి చుట్టూ చూశాడు. ఎక్కడ చూసినా ఏనుగులు, గుర్రాలు, రథాలు, కత్తులు, ఖడ్గాలు, మణులుపొదిగిన డాలులు పట్టుకుని నిల్చున్న వీరభటులు, మెరుస్తున్న పతాకాలు.

రాజు రెండు వేపులా మంత్రి, సేనాపతులు నిల్చున్నారు. ఇరవైనాలుగు శంఖాలు, పన్నెండు భేరులు, పన్నెండు నగారాలు మ్రోగుతుండగా ఉశీనరుడు విజయ వృక్షాన్ని పూజించాడు.

ఆ తరువాత మంత్రితో-

"మంత్రివర్యా, నగరాన్ని రక్షించే భారం మీదే. మేము వెళ్ళి వస్తాం" అని ఉశీనరుడు అతనికి బాధ్యత నప్పజెప్పి బయలుదేరాడు.

సైన్యం దక్షిణ దిక్కుగా బయలు దేరింది. మొదట పదాతి దళం, తర్వాత గుర్రాలు, ఏనుగులు, అన్నిటికన్నా వెనుక రథాలు. సేనాపతి గుర్రం మీద అటూ

ఇలా తిరుగుతూ సైన్యాన్ని అదుపులో ఉంచుకున్నాడు. గుర్రాల, అడుగుల చప్పుడు, హేషారవం, ఏనుగుల ఘీంకారం, రథాల గంభీర ధ్వని, వీటన్నిటినీ మించిన యోధుల ఉద్ఘోష, చూసేవారికి సముద్రమే కదలి వెళ్ళుతున్నదేమో ననిపించేలా ఉన్నది.

# 20

ఒక యోజనం దాటాక ఏనుగుపై నిల్చుని చూసిన సేనాపతి హెచ్చరించాడు.

"మహాప్రభూ, దూరంగా దుమ్ము లేచినట్టుగా కనిపిస్తోంది. అది మాహిష్మతి సైన్య మనుకుంటాను."

మహారాజు శరీరమంతా పులకరించింది.

"మన యోధులకు ఆదేశమిచ్చి రండి."

సేనాపతి ఏనుగు దిగి, నల్లగుర్రం మీదెక్కి సైన్యంలో అన్ని మూలలా తిరుగుతూ శత్రు సైన్యాన్ని ఎలా మట్టుపెట్టాలో సూచన లిస్తున్నాడు.

యోధులు జయ నినాదాలు చేస్తున్నారు. భేరి, పటహాలు, శంఖాలు, వీర బాలు నగారాలు ఒకేమారు మ్రోగాయి. బల్లేలు, కత్తులు, కటారులు పట్టుకున్న సైనికులు ముందుకు చొచ్చుకు పోయారు. ఓ గడియలో రెండు సైన్యాల మధ్య యుద్ధం ప్రారంభమయింది.

"కొట్టు, చంపు!"

"వాడి గుండెలు చీల్చు!"

"వాడి గుర్రాన్ని గురి చూసి బాణం వదులు!"

"అయ్యో! చచ్చాను బాబోయ్!"

"అమ్మా...బాబోయ్!"

హయ హేషలు, రథ చక్రాల శబ్దం, మనుష్యుల ఆక్రందనం, కొమ్ము బూరల మ్రోత!

"నీళ్ళివ్వండి...ఓ చుక్కనీరు."

"కఠారితో వాడిని పొడు. వాడు శత్రు సైన్యం వాడు."

"అయ్యో!"

చచ్చినవాళ్ళు కిందపడ్డారు. తలలు మొండాలు చెల్లా చెదురయ్యాయి. కాళ్లు విరిగిన గుర్రాలు కూలబడ్డాయి. గాయపడ్డ ఏనుగులు పెద్దగా ఘీంకరించాయి. కిందపడ్డ వాళ్ళ మీద నుండే రథాలు, గుర్రాలు, ఏనుగులు తిరుగుతున్నాయి. చచ్చిన శవాలను పీక్కు తినటానికి గద్దలు, కాకులు ఆకాశంలో తిరుగుతున్నాయి.

రాత్రి డేరాలో ఏదో కాస్త తిని లేచిన రాజు అడిగాడు.

"మనవేపు ఎంతమంది చనిపోయారు?"

"ఏభై అరవైమంది కన్నా లేరు. పది గుర్రాలు కాళ్ళు విరిగి పడ్డాయి. శత్రుసైన్యంలో ఓ రెండువందలమందయినా చచ్చి వుంటారు. వారి సైన్యం వెనక్కి వెళ్ళింది."

"భళిభళీ సేనాపతీ. మన యోధులకు చంద్రఖండం, సూర్యఖండం మూల మూలలూ తెలుసు. చీకట్లోనే అక్కడికి వెళ్ళి దాక్కోమనండి. రేపు ఉదయం యుద్ధం ప్రారంభమయినప్పుడు ఆ రెండు వేపుల్నుండి మనవాళ్ళు వైరిసైన్యం పై ముంచుకు పడాలి."

అది విని సేనాపతి కళ్ళు ఉత్సాహంతో మెరిశాయి.

"ఆజ్ఞ మహారాజా!"

మరునాడు యుద్ధంలో క్రితంరోజు జరిగినదే పునరావృత్త మయింది. మాహిష్మతి సైన్యం ఇంకంత జడిసి వెనక్కి మళ్ళింది. మూడవరోజు శత్రు సైన్యం మరింత బలహీనమయింది. ఉశీనరుడి సైన్యానికి వీరావేశం. యుద్ధ దేవతకు రక్త తర్పణం చేశారు.

"మాహేయ రాజ్యం వరకు వార్ని తరిమి కొడదాం. ఇంకోసారి భోజ రాజ్యం మీద దండెత్తి వచ్చే ధైర్యం లేకుండా చేద్దాం" అన్నాడు ఉశీనరుడు.

"మహాప్రభూ, మాహిష్మతికి అందమయిన కూతురుందట."

"అహాఁ అలాగా" అన్నాడు చిరునవ్వుతో ఉశీనరుడు.

నాలుగో రోజు సాయంకాలానికి శత్రుసైన్యపు గుడారాలు ప్రశాంతంగా వున్నాయి. ఓ గుర్రంమీద దూత తెల్లబావుటా పట్టుకుని ఉశీనరుడి డేరా వద్దకు వచ్చాడు.

"ఆతడు రాజదూత. ఆతిథ్యం చేయండి" అని సైన్యంలోని అధికారులు సైనికులను ఆజ్ఞాపించారు. రాజదూతను తిన్నగా ఉశీనరుని సమక్షంలోకి తీసుకుని వెళ్ళారు. దూత మహారాజుకు సాష్టాంగ ప్రణామం చేసి అన్నాడు :

"మహాప్రభూ, మా మహారాజుగారు శాంతినే కోరుకుంటున్నారు. పరస్పర మైత్రితో ఉండాలని వారి ఆశ."

"కాని కయ్యానికి కాలు దువ్వి వచ్చింది మేము కాదు."

"అవును ప్రభూ. మేము చేసినది తప్పు పనే. క్షమించమని మాహిష్మతి మహారాజులవారు తమ వద్ద విన్నపం చేసుకుంటున్నారు. తాము అంగీకరించినట్టయితే మా మహారాజుగారు కప్పమూ, కానుకలతో తమ దర్శనం చేసుకుంటారట."

ఉశీనరుడు కొంచెంసేపు ఆలోచించాడు. తన సేనాపతితో పక్కగదిలోకి వెళ్ళి మంత్రనాలు జరిపాడు. ఆ తరువాత దూతతో ఉశీనరుడు—

"మాకు మాహిష్మతి రాజుగారి పట్ల ద్వేషభావం లేదు. వారైవారు మైత్రి కావాలని కోరుకున్నట్లయితే మాకేమీ అభ్యంతరం లేదు. తప్పక రమ్మనండి వారిని" అన్నాడు.

రాజదూత వంగి నమస్కరించి తనవారి గుడారాల వేపు వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం రెండోజాము వేళకు మాహిష్మతిరాజు ఏనుగుమీద ఉశీనరుడి శిబిరానికి వచ్చాడు. సైనికులు అతని త్రోవకు ఇరువేపులా నిలబడ్డారు. గుడారం ద్వారం వద్ద సేనాపతి రాజుకు స్వాగతం పలికి లోనికి తీసుకుని వెళ్ళాడు.

ఉశీనరుడు ఆసనం నుండి లేచి మాహిష్మతి రాజుకు స్వాగతం పలికాడు. తనకు నమస్కరించటానికి వంగిన ఓడిపోయిన రాజును లేవనెత్తి—

"చిన్నవారికి పెద్దవారు నమస్కరించటం శ్రేయస్కరం కాదు" అంటూ తన పక్కనున్న ఆసనంపై కూర్చోబెట్టుకున్నాడు. అతని హృదయ వైశాల్యానికి ఆశ్చర్యపడ్డాడు మాహిష్మతి.

మాహిష్మతి రాజు కనుసన్నన్నుగమనించిన దూతలు పది బంగారు పళ్ళెరాలను తెచ్చి ఉశీనరుడిముందు పెట్టారు. వాటిలో గంధపు వస్తువులూ, చందనం, అగురు మొదలయిన సుగంధ ద్రవ్యాలూ, దివ్యాంబరాలు, ముత్యాలు, పగడాలు, ఏనుగు దంతం పిడి వున్న కత్తులూ, కదళి అనబడే జింక చర్మంతో చేసిన లేత ఎరుపు, నీలం రంగుల కృష్ణాజినాలు ఉన్నాయి.

ఉశీనరుడు తలపంకించి వాటిని స్వీకరించాడు.

మాహిష్మతిరాజు తన తెల్లగడ్డం నిమురుకుంటూ అన్నాడు.

"షోడశియైన నాకూతురు మహిమను అత్యంత శూరుడైన రాజు కిచ్చి వివాహం చేస్తానని ప్రతిన పూనాను. ఈనాటికి అది నెరవేరింది. తమరు నా కూతుర్ని చేపట్టి నన్ను కృతార్థుడిని చెయ్యాలి."

ఉశీనరుడు చిరునగవుతో సేనాపతి వంకచూశాడు.

మాహిష్మతి "వరుని ఇంట్లో పెళ్ళి చేయుటం మా సంప్రదాయం. ఒకటి రెండు పక్షాలు మాకు గడువివ్వండి. శుభ ముహూర్తము నిశ్చయించి అమ్మాయిని తీసుకుని భోజరాజ్యానికి వస్తాను" అన్నాడు.

"అలాగే కానివ్వండి."

విజయ సైన్యం రాజధానికి తిరిగి వెళ్ళేముందు ఉశీనరుడు సేనాపతితో చెప్పాడు:

"చనిపోయిన సైనికులకు శవ సంస్కారం చేయుటం మన విధి. అది ముగించి తరువాత రాజధానికి వెడదాం."

"ఏర్పాట్లు చేస్తాను మహాప్రభూ."

"అలాగే ఇంకో పనికూడా చెయ్యాలి. మన సైనికులలో ప్రతి ఒక్కరికి వంద వరహాలు బహుమతిగా ఇవ్వండి. యుద్ధం చేసి గెలిచిన వారికి బహుమతు లివ్వటం మన ధర్మం."

"అలాగే ప్రభూ."

కొంతమంది సైనికులు సమీపంలోని అడవిలో కట్టెలు తీసుకుని రావటానికి వెళ్ళారు. మరికొంతమంది తమ సైనికుల శవాలను ఓ చోట పేర్చ నారంభిం

చారు. రక్తసిక్తమైన దుస్తుల మూలంగా ఎన్నోమార్లు తమ సైనికు లెవరో శత్రు సైనికు లెవరో గుర్తించటం అసాధ్యమయ్యేది.

"ఎవరయితేనేం ఎత్తి వెయ్యండయ్యా. చచ్చాక అందరూ ఒకటే" అన్నాడో యోధుడు.

"శవాల్ని చూస్తూంటే చాలా కష్టం వేస్తుందబ్బా. ఎందుకొచ్చిన బ్రతుకు అనిపిస్తుంది. నా స్నేహితులిద్దరూ చచ్చిపోయారు. నేనింకా బ్రతికే వున్నాను."

"వేదాంతం చాలించి పని త్వరగా ముగించు."

ఇంకో సైనికుడు మధ్యలో తలదూర్చి అన్నాడు.

"అవునయ్యా. త్వరత్వరగా ముగించి ఊరు చేరుకుందాం. ఈ శవాల వాసనకు కడుపులో తిప్పేస్తోంది. అన్నంకూడా సయించటం లేదు."

శవా లన్నిటినీ గుట్టగా వేసి కట్టెలు పేర్చి చితి చేసి అగ్ని సంస్కారం చేశారు. గాలి ఉండటంతో మంట త్వరగా అంటుకుంది. పొగ ఆకాశమంతా వ్యాపించింది. కాలిన చర్మం, పగిలే ఎముకల వాసన ఆ ప్రదేశమంతా అలుముకుంది.

విజయ సైన్యం మూడుయోజనాల దూరాన్ని అతి త్వరగా అధిగమించింది. యోధులు రాజధానిని ప్రవేశించినపుడు వారికి బ్రహ్మాండమైన స్వాగతం లభించింది.

రాజు ఉశీనరుడు స్వర్ణమయ రథంలో కూర్చున్నాడు. గాలికి ఊగుతున్న గంటలూ, పతాకం వున్న రథాన్ని కలశంతోనూ పూలమాలలతోనూ అలంకరించారు. రెండువేపులా నిల్చున్న ప్రజలు "అరివీర భయంకరా, జయ జయ" అని కేకలు వేస్తూ అతనిపై పూలవర్షం కురిపించారు.

ఏనుగులు, గుర్రాలు, రథాలు, పల్లకీలు, మేనాలు మొదలైన వాహనాల్లో సేనాధిపతులు వైభవంగా ఛత్ర చామరాలతో, వాద్యఘోషతో ఊరేగింపు వెడలారు. ఊరేగింపంతటా గాలిలో ఎగురుతున్న ధ్వజాలు, శ్వేతఛ్ఛత్రాలు, విసురుతున్న చామరాలు. పౌరకాంతలు తమ ఇళ్ళ చూరులు, మిద్దెలు. గూళ్ళు గోపురాలు ఎక్కి ఈ అపూర్వ దృశ్యాన్ని తనివితీరా చూశారు. తమ సోదరుడో, తండ్రియో, భర్తో, కొడుకో ఆ సైనికులలో ఉన్నారో లేదోనని చూసేవారు ఎంతోమంది. వాడ

కనబడక పోయేసరికి ఆందోళనతో మేడలు దిగి దుఃఖంతో ఇళ్ళకు పరిగెత్తిన వారు వందలాది మంది.

ఊరేగింపు రాజభవనం ముఖద్వారం వద్ద విడిపోయింది. ఉశీనరుడు మంత్రి సేనాపతులతో కొంచెంసేపు మాట్లాడి రాణీవాసంవేపు నడిచాడు. క్షణ మాత్రంలో రాణీలు, దాసీలు గుమిగూడారు. మహారాణి ఉశీనరుడికి కుంకుమ పెట్టి ముత్యాల హారతి ఇచ్చింది.

దాసి ఒకతె పరిగెత్తుకుని వచ్చి మాధవితో, "అమ్మా! మహారాజుగారు అంతఃపురానికి వచ్చారు రండి" అని పిలిచింది ఆయాసపడుతూ.

"నేను రాను. నువ్వు చూసిరా" అంది కఠినంగా మాధవి.

సాయంకాల మయ్యేసరికి బయట అరుగుమీద ఎవరో ఏడుస్తూండటం విని పించి మాధవి బయటకు వచ్చింది. వృద్ధ దాసి వెక్కి వెక్కి ఏడుస్తోంది. మరి ఇద్దరు ఆమెను ఓదాతుస్తున్నారు.

"ఏమయింది? ఎందు కేడుస్తున్నావు?" అనడిగింది మాధవి.

వృద్ధ దాసి లేచి నిల్చుని–

"యుద్ధానికి వెళ్ళిన నా ఇద్దరు కొడుకులు చచ్చిపోయారుటమ్మా" అంటూ మళ్ళీ ఏడవసాగింది.

ఆమె నెలా ఓదార్చాలో తెలియక మాధవి అలాగే నిల్చుని వుండగా, ఇంకో దాసి అన్నది.

"నా తమ్ముడు కూడా చనిపోయాడట. ఏడిస్తే చచ్చినవాళ్ళు తిరిగివస్తారా?"

"తమ్ముడికీ, కన్నబిడ్డలకూ చాలా తేడా వుంది చెల్లీ."

కన్నబిడ్డలు అనగానే మాధవి గుండె గుభిల్లుమంది. ఈ పేద దాసికి తన పిల్లలపై నున్నంత ప్రేమకూడా తనకు లేదే అనిపించింది. ఇద్దరు పిల్లల్ని కని అక్కడే వదిలిపెట్టి వచ్చాను. వాళ్ళు ఎలాగున్నారో అని ఆలోచించటానికి కూడా సమయం లేకుండా ఇంకో పిండం తనలో పెరుగుతోంది. తనది గుండెకాదు– రాయి అనుకుంటూ మాట్లాడకుండా లోపలకు నడిచింది.

చిన్న దాసీల సంభాషణ ఇంకా సాగుతూనే వుంది.

"ఇంకో నెలలో మహారాజుగారికి మాహిష్మతి కూతురితో పెళ్ళిట!"

"ఎలా వుంటుందో అమ్మాయి?"

"రాజు కూతురు అన్నాక బాగానే వుంటుంది. యౌవనంలో ఎవరు అందంగా ఉండరు చెప్పు? యుద్ధపు అంకం ముగిసింది. ఇంక వివాహపు అంకం. నాటకాలు పాటలు నృత్యాలకేం కొదవ వుండదు."

"మహారాణి గారేమంటారో ఈ పెళ్ళికి?"

"నీకెందుకు బెంగ? నువ్వేం మహారాణిని కాదుకదా?"

"వద్దమ్మా వద్దు. రాణి కావాలని ఎవరేడుస్తారు! ఈ దాసీ జీవనం చాలు నాకు."

ఈ మాటలు మాధవి చెవిలో మార్మోగినవి.

# 21

రాజు వివాహానికిగాను రాజభవనం సింగారించుకోసాగింది. సభా భవనం పక్కనున్న విశాలమైన చావడిలో వివాహ వేదిక. అతిథులకు ఆసనాలు ఏర్పాటు చెయ్యబడ్డాయి. ముత్యాల, మణుల తోరణాలు. రంగు రంగు పూలరుల పట్టుకుచ్చుల అలంకారాలు చావిడి అందాన్ని ఇనుమడింప చేశాయి. వేదిక చుట్టూ మాణిక్య దీపాలు. దక్షిణోత్తరంగా పలుచని పట్టుతెర.

వివాహం రోజు వివాహ మంటపం జనంతో నిండిపోయింది. ఓ వేపున రాజు అంతఃపురంలోని రాణీలు, దాసీలు. ఇంకోవేపు వధువుకు సారెగా వచ్చిన పెద్ద కన్నుల. అందమయిన, యౌవనంలో వున్న, బంగారు నగలతో అలంకృతులైన వేయిమంది దాసీలు. వేదిక సమీపంలో రాజ్యపు అధికార వర్గం. మిగిలిన వారంతా ప్రజలు.

వధువు మహిమ అంత పొడుగూ పొట్టీకాని శ్యామల వర్ణపు యువతి. కుచ్చిళ్ళు చక్కగా పట్టి కట్టిన దివ్య పీతాంబరం. జరీ రవిక. పైకెత్తి కట్టిన ముడి. దానికి మణిమాలల అలంకారం, ఒంటినిండా తళతళా మెరిసిపోయే వజ్ర వైడూర్యాల ఆభరణాలు. గోరింటాకుతో మెరుస్తున్న గోళ్ళు. ఒంటికంతా జవాది లేపనం.

సుమధురమయిన పవనం తేలివచ్చినట్టుగా మహిమ నడిచి వచ్చింది. తెర ముందు పశ్చిమాభిముఖంగా నిల్చుంది.

దాసి ఒకతె : "కన్ను ముక్కు బాగానే వున్నాయిగానీ రాజకుమారి రంగు మాత్రం నలుపే!"

"మన మాధవి ముందు ఈమె దిగదుడుపు. ఇలాంటి అందగత్తెను మాత్రం నేనెప్పుడూ చూడలేదు."

"ష్! ఊరుకోండి. మహారాజుగారు వస్తున్నారు."

దివ్య వస్త్రాలను ధరించిన ఉశీనరుడు రాజ గాంభీర్యంతో నడిచివచ్చాడు. అతని ఉత్తరీయం గాలిలో మెల్లిగా ఎగురుతోంది. వంధిమాగధుల స్తుతి, చామరాల మధ్య అతను వచ్చి ముత్యాల పీట ఎక్కి నిల్చున్నాడు పూర్వాభిముఖంగా.

"వధువు తెచ్చిన సారెకు లెక్కలేదుట."

"సువర్ణమయమైన వేయి రథాల్ని ఇచ్చారట."

"అంతే కాదుట. పుష్కలంగా పాలు ఇచ్చే వెయ్యి గోవుల్ని, వెయ్యి గుర్రాల్ని కూడా ఇచ్చారుట."

"వెయ్యి కంచర గాడిదల్నెందుకు మర్చి పోయావు?"

"వాటి విషయం నాకు తెలియదమ్మా. పీతాంబరాలు, ఆభరణాలకు లెక్కే లేదుట. ఇంక ఆ దాసీలో..."

"ఇప్పుడున్న అంతఃపురం చాలదింక. కొత్తరాణీకి, ఆమె దాసీలకు ఇంకో అంతఃపురమే కట్టించాల్సి వుంటుంది."

"మహారాజుగారు కట్టిస్తారులే. మధ్యలో నీదేం పోయింది."

"అదిగో చూడు. తెరతీశారు."

గాయకులు మంగళగీతాలు పాడారు. బ్రాహ్మణులు మంత్రాలు చెప్పి అక్షతలు వేశారు. మంగళాష్టకం పూర్తికాగానే తెరతీశారు. అక్కడ చేరినవారందరూ "వధూవరులకు జయము కల్గుగాక!" అని దీవించారు.

మాహిష్మతి రాజు మహిమ కుడిచేతిని ఉశీనరుడి చేతిలో పెట్టి బంగారు గిన్నెలోని నీటితో ధారబోశాడు. నూతన వధూవరులు చేతులు పట్టుకుని అగ్నికి ప్రదక్షిణ చేశారు.

మూతి ముడుచుకుని కూర్చున్న మహారాణి "ఏం చూసి దీన్ని చేసుకుంటు న్నారో" అంది.

పెళ్ళి జరుగుతూండగా మాధవి తన గృహంలో తూగుటుయ్యాలలో కూర్చుని ఆలోచనలలో మునిగింది.

ఉశీనరుడు తన్ను స్వీకరించి ఇంకా నాలుగు నెలలు కూడ కాలేదు. అప్పుడే మరో పెళ్ళిమీద కోర్కె కలిగింది. అనాథయై వచ్చిన తనపట్ల మహారాజుకు ప్రేమ

మాట అల్లా నుంచి కనికరం కూడా లేదా? అతను భ్రమరం లాంటివాడు. ఓ ఆకు దానివద్ద నిలకడగా నిలబడలేడు. క్షణ క్షణానికి కొత్త పూవుని వెతుక్కుని పోవటమే అతని ధర్మమా? నీతినియమాలు లేని ఇలాంటి జీవితం పట్ల అసహ్యం వేసింది మాధవికి. ఇప్పుడే వివాహ మంటపంలోని మంగళవాద్యాలు ఆమె చెవి చిల్లులు పడేలా మ్రోగాయి.

• • •

తల స్నానం చేసిన మాధవి జుట్టు ఆరబెట్టుకోవటానికి ఉద్యానవనంలో ఎండలో కూర్చుందామని వచ్చింది. ఆమె వొత్తయిన పొడుగాటి జుట్టు దాసీలు ధూపం వేసినా ఇంకా తడిగానే ఉంది. వర్షాకాలంలో ఎండ అప్పుడప్పుడూ వచ్చినా బయట కూర్చోవా లనిపించేసు మాధవికి. మణిశిలా వేదిక మీద కూర్చుని సరోవరంలో ఆడుతున్న హంసలనే ఏదేకంగా చూడసాగింది.

దాసీ లిద్దరు స్వర్ణమండలం, కిన్నెరలను తీసుకుని వచ్చి ఆమెకు కొంచెం దూరంలో కూర్చుని భూపాలరాగం ఆలాపించ సాగారు. రాగం, తానం, పల్లవులు మేళవించిన ఆ సంగీతం వింటూ "ఎవరు పాడుతున్నది? కమల ముఖియా?" అనుకుంది మాధవి. ఇది కలా? తానెక్కడుంది?

["రాజకుమారీ ఇవాళ నీ మనసు సంగీతంలో లేదు"]

ఇది తప్పకుండా చారునేత్ర గొంతే!

["రేపు నువ్వు వరించే రాకుమారుడెలా వుండాలో ఆలోచిస్తున్నావు కదూ?"]

ఊరుకోమ్మా. అలా వేళాకోళం చేయకు?

"లేదు చెప్పు. ఎలా వుండాలి నీ రాకుమారుడు?"

"సుందరుడై వుండాలి. సుకుమారుడు కావాలి శూరుడు, ఉదారుడు, ధర్మిష్ఠుడు, వినయవంతుడూ అయి వుండాలి. అది చాలదు. ఆతను ఏకపత్నీ వ్రతుడూ కావాలి!)

ఎవరో గట్టిగా పకపకా నవ్వుతున్న ధ్వని. భూపాల రాగం విరిగిపోయింది. మాధవి కళ్ళు నులుముకుంటూ చుట్టూ చూసింది. ఎదురుగా దాసీలిద్దరూ పాట ముగించి మరో పాట మొదలుపెట్టబోతున్నారు. కమలముఖికాదు. చారునేత్ర లేదు. యయాతిరాజు ఉద్యానవనం కాదు. ఇది ఉశీనరుడి అంతఃపురం.

కలలు కనటానికి మాత్రమే పనికొస్తాయి. నిజం కావటానికొక్కాదు. ఒక్క రాజకుమారుడెందుకు? ముగ్గురు రాజులతో జీవితం గడిపానే! ప్రీతి ప్రేమ లాంటి మృదువైన భావనలు ప్రతిష్ఠానగరం వదిలినప్పుడే నేలమట్టమయ్యాయి. ఇక మిగిలింది వదిలిపెట్టి వచ్చిన పిల్లల జ్ఞాపకాలు మాత్రమే. జీవితకాలంలో ఓ స్త్రీ అనుభవించే కష్టసుఖాలను తాను ఈ మూడు నాలుగు సంవత్సరాల్లో అనుభవించింది. మనస్సుకు ఏమీ వద్దు అనిపించేలాంటి నిరాసక్తి తలెత్తుతోంది ఈ మధ్య...

పిల్లలు పెద్దగా నవ్వుతున్న శబ్దం.

మాధవి తలెత్తింది. ముఖమంతా కప్పిన జుట్టును వెనక్కితోసి ముడివేసింది. అందమయిన బట్టలు తొడుక్కున్న రాజకుమారుడూ, రాజకుమారీ పరిగెడుతూ ఆమె వున్న వేపే వచ్చారు. ఆ పిల్లల్ని చూడగానే ఆమె ముఖం విచ్చుకున్నది.

"రండి పిల్లల్లారా" అని మాధవి చేతులు చాచి పిలిచింది.

పిల్లలు ఆమెనే చూస్తూ కొంచెం దూరంలో నిల్చున్నారు.

"రండి, పిన్నమ్మ దగ్గరకు రారూ మీరు?"

అబ్బాయి "పిన్ని చెడ్డది, మాట్లాడకండి అని అమ్మ చెప్పింది." అన్నాడు.

ఎవరో బల్లెంతో పొడిచినట్టయింది మాధవికి.

"నేను చెడ్డదానిలా కనబడుతున్నానా?"

"లేదు" అంది అమ్మాయి.

"అయితే రండి."

మాధవి వారిద్దరినీ మెట్టుమీద తనకు చెరో వేపునా కూర్చోబెట్టుకుంది. ('ప్రతర్దనుడూ, వసుమంతుడూ ఉంటే ఇలాగే కూర్చోబెట్టుకునే దాన్ని') వారిని ముద్దాడింది.

"రండి మా ఇంటికి. పళ్లు ఇస్తాను."

పిల్లల్ని తన ఇంటికి తీసుకుని వచ్చి వెండి గిన్నెలోని అంజూరపు పళ్ళు తీసిచ్చింది. కొత్తగా దొరికిన స్వేచ్ఛను అనుభవించిన ఆ పిల్లలు పళ్లు కొరుక్కుని తిని "పళ్ళు తియ్యగా వున్నాయి పిన్నీ" అన్నారు.

అంతలో మహారాణీ దాసీ లిద్దరు అక్కడికి పరిగెత్తుకుని వచ్చారు. పిల్లలు పండు తింటూండటం చూసి కంగారుగా, "అయ్యో తినకండి, వద్దు" అని కేకలు పెట్టారు.

"తిననివ్వండి. మీరెందుకు అడ్డం వస్తారు?" అంది మాధవి.

"ఇక్కడేమీ తినగూడదని మహారాణీగారు చెప్పారు. ఈ విషయం తెలిస్తే మమ్మల్ని తిడతారు" అంటూ దాసీలు పిల్లల చేతిలో మిగిలిన పండు తీసి పారేశారు. తమ కొంగుతో వారి నోళ్లు తుడిచి, కంగారుగా వారిని మహారాణి గృహానికి తీసుకుని వెళ్ళిపోయారు.

బాధతో మాధవికి భూమిలోకి పడినట్లయింది. మహారాణి అనుమానించే లాంటి పనేం చేసింది తాను? ఇది ఉత్త అసూయేనా? లేక తనకు వ్యతిరేకంగా ఇక్కడేమయినా కుట్ర జరుగుతోందా?

బయట గాలీ, వానా మొదలయ్యాయి. వాటి దాడికి ఉద్యానవనంలోని చెట్లన్నీ ఊగిపోతున్నాయి. పొడిగా వున్న నేల ఒక్క నిమిషంలో బురదమయ మయింది.

అయోధ్యలో కాని, కాశీరాజ్యంలో కాని ఇంత ఒంటరిగా ఎప్పుడూ లేదు తాను ఆత్మీయంగా మట్లాడేవాళ్ళు ఒకరిద్దరయినా ఉండేవారు. ఇక్కడ ప్రేమ లేకపోగా ద్వేషంకూడా! గర్భిణియైన తన్ను ఏం కావాలి అని కనుక్కున్న వాళ్ళెవరూ లేరు. రాజవైద్యులిచ్చిన లేహ్యం. ఓషధులను దాసీల బలవంతానికి తీసుకోవటమే కాని దానివల్ల తనకు మంచి జరుగుతుందని నమ్మకం కూడా లేదు. "నా వలపుల రాణీ" అని ముద్దుచేసిన రాజు ఇప్పుడు అపరిచితుడై పోయాడు. మహిషి వచ్చిన దగ్గర్నుండి మహారాజు తనవేపుకు రానేలేదు. అదీ మంచిదే. అతని సరసంలో తనకు ఆసక్తి కూడా లేదు.

కడుపులోని బిడ్డ గట్టిగా కదిలి తన ఉనికిని గుర్తు చేసిందామెకు. మాధవి మెల్లిగా కడుపు చేతితో నిమురుకుంది. బిడ్డకాళ్ళూ చేతులూ ఆమె చేతికి తగిలేసరికి ఆమె ఒళ్ళంతా పులకరించింది. ఈ బిడ్డయినా తనకు మిగిలితే ?! దీన్ని ఉశీనరుడికిచ్చి తాను బికారిలా వెళ్ళదిమారు. ఆడిన మాట తప్పితేనేం? రాజుకింకా పిల్లలున్నారు. తన బిడ్డను తానీ మారు తనతో తీసుకుని వెళ్ళటం ఖాయం! అరిచి

గోలపెట్టి, దెబ్బలాడయినా సరే. తాను ఓటమి సంగీకరించదు. మాధవి ధైర్యంగా కిటికీలోంచి బయటకు చూసింది. వాన నిల్చింది.

సాయంత్రం మాధవి గృహానికి మహారాణి ఓ పదిమంది దాసీలతో విచ్చేసింది. ఆమె ఎర్రబడిన ముఖం ఆమె ఉద్రేకంలో ఉందని స్పష్టం చేస్తోంది.

రాణి మాధవి ముందు నిల్చుని గట్టిగా కేకలు వేయసాగింది.

"నా పిల్లలకు విషం పెట్టావా? నీ చేతులు పడిపోనూ!"

"నామీద వొట్టు. అలాంటి పనేం చెయ్యలేదు మహారాణీ!"

"నువ్విచ్చిన పండు తిని వచ్చిన పిల్ల లిప్పుడే వాంతి చేసుకున్నారు. నీ పాటికి నువ్వుండకూడదూ? నా పిల్లల జోలికెందు కొస్తావ్!"

"మహారాణి. విషం నేను తీసుకుంటే తీసుకోవాలి కాని ఇంకొకరి కెందు కిస్తాను చెప్పండి?"

"అలాగయితే తీసుకో. నీ కడుపులోని బిడ్డ నాశనం కానీ!"

మాధవి జుట్టు పీక్కుని కేకలు వెయ్యసాగింది.

"అయ్యో వద్దు. అలా శపించకండి. అది బ్రతికేది మీ వద్దే. నా బిడ్డకు శాపం వెయ్యకండమ్మా. వెయ్యకండి!"

"పిచ్చిదానిలా కేకలేస్తోంది" మహారాణి వ్యంగ్యంగా పలికి క్రూరంగా చూసింది మాధవి వేపు. లోపలున్న కోపం, బాధ అంతా ఒక్కమారుగా మాధవి బుర్రలోకి దూరి కోలాహలం చేశాయి. ఆమె పెద్దగా కేకలు వెయ్యసాగింది.

"అయ్యో, నా బిడ్డకు విషం పెట్టేశారమ్మా...వద్దూ...వద్దూ...అది దిక్కులేని బిడ్డమ్మా..."

ఆమె అలా కేకలు పెట్టేసరికి దాసీలందరూ ఆమె చుట్టూ మూగారు. కాని దగ్గరకు వెళ్ళటానికి మాత్రం ఎవరికీ ధైర్యం లేకపోయింది.

ఆరోజు పనంతా ముగించుకుని ఇటు వస్తున్న రాజుకు మాధవి కేకలు వినిపించాయి.

"మహారాజుగారు విజయం చేస్తున్నా" రన్న కేకతో దాసీలు అతనికి త్రోవ చేశారు. ఉశీనరుడు మాధవి దగ్గరకొచ్చి, భుజం మీద చెయ్యివేసి ఓదార్చటానికి ప్రయత్నించాడు. సాధ్యం కాలేదు.

"రాజ వైద్యులను పిల్చుకురండి" అని ఆజ్ఞాపించాడు.

బిడ్డ ఇంకా పుట్టనేలేదు. ఇలా ఎందుకు మాట్లాడుతోంది అన్న ప్రశ్నకు అతనికి జవాబు దొరకలేదు. ఈ సందడిలో మహారాణి అంతఃపురానికి వెళ్ళిపోయింది.

రాజ వైద్యులు వచ్చి మాధవి నాడి చూసి పరీక్షించి "ఉష్ణపిత్తం నెత్తికెక్కింది. అంతే మహాప్రభూ" అని రాజుతో చెప్పారు.

"దానికేం చేస్తారు ?"

"చూర్ణమిస్తాను. బాగా నిద్రపోతే అంతా సర్దుకుంటుంది."

వారిచ్చిన చూర్ణాన్ని పాలలో కలిపి బలవంతంగా మాధవి చేత తాగించారు. వెంటనే గాఢ నిద్రలోకి జారుకుంది మాధవి.

• • • •

ఓ నెల గడిచింది. మాధవి ఆరోగ్యం కొంచెం కుదుటబడింది. కాని మరింత మౌని అయింది ఆమె.

ఓరోజు కొత్త అంతఃపురం నుండి తోటలోకి తన సఖులతో వచ్చిన మహిమ ఓ ఆసనం మీద మాధవి కూర్చుని ఉండటాన్ని చూసింది. ఆమె అపూర్వ సౌందర్యవతి అని విని మనసులో ఈర్ష్య కలిగింది మహిమకు. ఈ మధ్య ఉశీనరుడు "మాధవికి మానసికమైన ఆరోగ్యం లేదు" అన్నమాట ఆమెకు చాలా సంతోషాన్ని కలగజేసింది. ఇప్పుడు మాధవి ఎదురుగుండా కనిపించేసరికి అహంకారంతో కళ్ళుమూసుకుపోయిన మహిమ ఆమెను నిందించటానికి వెనుకంజవేయలేదు.

"ఏమి అద్భుత రూపమబ్బా ఇది? ముందుకొచ్చిన కడుపు చూడటానికి రెండు కళ్ళూ చాలవు."

మాధవి ఆశ్చర్యంతో మహిమవేపు తిరిగింది.

"అందం ఉంటే చాలునా? ఒకరు కాదు ఇద్దరు కాదు ముగ్గురు రాజులతో ఎలా జీవితం గడిపిందో? ఛీ అసహ్యం!"

సహజంగానే మాధవికి కోపం వచ్చింది. లేచి, కన్నెర్ర చేసి "నీ పాటికి నువ్వుండు. నా జోలి కొచ్చావంటే చూసుకో" అంది.

"ఏం చేస్తావు చూద్దాం! నీలా బ్రతకటంకన్నా చావటం నయుం!" అంటూ మహిమ చకచకా అక్కడ నుండి వెళ్ళిపోయింది.

చావటం మంచిది. అందరూ ఎందుకు తన చావునే కోరుకుంటారు? నేను బ్రతికి ఉన్నది మాత్రం ఎందుకు? ఎవరికీ అక్కర్లేని జీవితం ఇలా గడపటం కన్నా ఒక్కమారుగా ఈ జీవితాన్ని అంతం చేసేస్తే? ఇలా రకరకాల ఆలోచనలు వచ్చాయి. మాధవి కొంగుతో ముఖం కప్పుకుని ఏడవసాగింది.

దగ్గర్లోనే వున్న వృద్ధ దాసి అన్నది: "అమ్మా ఏడవటం మీ వంటికి మంచిది కాదు. వద్దు. ఆ పాడు ముఖం దానికి బోలెడంత సారె తెచ్చానని అహంకారం. దీని తండ్రి యుద్ధం మొదలెట్టకపోతే నా పిల్లలు చనిపోయేవారే కాదు."

ఆ రోజు సాయంత్రం చీకటి పడుతుండగా మాధవి అంతఃపురం వెనక వున్న లోతైన చెరువు దగ్గరకు వెళ్ళింది. చుట్టూ ఎవరూ లేకపోవటాన్ని గమనించి త్వరగా మెట్లు దిగింది.

"దేవుడా, వచ్చే జన్మలో నయినా నేను ప్రేమించిన వాణ్ని పెళ్ళి చేసుకునే అదృష్టాన్నివ్వు" అంటూ నీట్లోకి దూకింది.

ఆ చప్పుడు విని పక్కనే అరుగు మీద కూర్చున్న దాసీ వచ్చి మునుగుతూ లేస్తూ వున్న మాధవిని చూసి కేకలు పెట్టింది. క్షణంలో జనం చేరారు. సేవకుడొకడు మాధవిని తెచ్చి పచ్చిక మీద పరుండ బెట్టాడు. అంతలో రాజవైద్యుల వారొచ్చారు.

"బ్రతికాం! ఇదిక్కడ చచ్చి పిశాచమయి మనల్ని వేధించటం తప్పింది" అని నిట్టూర్చింది మహారాణి.

ఉశీనరుడికూడా మాధవి ఇటీవల ప్రవర్తిస్తున్న తీరుకు చాలా చిరాకు కలిగింది. "త్వరగా ఈమెను ఇక్కణ్నించి పంపిస్తే చాలు" అని మనస్సులోనే అనుకున్నాడు.

మార్గశిర మాసం బహుళ పాడ్యమినాడు మాధవికి మూడవ బిడ్డ పుట్టింది. మహారాజుకు మగపిల్లవాడు పుట్టినందుకుగాను రాజధానిలో ఏమీ ఉత్సవాలు జరగలేదు. పిల్లవాడి జాతకం రాసిన పురోహితులు రాజుతో చెప్పారు.

"ఈ శిశువుకు శిబి అని నామకరణం చేయి మహారాజా. ఇతనికి మహా చక్రవర్తి అయ్యే యోగం వుంది. అదీగాక ఇంద్రుణ్ణి మించే దానశూరుడవుతాడితడు."

ఉశీనరుడికి అది విని సంతోషమూ కలగలేదు. చిరాకూ కలగలేదు.

బిడ్డ పుట్టిన ఓనెలలో గాలవుడొచ్చాడు. అతని ముఖంలో కళాకాంతులు లేవు.

"మహారాజా. నా అదృష్టం బాగున్నట్టులేదు. ఈ సంవత్సరమంతా చుట్టు పక్కల రాజ్యాలన్నీ తిరిగాను. నాకు కావాల్సిన అశ్వాలు ఇంకెక్కడా దొరకవుట."

"అలాంటివి దొరక్కపోతే మరోరకం ఇవ్వండి. మీ గురువుగారు మాత్రం గవన్నీ పెట్టుకుని ఏం చేస్తారు?" అన్నాడు మహారాజు.

"అడిన మాట తప్పలేను మహారాజా!"

"అలా అయితే ఏం చేస్తారు మీరు? మాధవిని మీరు తీసుకుని వెళ్ళచ్చు."

"నేను ఇలా అనుకుంటున్నాను. ఇంకో రెండువందల గుర్రాలకు బదులుగా మాధవినే గురువుగారికి అర్పిస్తే ఎలాగుంటుంది అని!"

నేను అనుభవించిన దానిని ఆ ఋషికూడా అనుభవించనీ అనుకుంటూ ఉశీనరుడు "మంచి ఆలోచనే" అన్నాడు.

"మహారాజా నీ వల్ల నాకింకో ఉపకారం కావాలి. అయోధ్యరాజు, కాశీరాజు కూడా రెండు రెండు వందల గుర్రాలను ఇస్తామని వాగ్దానం చేశారు. వారిద్దరికీ కూడా సందేశం పంపాలి. నీ దూతలు సందేశం తెలిపి అశ్వాలను ఇక్కడికి తోడ్కొని రావాలి ఈ సహాయం చేస్తే నీ వంశానికి సకల శ్రేయస్సూ కలిగేలా నేను ప్రార్థన చేస్తాను."

రాజాజ్ఞ ప్రకారమే గాలవుని సందేశం తీసుకుని ఇద్దరిద్దరు దూతలు అయోధ్యా నగరానికి, కాశీకి బయలుదేరారు. దూతలు వెనక్కి రావటానికి ఓ నెల పడుతుంది. అంతవరకూ గాలవుణ్ణి తన భవనంలోనే ఉండమని సూచించాడు ఉశీనరుడు. అడవుల్లో తిరిగి అలసిపోయిన గాలవుడు సంతోషంగానే ఒప్పుకున్నాడు.

ఓ రెండు రోజులు గడిచాక "నేను మాధవిని చూడవచ్చునా?" అని గాలవు డడగగా రాజు దాసి చేత మాధవికి కబురు పంపాడు.

"గాలవుల వారితో మాట్లాడాలన్న కోరిక నాకు లేదు. వారు రావాల్సిన అవసరం లేదు" అని జవాబు పంపింది మాధవి.

బిడ్డ పుట్టినప్పటి నుండి వృద్ధదాసి మాత్రమే ఆ శిశువును చూసుకోవాలి, మాధవి వద్ద వదలకూడదని కచ్చితంగా చెప్పాడు ఉశీనరుడు. మాధవి కూడా గుండె రాయి చేసుకుంది. బిడ్డను చూడాలని అడగను కూడా అడగలేదు. అయితే బయలుదేరే రోజు మాత్రం బిడ్డనోమారు ముద్దిడుకుని నిడుస్తూ దాసి చేతి కిచ్చింది. ఎవరితోనూ వెళ్ళి వస్తానని చెప్పలేదు. ఉశీనరుడి పరిచయమే లేనిదానివలె ముందుకు నడిచి తనకోసం సిద్ధంగా వున్న రథంలో కూర్చుంది.

ముందూ వెనుకా గుర్రాలు. మధ్యన సారథి తోలుతున్న రథం. ఆ విశాలమైన రథంలో ఓ మూల మాధవి, మరో మూల గాలవుడు. వారిద్దరి మధ్యా మౌనపు అగాధం.

# 22

అధ్యయన శాలలో ఆలోచిస్తూ కూర్చున్న విశ్వామిత్రుడికి ఉన్నట్టుండి గుర్రపు డెక్కల చప్పుడు దూరంగా ఎక్కడ నుంచో వినిపించినట్టయి లేచాడు. తలుపు వద్దకు వచ్చి జాగ్రత్తగా విన్నాడు. సందేహం లేదు. కాని ఈ మధ్యాహ్నపు వేళ ఏ రాజు వస్తున్నాడబ్బా కబురు పంపకుండా రాజులెవ్వరూ తన సందర్శనానికి రారే. కాని ఎవరయినా శత్రువులు? విశ్వామిత్రుడని పేరు పెట్టుకున్న తనకు ఓ విధంగా చూస్తే శత్రువులే లేరు. అతను ఆవరణలోకి అడుగు పెట్టాడు. మళ్ళీ పాత సంఘటన ఒకటి గుర్తొచ్చింది. వశిష్ఠులవారు తనకు కామధేనువు నివ్వలేదన్న కోపంలో రాజర్షియైన తాను అతని ఆశ్రమం మీదికి దండెత్తి పోయాడు. తానే ఓడిపోయాడు నిజమే. కాని ఇప్పుడు...?

భోజనశాలలో శిష్యులు భోజనానికి ఆరిటాకులు వేసే పనిలో నిమగ్నులై వున్నారు. కనుక వారికి ఆ శబ్దం వినిపించి వుండకపోవచ్చు. గురువుగారు వచ్చారేమని ఆశ్చర్యంతో చూశారు వారు.

"సువర్ణా, దూరంగా గుర్రాలడెక్కల చప్పుడు వినిపిస్తోంది. కాస్త చూసిరా" అన్నాడు విశ్వామిత్రుడు.

"ఓ పెద్ద బండ ఎక్కి చూడు. ఓ యోజనం దూరంలో వున్నా కనిపిస్తుంది" అంటూ మనుస్వతుడూ అతని వెనకే నడిచాడు.

భోజనపు ఏర్పాట్లు వదిలిపెట్టి అందరూ వారితోనే నడిచారు. సువర్ణుడు ఓ పెద్ద బండ ఎక్కి నిల్చున్నాడు. ఎండకు చెయ్యి అడ్డం పెట్టుకుని శబ్దం వినిపిస్తున్న నైరృతి దిక్కుగా చూశాడు.

"అవును. సైన్యమే. గుర్రాలు కూడా వున్నాయి."

"యదూ, నువ్వుకూడా ఎక్కిచూడ. సువర్ణుడు చెప్పింది నమ్మటం కష్టం."

నూనూగు మీసాల యువకుడు యదువుకూడా బండఎక్కి చూసి, "నిజమే. సందేహం లేదు" అని చెప్పాడు.

గడియలో గుర్రాల సేన వారికి దగ్గరికే వచ్చింది. రథం ఒకటి ముందుగా వచ్చి ఆశ్రమం బయట ఆగింది. దానిలోంచి ముని ఒకడు దిగి వారివేపే రాసాగాడు.

"గాలవుడిలా ఉంది మనుష్వతా."

"మన గాలవుడు! వీడు రాజెప్పుడయ్యాడబ్బా!"

"అడుగుదాం ఉండు."

ఆ బండ దిగి అందరూ ముందుకు వెళ్ళి గాలవునికి ఎదురువెళ్ళారు. సువర్ణ, మనుష్వతులయితే పరిగెత్తుకెళ్ళి కౌగలించుకున్నారు. కొత్తవాళ్ళు వార్ని ఆశ్చర్యంతో చూశారు.

"రథంలో ఎవరో స్త్రీ ఉన్నది" అని మాట్లాడుకున్నారు.

గాలవుడు విశ్వామిత్రుడి వద్దకు వచ్చి సాష్టాంగ ప్రణామం చేశాడు.

"దీర్ఘాయుష్మాన్‌భవ" అని దీవించిన విశ్వామిత్రుడు "ఎన్ని సంవత్సరాలయిందయ్యా నిన్ను చూసి. క్షేమమేనా!" అని ప్రశ్నించాడు.

"మీ దయవల్ల క్షేమమే. ఈ నాలుగు సంవత్సరాలు నేను మీకు అర్పించాల్సిన గురుదక్షిణ సంపాదలోనే గడిచింది గురుదేవా."

"ఓ! మర్చేపోయాను. ఈ గుర్రాలు అవేనా? ఏదీ చూద్దాం పద" అంటూ విశ్వామిత్రుడు ఆశ్రమం బయటకు వచ్చి నిల్చున్నాడు.

"అక్కడ వరసగా నిలబడ్డ ఒకేరంగు గుర్రాల్నిచూసి విశ్వామిత్రుడి శరీరం ఒక్కమారు పులకరించింది. అప్పుడే ఆ పక్కనే ఆపిన రథంలో కూర్చున్న స్త్రీ అతని కంటబడింది. అతను గాలవుని వేపు తిరిగి–

"నీ భార్యా ?" అని ప్రశ్నించాడు.

"కాదు. ఆమె విషయం చెప్తాను రండి. ఇక్కడెందుకు? లోపలకు పోదాం."

అతని ఉద్దేశం గ్రహించిన విశ్వామిత్రుడు "అధ్యయన శాలకు పోదాం" అంటూ మిగిలిన శిష్యులతో "మళ్ళీ వంట చేయాలి. ఇప్పుడు సిద్ధంగావున్న వంటకాలను గుర్రాలతో వచ్చిన దూతలకు వడ్డించేయండి. మనం రెండో బంతిలో కూర్చుందాం" అని గాలవునితో ముందుకు నడిచాడు.

"కట్టెలు తెండి. ఇంకో రెండు పొయ్యిలు వెలిగించి అన్నానికి ఎసరు పెట్టండి. త్వరగా కావాలి" అంటూ మనుస్వతుడు తక్కిన శిష్యులకు ఏ పని చెయ్యాలో చెప్పసాగాడు. దూరంగా నిల్చున్న దూతల వద్దకు వెళ్ళి "మీరందరూ నదిలో చేతులూ కాళ్ళు కడుక్కుని రండి. భోజనం చేద్దురుగాని, బాగా ఆకలిగా వుండి వుండాలి మీకు" అన్నాడు.

అధ్యయన శాలలో గురు శిష్యులిద్దరూ కృష్ణాజినాల మీద కూర్చున్నారు. గాలవుడు తాను ఆశ్రమం వదిలిన నాటినుండి జరిగినదంతా వివరించాడు.

"ఇక మిగిలిన రెండువందల గుర్రాలకు బదులుగా మాధవినే మీకు అప్ప జెబుతున్నాను" అని ముగించాడు.

విశ్వామిత్రుడు ఆలోచిస్తూ అన్నాడు-

"ఎనిమిది వందల గుర్రాలకు బదులుగా ఈ మాధవినే స్వీకరించండి అని ఈమెను మొదటే వదిలిపెడితే ఎంత బాగుండేది. నేనే ఆమెను జీవిత పర్యంతం భోగించి జగత్తుకే శ్రేష్ఠులయిన నలుగురు పుత్రులను పొందేవాడిని కదా! కానీ. జరిగిందేదో జరిగిపోయింది. ఈమెవల్ల ఒక్కడే కొడుకును పొంది ఆ తర్వాత మాధవిని నీకు అప్పగించేస్తాను."

ఆ మాటవిని గాలవుడికి, ఇంత సులభంగా తేలిపోయే సమస్య కోసం తానెంత కష్టపడ్డాడో తల్చుకుంటే చాలా బాధ కలిగింది.

"నాకది తోచలేదు గురువర్యా" అన్నాడు.

"ఫర్వాలేదులే. రథంలో మాధవి ఒక్కతే కూర్చున్నట్టుంది. వెళ్ళి పిలుచుకుని రా."

అరక్షణంలో మాధవీ, గాలవులు విశ్వామిత్రుడి వద్దకు వచ్చారు.

"మా గురువుగారు, నమస్కరించు మాధవీ" అన్నాడు గాలవుడు.

ఈ విశ్వామిత్రుడివల్ల కాదూ తనకీ గతి పట్టింది? అనుకున్న మాధవి, గాలవుడిమీద పెంచుకున్న కోపమంతా తన కళ్ళలోంచి నిప్పులు రాలుతుండగా పెదవులు ముడుచుకుని, తన అయిష్టతను వ్యక్తం చేస్తూనే చేతులు జోడించింది.

"మహా పొగరుబోతు పిల్లలా ఉంది. దీన్ని లొంగదీయటం చాలా బాగుం టుంది" అనుకున్నాడు మనసులోనే విశ్వామిత్రుడు.

"ప్రయాణంలో అలసి పోయుండాలి కదూ నువ్వు. పక్కనున్న అతిధి శాలలో విశ్రమించు. వెళ్ళు గాలవా, ఆమెకు గది చూపించు."

మాధవి అతిధి శాలలో దర్భల చాపమీద ముడుచుకుని కూర్చుంది. కాస్సే పయ్యాక అక్కడే కాళ్ళు చాచుకుని పడుకుంది. అలాగే నిద్రలోని జారుకుంది.

నదిలో చేతులు కాళ్ళు కడుక్కొని వచ్చిన దూతలకు భోజనోపచారాలయి నాయి. రాజగృహంలో భోంచేసిన వారికి ఆశ్రమంలో భోజనంలో విశేషమయిం దేమీ లేదు. కాని సుపర్ణుడు పళ్ళెంలో తెచ్చిన పండిన అరటి పళ్ళను ఒక్కొక్కరు రెండు మూడు తిన్నారు.

"ఎంత బావున్నాయి. మన ఊళ్ళో ఇలాంటివి ఎప్పుడూ తినలేదు" అని అనుకున్నారు.

"ఇవాల్టికి మా ఆశ్రమంలో విశ్రాంతి తీసుకోండి. రేపు ఉదయం మీ ఊరికి బయలుదేరవచ్చును" అన్నాడు విశ్వామిత్రుడు.

దూతల నాయకుడు వినమ్రంగా-

"మహారాజుగా రాజ్ఞాపించారు, పని కాగానే తిరుగు ప్రయాణం కట్టమని. ఇవాళే బయలుదేరుతాం మేము. అలా అయితే ఎల్లుండి ఉదయం ఊరికి చేరచ్చు" అన్నాడు.

"మీ ఇష్టం."

రథం ముందు నైరృతి దిక్కుకు బయలుదేరింది. దాని వెనకాలే తమ నల్ల గుర్రాల నెక్కి దూతలు వెళ్ళారు.

తమ అందరి భోజనాలయ్యాక ఆవరణలో చెట్టు నీడలో స్నేహితులతో కబుర్లకు కూర్చున్నాడు గాలవుడు. ఆశ్రమంలో నాలుగేళ్ళ కిందట శిష్యులుగా

వున్నవారిలో కొందరు విద్యాభ్యాసం ముగించి వెళ్ళిపోయారు. కొంతమంది కొత్తవారు చేరారు.

"నీదీ, సువర్ణుడిదీ విద్యాభ్యాసం ఎప్పుడు పూర్తవుతుంది?" అని గాలవుడు మనుస్వతుని అడిగాడు.

"మాది పూర్తికావడమనే మాటే లేదు. మేమీ ఆశ్రమంలో శాశ్వతంగా ఉండిపోతాం. అందరూ యాగం ఇష్టి చేయటానికి వెళ్ళిపోతే ఆశ్రమం ఏం కావాలి?" నవ్వుతూ అడిగాడు మనుస్వతుడు.

"బాగుంది. గురువుగారీ మధ్యలో ఎక్కడికయినా వెళ్ళారా?"

"ఓ ఏడు తపస్సుకని హిమాలయాలకు వెళ్ళిపోయారు. రెండు మూడుమార్లు యాగాలకని వేరే రాజ్యాలకు వెళ్ళివచ్చారు. అన్నట్టు గాలవా, నువ్వెన్ని యజ్ఞ యాగాలు చేయించావయ్యా?"

గాలవుడు తలవంచుకుని అన్నాడు:

"ఒక్కటీ లేదు. ఇన్ని సంవత్సరాలూ గురుదక్షిణ సంపాదించటానికని నాలుగు రాజ్యాలూ చుట్టటంతో సరిపోయింది."

ఇంతలో యదువు అక్కడికి వచ్చి "భగవతిగారికి అతిథిశాలలోకే భోజనం తీసుకుని వెళ్ళనా?" అనడిగాడు.

"ఏమిటి? మాధవి భోజనం ఇంకా కాలేదా? వెళ్ళు, వెళ్ళు మొదట ఆమెకు భోజనం తీసికెళ్ళు. మానవ బుద్ధి చూడు. మన కడుపు నిండగానే ఇంకొకళ్ళ విషయమే మర్చిపోతుంది."

యదువు పళ్ళెం తీసుకుని వెళ్ళగానే మనుస్వతుడు చిన్న గొంతులో అడిగాడు. "ఈమె ఎవరు?"

"యయాతి రాజు కూతురు మాధవి. ఇక ఒక్క సంవత్సరం ఇక్కడే వుంటుంది, మీకు భగవతిగా."

"అలాగా!"

"అయితే గాలవుడూ మనతోనే ఈ సంవత్సరకాలం ఉంటాడన్న మాట." అన్నాడు సుధర్ముడు.

"లేదు. నేను రేపే బయలుదేరుతాను. ఆత్మశుద్ధి కోసం ఓ సంవత్సరం తపస్సు చేసి తర్వాత వెనక్కి వస్తాను. మాధవిని ఆమె తండ్రికి అప్పజెప్పేస్తే నా బాధ్యత తీరినట్టే. తర్వాత ఈ గొడవలూ బాధ్యతలూ లేకుండా ఉండి పోతాను."

రావి ఆకులనే చూస్తూ గాలవుడు అక్కడే పడుకున్నాడు.

"అలిసి పోయావు. కొంచెంసేపు నిద్రపో, శిష్యులందరి భోజనం అయిందో లేదో చూసి వస్తాను" అంటూ లేచాడు మనుష్యతుడు.

యదువు అతిథిశాల తలుపువద్దే నిల్చుని, "భగవతీ, భగవతీ" అని పిల్చాడు.

మాధవికి మెలకువ వచ్చింది. తలుపు వద్ద ఎవరో నిల్చున్నట్టు తెలిసింది. కాని అతడు ఎవర్ని పిలుస్తున్నాడో తెలియలేదు.

యదు మళ్ళీ "భోజనం చల్లారి పోతోంది. లోపలకు తెచ్చి పెట్టనా భగవతీ?" అన్నాడు.

తాను— భగవతా? మాధవి ఓ క్షణం కంగారు పడింది. తనలాంటి పతితకు భగవతి అయ్యే అధికారం వుందా?"

ఆమెనుండి జవాబు లేకపోవటంతో యదు లోపలకు వచ్చి ఆమె ముందు భోజనపు పళ్ళెం పెట్టాడు. వద్దు అందామని అనుకుంది ఓ క్షణం. కాని ఆకలితో కడుపులో ఎలుకలు పరిగెడుతున్నాయి. అత నిచ్చిన నీటితో చేతులు కడుక్కుని వచ్చి భోజనానికి కూర్చుంది మాధవి.

"ఇక్కడే బయటే వుంటాను. ఏమయినా కావాలంటే పిలవండి."

"నీ పేరేమిటి ?"

"యదు."

ఓ మారు తలెత్తి చూసింది మాధవి. ఇంకా నూనూగు మీసాల యువకు డతను. తన తమ్ముడి పేరు గలవాడు. యదు ఈపాటికి ఈ వయస్సు వాడయి ఉంటాడా?

"ఏ వూరు నీది ?"

"పల్లవ రాజ్యం."

మాధవి భోంచేయ సాగింది. ఉత్త అన్నం, పప్పు. నెయ్యి, పెరుగు. ఎక్కడా ఆడవాళ్ళు కనిపించలేదు. కనుక మగవాళ్ళ వంట. అయినా రుచిగానే వుంది.

భోజనమయ్యాక పళ్ళెం కడిగి యదువు చేతికిచ్చి నేల శుద్ధిచేసి అక్కడే పరిచిన కృష్ణాజినం మీద కూర్చుంది. ఆవరణలో అక్కడక్కడా శిష్యులు గుంపులు గుంపులుగా కూర్చుని వాద ప్రతివాదాలు జరుపుతున్నారు. గాలవుడు రావి చెట్టు నీడన పడుకుని నిద్ర పోతున్నాడు. జింక ఒకటి దూసుకుని వచ్చి అందరి మధ్య లోంచి దూరి మళ్ళీ అడవిలోకి మాయమయింది.

చెట్ల నుండి చల్లటిగాలి వీస్తోంది. కడుపు నిండడంతో ఆమెకు మళ్ళీ కునుకు వచ్చింది.

మెలకువ అయ్యేసరికి సాయంకాల మయింది. మనుస్యతుడు తలుపు వద్ద నుండి తొంగి చూసి,

"భగవతిగారికి ఏమయినా కావాలా?" అనడిగాడు.

"ఏమీ వద్దు."

"మూలలోని గూట్లో చేతి దీపం వుంది. దాన్నిలా ఇవ్వండి. సంధ్యా హోమం అయ్యాక అది వెలిగించి తెస్తాను."

మాధవి ప్రమిదను అతని కిచ్చి బయటకు వచ్చింది. లోపలే కూర్చుని కూర్చుని విసుగు పుట్టిందామెకు. సాయంత్రపు గాలి ఆహ్లాదకరంగావుంది. మల్లె, మొల్ల, మాలతి చెట్ల మొగ్గలు విచ్చుకుంటున్నాయి. ఎత్తైన చెట్లపై గూళ్ళు కట్టుకున్న పక్షులు గూటికి మరలుతూ రకరకాల రాగాలు శృతి చేస్తున్నాయి. గోశాలలో ఆవులు అంబా అని పిలుస్తున్నాయి. శిష్యులు అగ్నిశాలలో చేరారు. మంత్రాల సామగానం ఆ ప్రశాంత వాతావరణాన్ని ఆవరించింది. విశ్వామిత్రుడు అగ్నికుండం ముందు కూర్చుని సమిత్తు, నెయ్యి అగ్నిదేవునికి అర్పిస్తున్నాడు. ఆ వెలుగులో పొడుగాటి గడ్డం, పైకెత్తి కట్టిన శిఖ, మెడలోని రుద్రాక్షమాల కొట్టొచ్చి నట్టు కనిపిస్తున్నాయి.

సంధ్యా హోమం పూర్తయ్యేసరికి బాగా చీకటి పడింది. మనుస్యతుడు దీపం వెలిగించుకుని వచ్చి మాధవి గదిలో పెట్టాడు.

"రాత్రికి భోజనం చేస్తారా? పాలూ పండ్లు చాలా ?"

"పాలూ పండ్లు చాలు" అంది మాధవి.

రాత్రయ్యేసరికి శిష్యుల భోజనం పూర్తయింది. అందరూ వారి వారి పర్ణ కుటీరాలకు వెళ్ళిపోయేసరికి ఆశ్రమమంతా నిశ్శబ్దమయింది. ఆకాశంలో పున్నమి దగ్గర పడిన చంద్రుడు కనిపించాడు. పాలుతేనె కురిసినట్టు వెన్నెల ఆశ్రమపు చెట్టూ చేమల మీద్గా, ఆవరణ అంతా పడుచుకుంది.

మాధవికి వెన్నులోంచి వణుకు పుట్టుకొచ్చింది. ఇక్కడ తానొక్కతే నిద్ర పోవాలా? అడవి మృగాల భయం లేదూ? తలుపు మూసేయటం మంచిదేమో?

వెన్నెల్లో ఎవరో వచ్చి నిల్చున్నట్టయింది. ఎందుకో గాలవుడే వచ్చాడేమో నని భయం వేసింది. కంగారుతో "ఎవరూ?" అంది.

"నేను విశ్వామిత్రుడ్ని."

ఆమె మరింత భయంతో ఓ మూలచేరింది. విశ్వామిత్రుడు లోపలకు వచ్చి ఆమె దగ్గరే కూర్చుని ఆమె కుడిచేయి పట్టుకున్నాడు.

"వెన్నెల సాక్షిగా నువ్వివ్వాల్టి నుండి నా భార్యవు" అన్నాడు.

అతని వంటినుండి ధూపపు వాసన వస్తోంది. గడ్డం మీసాల నుండి చెమట వాసన. అతని గుండెలకు ఆచ్ఛాదనం ఏమీ లేదు. మోకాలి వరకూ బిగుతుగా కట్టిన పంచ ఒకటే అతను ధరించిన వస్త్రం.

"చూడు, నువ్వు రాజభవనాల్లో ఉండి వచ్చావు. పేదవాడి ఆశ్రమం నీకు నచ్చుతుందో లేదో? కాని నా ప్రేమ మాత్రం నీకు యథేచ్ఛగా ఇస్తాను."

కామ ప్రేమలను యథేచ్ఛగా భుజించిన మాధవి గజగజా వణికిపోయింది. విశ్వామిత్రుడు తన బాహువులతో ఆమెను దగ్గరకు లాక్కుని తన బిగి కౌగిలిలో బంధించాడు. అతని చేతికున్న రుద్రాక్షమాలలు ఆమె శరీరానికి నొక్కుకుని నొప్పి పెట్టాయి.

ఆమె తడబడుతూ "వద్దు, ఇవాళ వద్దు" అంది.

విశ్వామిత్రుడు నవ్వి ఆమె ముఖాన్ని దగ్గరకు లాక్కుని పెదవులను బల వంతంగా చుంబించాడు. అతని గడ్డం మీసం ఆమె ముఖాన్ని కప్పేశాయి.

"కామాన్ని స్వేచ్ఛగా అనుభవించిన దానివి నువ్వు. అందుకే నీకు కోరిక లేదు. కాని నాకున్న ఆకలి ఎన్నో సంవత్సరాలది. దాన్ని తృప్తి పర్చకపోతే నాకు పిచ్చెక్కుతుంది!"

విశ్వామిత్రుడి ముఖం మరింత దగ్గరకు వచ్చినప్పుడల్లా మాధవికి పులి గుర్తొచ్చింది. తండ్రి ఇంటినుండి బయలుదేరాక ఓ ఆశ్రమంలో విశ్రమిస్తూండగా అపరాత్రివేళ గాలవుణ్ణి చూసినప్పుడూ ఇదే అనుభూతి కలిగింది. ఆకలిగొన్న పులిముందు బెదరిన లేడికూనకి పనే అవకాశం ఏది?

# 23

అభ్యాస బలంతో విశ్వామిత్రుడు బ్రాహ్మీముహూర్తంలో లేచాడు. బయట ఇంకా కసుచీకటి ఉంది. తన పక్కన తుంగచాపమీద నిద్రిస్తున్న మాధవిని ఓ క్షణం లేపటమా వద్దా అని ఆలోచించాడు. మెల్లిగా ఆమె భుజం తట్టి "మాధవీ" అని పిలిచాడు.

మాధవి వెంటనే మేలుకుంది. ప్రక్కన చిరునవ్వుతో కూర్చుని వున్న విశ్వామిత్రుడ్ని చూసి ఓ క్షణం భయంవేసింది. నిద్రకంటితోనే "ఏమిటి?" అనడిగింది.

"ఏమీలేదు. ప్రాతఃకర్మలను చేయించటానికి నేను బయలుదేరుతున్నాను. నీకింత త్వరగా లేచే అలవాటు లేదు. లేవాలనుంటే లే. లేకపోతే ఇంకా కాసేపు పడుకో."

మాధవి లేచి కూర్చుంది. దర్భచాప ఒత్తుకుని వొళ్ళంతా నొప్పెడుతోంది. విశ్వామిత్రుడప్పుడే తలుపు వద్దకు వెళ్ళిపోయాడు. తలుపు తెరుస్తూ "నువ్వివాళ్టి నుండి ఆశ్రమపు యజమానురాలివి. నీకేం పని కావాలన్నా శిష్యులు చేస్తారు. తెలిసిందా?" అన్నాడు.

మాధవి తడబడింది. "నేను యజమానురాలిని కాను. దాసీని. నేనేం పని చేయాలో చెప్పండి."

"ఏమీ వద్దు. అలా చూస్తూండు. కావాలంటే నీ కిష్టమయిన పనేదయినా చెయ్యి. దేనికీ బలవంతం ఏమీ లేదు" అని చెప్పి పెద్ద అంగలతో అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

మాధవి బయటకు చూసింది. శిష్యులుకూడా అప్పుడే లేచి తమ దినచర్య మొదలు పెట్టారు. గోశాలనుండి అంబా అన్న పిలుపు వినిపిస్తోంది. పక్షుల కిలకిలారావం ఆమెను పులకరింప జేసింది.

బయట నుండి వస్తున్న చలిగాలికి కృష్ణాజినాన్ని మరింత దగ్గరగా కప్పుకుంది. ఆశ్రమంలో అందరూ లేచివుండగా తానొక్కతే పడుకుని వుండటం బాగుండదు అనుకుని, కొంచెంసేపు అలాగే బద్ధకంగా కూర్చుని తర్వాత లేచి కృష్ణాజినం తీసిపెట్టి దర్భచాప చుట్టిపెట్టింది. గూట్లోని దీపం నూనె అయిపోవటంతో ఎప్పుడో ఆరిపోయింది. ముందు చేయాల్సిన పని స్నానం చేసి రావటం. రాజభవనంలో నయితే దాసీలు సుగంధ తైలాలు రాసి వేడినీళ్ళతో స్నానం చేయించేవారు. ఇక్కడ నది నీరే గతి.

మాధవి నారచీర ఒకటి తీసుకుని బయటకు వచ్చింది. ఆశ్రమం దాటి బయటకు వచ్చి నిల్చుంటే మంచుపొరల మాటులోనే పారుతున్న సరస్వతీనది కనిపించింది. నది అవతల ఎత్తుగా కనిపిస్తున్న దేవదారు వృక్షాలు. నది ఒడ్డున శిష్యులు స్నానాహ్నికాలు కానిస్తున్నారు.

అది తాను స్నానం చేయతగ్గ స్థలం కాదని వెంటనే అనిపించింది మాధవికి. మరోచోటు చూసుకుందామని మళ్ళీ ఆశ్రమం వేపు తిరిగిన మాధవికి యదువు ఎదురుపడ్డాడు.

"స్నానానికి బయలుదేరారా? ఆశ్రమం వెనుక రాళ్ళ మధ్యన చిన్న కొలనులా వుంది. నీళ్ళు ఎక్కువ లోతేం లేదు. అక్కడికి వెళ్ళవచ్చు మీరు" అన్నాడు.

తన మనస్సులోని ఆలోచనను ఎంత చక్కగా కనిపెట్టాడు— అని అతని తెలివితేటలను మెచ్చుకుంటూ ఆశ్రమం వెనకాలున్న చిన్న గుట్ట దిగింది. పది గజాలు వెళ్ళేసరికి యదు చెప్పిన చోటు కనిపించింది. రాళ్ళమధ్య నిల్చిన సరస్వతీ నది నీరు మడుగులా తయారయింది. చుట్టూ పెద్ద బండలుండటంతో బయటవారికి లోపల స్నానం చేసేవారు కనిపించరు. రాళ్ళమధ్యను విచ్చుకున్న పూలను ఆసక్తితో చూసింది. కొంచెం పైన జలజలా పారుతున్న నదిని చూసి సంతోషించింది. కారండవ పక్షి నదిలోకి దిగి తన ప్రియురాలితో విహరించసాగింది. మడుగు మీదుగా వంగిన కొమ్మలున్న పెద్ద పెద్ద చెట్లలోని కోయిలా, తీతువు, చిలకలు మృదువుగా పాడుతున్నాయి. తూరుపుదిక్కు ఎర్రబడ సాగింది. మాధవి నీట్లో దిగింది. నీరు గోరువెచ్చగా ఉంది. ఆమె వొళ్ళు తోముకుని స్నానం చేసి కట్టుకున్న

తడి నారచీర తీసి పొడిది కట్టుకుంది. చీర బండమీద వేసి ఉతికి పిండుకుని ఆశ్రమానికి తిరిగి వచ్చింది. అక్కడ ఓ చెట్టుకి మరో చెట్టుకీ మధ్యన కట్టిన పగ్గంమీద చీర ఆరవేసింది. తడి జుట్టు చివర ముడివేసి గోశాలవైపు నడిచింది.

సుపర్ణుడు పెద్ద పెద్ద పాత్రలలోకి పాలు పితికి గోవులను బయటకు తోలుతున్నాడు. వంటశాలలో పాలు కాచేపని సాగుతోంది. శిష్యులు సమిధలను, కాష్ఠాలను తీసుకుని అగ్నిశాలకు వెడుతున్నారు. అగ్నికుండం నుండి నల్లటి మబ్బులా వస్తోంది పొగ. దాని ముందు తిష్ఠవేశాడు విశ్వామిత్రుడు.

ఉదయం హోమం పూర్తయ్యాక అరటిపండ్లు, పాలు ఉపహారం. ఆతర్వాత అధ్యయన శాలలో శిష్యులు వేదమంత్రాలను ఉచ్చైస్స్వరంలో వల్లించ నారంభించారు. ఇంకొక గదిలో మరో గుంపు విద్యార్థులు పదక్రమాలతో కూడిన ఋక్కులను పఠించసాగారు. మరోచోట సుశ్రావ్యమయిన సామగానం, అధర్వ వేదం, సామవేదం, ఋగ్ యజుర్వేదాల పదక్రమయుక్త సంహితను పారాయణం చేస్తున్నారు.

ఆశ్రమ జీవనం మాధవి అంతవరకూ చూసినదానికి భిన్నమయిన వాతావరణం. ఇక్కడ శాంతి ఉంది. రాజభవనానికుండే గోడలు లేని ఈ ప్రపంచం విముక్తమైనట్టుంది. అంతా బాగుంది. కాని ఈ విశ్వామిత్రుడొక్కడు లేకపోతే ఎంత బాగుండేది అనుకుంది. అతడు లేకపోతే తానే ఆశ్రమంలో హోమం, యజ్ఞాలను చేయవచ్చా? ఆడదానికి ఆ అధికారం ఉందా?

రాజగృహంలోని భోగవస్తువు లన్నిటినీ గుర్తు తెచ్చుకుంది మాధవి. హంస తూలికా తల్పం, చామరాలు, రకరకాల తినుబండారాలు, కాళ్లూ చేతులూ పట్టే దాసీజనం, గానంచేసే, నర్తించే దాసీలు, కోరుకున్న వస్త్రాభరణాలు, వెండి బంగారు గిన్నెలు... ఇక్కడ ఏదీలేదు. ప్రకృతి మైమరచి నిద్రిస్తోంది. పాటే, నర్తించే పక్షులు, అందమే మూర్తీభవించిన వృక్షాలు, లతలూ, ఎంత ప్రశాంతమయిన జీవితం. ఇక్కడే ఉండిపోదాం. నగరజీవనం ఇక వద్దుగాక వద్దు అనుకుంది మాధవి. కాని తన భవిష్యత్తును నిర్ణయించుకునే హక్కు తనకు లేదన్న విషయం గుర్తుకొచ్చి మాధవికి ఎనలేని బాధ కలిగింది. బాధతో మళ్ళీ అతిథిశాలలోకి వెళ్ళి కృష్ణాజినం మీద కూర్చుంది.

రెండో జాము మొదలయ్యేసరికి శిష్యులందరూ వటవృక్షం కింద చేరారు. విశ్వామిత్రుడు ఎత్తైన చోట కూర్చుని ఆ రోజు పాఠ ప్రవచనం మొదలుపెట్టాడు.

"బ్రాహ్మణుడంటే ఏమిటి అన్న ప్రశ్న అనాది నుండి అందర్నీ వేధిస్తున్న ప్రశ్న. ఒక్కో కాలంలో ఒక్కొక్క వ్యాఖ్య వచ్చింది. తాను చెప్పిందే నిజమని ప్రతి విద్వాంసుడూ అనుకుంటాడు. కాని నిజం చెప్పాలంటే కామక్రోధాలను జయించినవాడే బ్రాహ్మణోత్తముడు. అతను పుట్టుకతో బ్రాహ్మణుడు కావాలన్న నియమం ఏమీలేదు."

ఈ మాట అని ఓ క్షణం ఆగాడు విశ్వామిత్రుడు. శిష్యులు ఈ విషయమై ఏమయినా ప్రశ్న అడుగుతారేమోనని కుతూహలంతో ఎదురు చూశాడు. తాను పుట్టుకతో క్షత్రియుడు. సాధనం వల్ల ఇప్పుడు బ్రహ్మర్షి. ఈ విషయమై ప్రశ్నించే ధైర్యం ఎవరికయినా ఉందా? శిష్యులు ఏ ఆక్షేపణా చేయక ఊరుకోవటంతో విశ్వామిత్రుడు తన ప్రవచనాన్ని సాగించాడు.

"కామక్రోధాల్ని జయించిన వాడు అంటే అహంకారాన్ని, స్వార్థాన్ని జయించిన వాడని అర్థం వస్తుంది. మనుష్యులంతా ఆగ్నేయులు. అంటే దేహానికి కావాల్సిన అన్న పానాదులతో బ్రతికేవారని అర్థం, మనుష్య దేహంలో గంధర్వులూ, సోముడూ వున్నారు. గంధర్వుల ప్రాబల్యం వల్ల మనుష్యుల దేహంలో కాముని అవతారం అవుతుంది. సోముని వల్ల సంగ్రహించాలన్న ఆశ కలుగుతుంది. ఎంత గడించినా చాలదు, ఇంకా కావాలి అన్న మనోభావం కలుగుతుంది. ఈ కామాన్ని భోగాన్ని జయించినవాడే బ్రాహ్మణుడు అనటానికి మరే అభ్యంతరం లేదు."

"బ్రాహ్మణునికీ, క్షత్రియునికీ కల భేదం ఏమిటి భగవాన్?"

"బ్రాహ్మణుడు బ్రహ్మ నోటినుండి పుట్టినవాడు. క్షత్రియుడు భుజం నుండి జనించినవాడని వేదోక్తి. నోరు అంటే వాగ్శక్తి. బుద్ధిశక్తి. సాధన శక్తి. ఇవి బ్రాహ్మణునికి హస్తగతం. క్షత్రియునికి భుజబలం అధికం. బుద్ధి శక్తి కన్నా క్రియా శక్తి ఎక్కువ."

"ఇద్దరిలో ఎవరు ఎక్కువ గురువర్యా?"

—యుడు ప్రశ్నించాడు.

"ఎవరూ ఎక్కువ కాదు, ఎవరూ తక్కువకాదు. ప్రపంచంలో ఎవరి పని వాళ్ళు దిగ్విజయంగా నెరవేర్చి కృతకృత్యులు కావటమే ముఖ్యం. స్వర్గప్రాప్తి కలిగేది తమ క్షేత్రంలో శ్రద్ధగా, తాదాత్మ్యంతో పనిచేసే వారికి మాత్రం."

మనుస్వతుడు సువర్ణుడి చెవిలో చెప్పాడు:

"భగవానులవారు ఎంత సులభంగా వివరించేస్తారు. మనం మాత్రం ఏమీ సాధించ లేము."

సువర్ణుడు తలవూపాడు. మెప్పుదలతో విశ్వామిత్రుడ్నే చూస్తూకూర్చున్నాడు. అతని దృష్టి అంబా అని పిలుస్తున్న ఆవువేపు మరలింది. నల్లావు ఇవాళో రేపో ఈనాలి. అదే అరుస్తోందేమో?

ఇంకో శిష్యుడు ప్రశ్నించాడు:

"బ్రాహ్మణ్యం సంపాదించటానికి సులభమైన దారి ఏది గురువర్యా?"

"ఎన్నో దార్లున్నాయి. కాని ముఖ్యమయినవి ధ్యానయోగం. కర్మయోగం, మంత్రయోగం. ధ్యానయోగానికి ప్రచండ ధీశక్తి కావాలి. ఇది అందరివల్ల సాధ్యమయ్యే పనికాదు, కర్మయోగం ఉపాసనా మార్గం. అందువల్ల బ్రాహ్మణ్యం సంపాదించటానికి సులభమైన మార్గం మంత్రయోగం."

యదు లేచినిల్చుని అడిగాడు:

"భగవాన్, నాకో సందేహం ఉన్నది. బ్రాహ్మణుడుకాని, ఋషికాని కామాన్ని పూర్తిగా వదిలిపెట్టి ఎలా జీవించటం? సృష్టి మూలం కామమే కదా?"

అది విని విశ్వామిత్రుడు భ్రుకుటి ముడిచాడు. అతడు కోపంతో "యదూ, ఆ ప్రశ్నకు జవాబు తెలుసుకునేంత పెద్దవాడివి కాదు నువ్వు" అని పైకి లేచాడు.

మిగిలిన శిష్యులు యదు ఆ ప్రశ్న అడగటానికి, గురువుగారు కోపం తెచ్చు కోవటానికి మాధవియే కారణం అని అర్థం చేసుకున్నారు. అతిథిశాల తలుపు వద్దే కూర్చున్న మాధవి చెవిన పడిందీ సంభాషణ.

సాయంత్రం పొద్దు పోవటానికి మాధవి మల్లె పొదలో పూలు కోయ నారంభించింది. తెల్లటి పూలలో అదెంత సువాసన. మల్లె చూడటానికి బాగుంటుంది; ఆఘ్రాణించటానికీ బాగుంటుంది.

అటువేపు వచ్చిన యదు "భగవతీ, పూలు కోసి పెట్టనా?" అనడిగాడు. ఆమె జవాబు కెదురు చూడకుండా తానూ మల్లెపూలు కోయసాగాడు.

"నువ్విక్కడి కొచ్చి ఎంతకాల మయింది?" అని ప్రశ్నించింది మాధవి.

"ఎక్కువేం లేదు. ఓ ఆరేడు నెలలయి వుంటుందంతే."

"నువ్వింకా చిన్నవాడివి. రాజధానిలో ఉండకుండా ఇక్కడి కెందు కొచ్చావు?"

"ఇది నేను ఎన్నుకున్న మార్గం కాదు భగవతీ. నా తండ్రి బలవంతం వల్ల ఇక్కడికు వచ్చాను. మాది చాలా పేద కుటుంబం. ఒక మనిషి తిండి తగ్గినా వారికి సంతోషం కలుగుతుంది."

మాధవి మౌనంగా తన పని చేసుకోసాగింది.

"ఇప్పుడో ఆర్నెల్ల క్రితం విశ్వామిత్రులవారు పల్లవుల రాజభవనానికి భిక్షకని వచ్చారు అక్కడ వారినీ, వారి వర్చస్సునీ చూశాక నా తండ్రికి తమ కొడుకూ అలాగయితే ఎంత బాగుంటుంది అనిపించింది. నన్ను రాజభవనానికి తీసుకుని వచ్చి విశ్వామిత్రుల వారి పాదాల మీద పడేశారు. గురువుగారికి సంతోషం కలిగింది. నన్నిక్కడికి తీసుకుని వచ్చారు."

"నీకు తమ్ముళ్ళూ చెల్లెళ్ళూ ఉన్నారా?"

"ఉన్నారు. ఇద్దరు అక్కలు— మీరు ఏమీ అనుకోకండి. మిమ్మల్ని చూస్తే మా అక్కే గుర్తొస్తుంది. ఇద్దరు తమ్ముళ్లు, ఇద్దరు చెల్లెళ్లూ వున్నారు."

తన పట్ల యదు చూపే అభిమానానికి కారణమేమిటా అని ఆలోచిస్తున్న మాధవికి జవాబు దొరికింది. ఆమె అతనివంక ఆప్యాయంగా చూసి చిరునవ్వు నవ్వింది.

ఇంతలో ఆవరణలోని శిష్యులు "పట్టుకోండి, పట్టుకోండి" అని కేకలు పెట్టటం వినిపించింది. లేగదూడ ఒకటి గెంతుతూ వారున్న చోటికి వచ్చింది.

"నల్లావు మధ్యాహ్నం ఈనింది" అని వివరించాడు యదువు.

నల్లటి ఆ దూడ ఒళ్ళంతా నిమిరింది మాధవి. ఆ క్షణంలో అత్యంత సుఖం అనుభవించింది.

ఆ రాత్రి విశ్వామిత్రుడ్ని అడిగిందామె :

"మధ్యాహ్నం మీరు చెప్పింది విన్నాను. మీరు మహా తపస్వులు. భోగం వల్ల మీ తపస్సుకు హాని కలగదా?"

"లేదు. నేను ప్రాణాన్ని ఆరాధిస్తాను"

"కామక్రోధాల్ని జయించాలి అంటారు. మీకు నేనెందుకు కావాల్సివచ్చాను."

"నావల్ల ఇంకా తేజస్వులు పుట్టాలి అని కోరుకోవటం తప్పుకాదు. చెట్టు చిగురిస్తే దాని ప్రాణం, రసం ఎలా తక్కువయి పోదో, అలాగే నా తపస్సుకు కూడా దీనివల్ల మరేం కష్టం కలగదు. అహంకారం పెరగటానికి భోగం కావాలి. ఆ అహంకారంలోనే ఎన్నో మహత్కార్యాలు జరుగుతాయి."

"మాటల్లో తమరు తెలివైనవారు. మీకు ఎలా వీలుగా ఉంటే అలా మాట తిప్పేస్తారు" అన్న మాధవిని బలవంతంగా దగ్గరకు లాక్కున్నాడు. అతని భల్లూకపు పట్టునుంచి విడిపించుకోవటానికి ప్రయత్నించి ఓడిపోయింది మాధవి.

# 24

నెలలు గడిచాయి. వేసవికాలం గడిచి వర్షాకాలం అడుగు పెట్టింది. నిండుగా పారుతున్న సరస్వతీ నదిలా మాధవి ఇప్పుడు గర్భవతి. ఆమె ముఖంలో ముగ్ధత్వం మాయమయి ప్రౌఢకళ వచ్చింది. చాంచల్యం పోయి, గాంభీర్యం తనంతట తానే వచ్చింది. ఆశ్రమంలోని శిష్యులకు ఆమె కొంతకాలం మాత్రమే ఉండి వెళ్ళే వ్యక్తి అని గుర్తున్నా ఆమె ప్రవర్తనతో ఆమె పట్ల అత్యంత పూజ్య భావం కలిగింది.

పేదరికంలో పుట్టి పెరగకపోయినా ఆశ్రమంలోని సరళజీవనానికి అలవాటు పడింది. అక్కడ జరిగే ప్రతిపని గురించి శ్రద్ధ వహించేది. ఉదయం గోశాలలో "పాలు పితికావా సువర్ణా? గోవులకు కుడితి పెట్టావా?" అని కనుక్కునేది. ఆ తర్వాత వంటశాలలో ఆరోజు వంట ఏం చెయ్యాలో చెప్పేది! ఎన్నో ఏళ్లుగా ఆ పని బాధ్యత వహించిన మనుష్యతుడు వచ్చి అడిగేవాడు:

"భగవతీ, ఇవాళ ఏం వంట చేయాలి?"

అరటికాయ పులుసు పెట్టమనో, అరటిదూట కూరచెయ్యమనో, దుంపలు వేయించమనో మాధవి చెప్పేది. ద్వాదశినాడు పాయసం చేసేవారు. విశేషమయిన పూజవున్న రోజుల్లో బాగా మాగిన అరటి పళ్ళు, పాలూ, తేనెలతో రసాయనం చేసేవారు. లేకపోతే రోజూ మామూలుగా అన్నం, పప్పు, కూరలు మాత్రమే ఉండేవి. పాలు, పెరుగు, నెయ్యి- వీటికి మాత్రం ఎప్పుడూ లోటుండేది కాదు ఆశ్రమంలో.

వంటింట్లో పని చూశాక మాధవి అగ్నిశాలలో పని ఎలా జరిగిందీ ఏమిటీ కనుక్కునేది.

"యదూ, సమిధలు తెచ్చావా? పూలు కోసి సిద్ధం చేశావా? పాత్రలో హోమానికి కావాల్సిన నెయ్యి ఉందా?" అనడిగి తెల్సుకునేది.

ఆశ్రమానికి అవతల లేత గడ్డి తినే లేళ్ళూ జింకలూ ఉండేవి. అక్కడకు మాధవి వెళ్ళేసరికి అవి ఆమెను చుట్టుముట్టేవి. కొన్ని జింకలు కొమ్ములతో ఎక్కడ గోకాలో చూపెట్టేవి. మాధవి వాటికి కావాల్సినట్టుగా గోకితే అవి నిమీలిత నేత్రాలతో ఆనందిస్తూ నిలబడేవి.

ఒక్కొక్కమారు మాధవి అడవిలోకి కూడా వెళ్ళివచ్చేది. స్వేచ్ఛగా పెరిగిన బిల్వం, తిలకం, సాల వృక్షాలను చూసి సంతోషించేది. మామిడి తోటల్లోని పళ్ళు కోయించాలి లేకపోతే వానకు కుళ్ళిపోతాయి అని ఆలోచించేది. మందార, సంపంగి, మొగలిపూలు చూసి ఇక్కడివరకూ వచ్చి పూలు కోసుకుని రా – అని యదువుతో చెప్పాలి అనుకునేది.

సాయంకాలాలు అగ్నిపూజ అయ్యాక గోపూజ. గోవును పువ్వులతో అలంకరించి పసుపూ కుంకుమలు పెట్టేది. గోగ్రాసమయిన భక్ష్యభోజ్యాలను అర్పించి అందమయిన పళ్ళెరాలలో మంగళదీపాల నుంచి ఆరతి ఇచ్చేది. ఆ తరువాత శిష్యులకు ప్రసాదం పంచేవారు.

ఇలా ఉదయంనుండి సాయంకాలం వరకూ మాధవికి ఏదో ఒక పని వుండేది. రాత్రయితే మాత్రం మానసికంగాన, దైహికంగానూ యాతనే. ఎప్పుడు తెల్లవారుతుందా, తెల్లవారితే చాలు భగవంతుడా అని బెంగ.

వానాకాలం కావటంతో సామాన్యంగా విశ్వామిత్రుడు ప్రవచనాన్ని అధ్యయన శాలలోనే నడిపేవాడు. ఆనాడు ప్రవచన కాలంలో యదు ప్రశ్నించాడు.

"భగవాన్, మానవుడికి సందేహాలు ఎందుకొస్తాయి?"

"సందేహం లేకపోతే మనిషి జీవించలేడు. మానవుడు మానసికంగా ప్రగతి సాధించాలంటే సందేహం అత్యవసరం. ఓ విధంగా ఆలోచిస్తే మనస్సులోని అసంపూర్ణతే, జ్ఞానంలో అభావమే సందేహానికి మూలం అని చెప్పాలి. ఆలోచనాపరుడు ప్రపంచ రీతినీతులపట్ల సంశయాత్ముడైనప్పుడు అది సంశోధనకు దారి తీస్తుంది. జ్ఞానం స్థిరమయినప్పుడు సంశయాలన్నీ మాయమవుతాయి."

"జ్ఞానం స్థిరమయింది అని ఎప్పుడు తెలుస్తుంది?"

"ఓ వ్యక్తికి అంతా స్పష్టమయినప్పుడు, అది అతనికే కాదు, అతని చుట్టూ వున్న వారి కందరికీ తెలుస్తుంది."

యదువుకు ఆ మాటలవల్ల సంతృప్తి కలగలేదు.

సంజవేళ మాధవి పూలు కడుతూ ఆశ్రమం తలుపు వద్ద కూర్చుని వుండగా యదు ఆమె వద్దకు వచ్చి కూర్చుని అడిగాడు.

"భగవతీ, ఓ ప్రశ్న అడగనా?"

"ప్రశ్నలకు జవాబు లిచ్చేది భగవాన్లవారు. నాకేం తెలుస్తుంది యదూ?"

"భగవాన్లవారి జవాబులతో నాకు సంతృప్తి కలగటంలేదు భగవతీ. ఎందుకోగాని, నాకు దేనిగురించి ఆలోచించినా సందేహాలే వస్తున్నాయి. ఈ ప్రపంచం పట్ల, మనుష్యుల భవిష్యత్తుపట్ల, దేవతల గురించీ..."

మాధవి నవ్వి అడిగింది :

"దేవతలంటే ఎందుకంత కోపం నీకు ?"

"కోపం కాదు. పూజ పురస్కారాల వల్ల వారు ప్రత్యక్ష మవుతారని గురువుగారు చెప్తారు. ఆయన దేవతలను చూశారట కూడా. కాని నాకు ఆ విషయంలో నమ్మకం కలగటం లేదు."

"నేనూ దేవతలను చూడలేదు."

"అంతేకాదు. మనిషి చనిపోయాక స్వర్గానికో నరకానికో పోతాడని అంటారు కదా, నాకింత మాత్రం స్పష్టంగా తెలుసు. చనిపోయాక ఈ దేహం బూడిదవుతుంది; స్వర్గం, నరకం అంతా అబద్ధమే."

ఇంత చిన్న వయస్సులో ఎన్ని మాట్లాడుతున్నాడీ అబ్బాయి అని మాధవికి ఆశ్చర్యం. పాత నమ్మకాలను ధిక్కరిస్తున్నాడని మెప్పుదలా. విశ్వామిత్రుడు కాని, ఇతర తాపసులు కాని యదువు మాటలకు విలువ ఇవ్వరని కచ్చితంగా తెలుసు నామెకు.

అంతలో యదువు అన్నాడు :

"ఏదో మనస్సులో బాధ ఆపుకోలేక మీతో చెప్పాను. ఇలా అన్నానని మరెవరితోనూ చెప్పకండి. నన్ను పిచ్చివా డనుకుంటారు."

అగ్నిశాల నుండి బయటకు వచ్చిన విశ్వామిత్రుడు మాధవితో యదువు మాట్లాడుతూ ఉండటాన్ని చూసి అటు వచ్చాడు.

"యదూ, ఇక్కడేం చేస్తున్నావు ? అగ్నిశాలలో సమిత్తులు అంతా సర్ది పెట్టు."

ఆకాశాన్ని నల్లటి మబ్బులు ఆవరించాయి. మొగలిపూల వాసనతో వీస్తున్న గాలి, నల్లటి మబ్బుల మధ్య బంగరు కొరడాలా మెరిసే మెరుపు. ఆకాశమంతా గుడగుడలాడే ఉరుము. దాని వెనకాలే కురిసే పెద్ద వాన. వాన తాకిడికి ఆశ్రమం ఆవరణలో నిల్చిన నీరు. బయటికి పోకుండా లోపలే ఉండిపోయిన గోవుల అరుపులు. అగ్నిశాలలో ఓ చోట మాత్రమే నిప్పు. మిగిలిన చోటంతా వణికించే చలి.

వాన నిల్చాక మాధవి ఆవరణ అంచుకి వెళ్ళి నిల్చుంది. సరస్వతీనది వానకి పొంగి పొరలుతోంది. నదీ తీరంలో కామోద్రేకంతో ఒకదాన్నొకటి వదలకుండా కూర్చున్నది చక్రవాక మిథునం. నది ఆవలి కొండలు ముత్యాలతో గుచ్చినట్టున్నాయి. కొండదిగి వచ్చే నీరు గైరికాది ధాతువులతో ఎర్రబడింది. చెట్ల నుండి రాలిన సర్జకదంబాది పుష్పాలతో తెలుపై, కొత్త నీటితో కలిసి వేగంగా పారుతోంది. ప్రవాహ ఘోషలో కలసి వినిపిస్తోంది నెమళ్ళ కేక. మేఘాలపై మోహంతో పైకెగిరే కొంగలబారు అత్యంత మనోహరంగా వుంది.

మాధవి మనస్సు పులకరించింది. అడవి వేపు తిరిగి చూస్తే అక్కడ కదంబ వృక్షాల్లో సమృద్ధిగా వున్న పుష్పాలలోని మకరందానికై వచ్చిన తుమ్మెదలు వాన తాకిడికి తట్టుకోలేక కొమ్మలమధ్య దాక్కున్నాయి. పచ్చటి గడ్డిమీద ముత్యాల్లా పడినాయి, ఇంద్రగోపాలనే వానపురుగులు. నేరేడుచెట్ల కొమ్మలనిండా నల్లటి పళ్లు. విచిత్రమయిన రెక్కలున్న చాతక పక్షులు ఆకులమీద పడ్డ వాన చినుకులను అతివేగంతో తాగేస్తున్నాయి.

ఎంత చూసినా తనివి తీరని దృశ్యం.

ఈ ప్రకృతి పట్ల తనకెందుకిలాంటి మోహం కలుగుతోంది?

రాచనగరులో సుఖాలకు అలవాటు పడిన దేహం ఇక్కడి సరళమయిన జీవితానికి ఆకర్షితమయింది. ఈ చోటు వదిలి ఎక్కడికీ వెళ్ళకూడదు. [illegible] ఆలో

చనలూ లేకుండా ఇక్కడే ఇలాగే ఉండిపోవాలన్న బలమయిన కోర్కె కలిగిం దామెకు.

ఓ రాత్రి ఆమె కెందుకో ఉన్నట్టుండి గురుదక్షిణకు గాను గాలవుడు తెచ్చి పెట్టిన గుర్రాలు గుర్తు కొచ్చాయి. పక్కనే వున్న విశ్వామిత్రుడిన్ని అడిగింది:

"గాలవుడు తెచ్చిన గుర్రాల్ని ఏం చేశారు?"

"నేనేమీ చేయలేదు. అవి అడవుల్లో తిరుగుతూండాలి. వాటిని చూసిన చుట్టు పక్కలి రాజులు తోలుకుని పోతారు. ఇంకా ఇక్కడే ఏమయినా మిగిలితే ఎవరయినా రాజు వచ్చినప్పుడు ఇచ్చేస్తాను. అ మాటెందు కొచ్చిం దిప్పుడు?" అనడిగాడు విశ్వామిత్రుడు.

"ఊరికే గుర్తుకొచ్చింది. మీకు పనికిరాని వస్తువు నెందుకు కోరుకున్నారు చెప్పండి?"

"గాలవుడు పట్టుబట్టాడు, ఆతను తెచ్చిపెట్టలేని వస్తువునడుగుదాం అనుకుని దీన్ని ఆడిగాను: అంతే."

మాధవికి మండిపోయింది.

"ఈ గుర్రాల్ని సంపాదించడానికి నేనెంత కష్టపడ్డానో తెలుసా?"

"దాన్ని కష్టమని ఎందుకనుకుంటావు? నలుగురు తేజోవంతులయిన పుత్రులకు తల్లి కావటం అన్నది చాలా పవిత్రమయిన కార్యం."

"నేనే ఆ సంబంధాలను ఇష్టపడితే ఆ మాట వేరు. ఇది బలవంతపు మాఘస్నానం నాకు. మీరూ, గాలవుడూ నా జీవితాన్ని ముక్కలు ముక్కలుగా చేసేశారు."

"చాలు నోర్మూసుకో. ఆడదానికి పెద్ద నోరుండకూడదు" అంటూ గట్టిగా కేకలు వేశాడు విశ్వామిత్రుడు ముఖం కప్పుకుని ఏడవసాగింది మాధవి.

• • • •

రోజూలా సంధ్యాహోమానికి యదుపు రాలేదు. పూలు, పళ్ళూ, కందమూలాలు తేవటానికీ; సమిత్తు, కాష్ఠం, దర్భలను తేవటానికని అడవికి వెళ్ళిన శిష్యులందరూ ఆశ్రమానికి తిరిగి వచ్చారు. కాని, వారిలో యదుపు లేడు.

విశ్వామిత్రుడి కెందుకో అనుమానం. హోమం పూర్తికాగానే విశ్వామిత్రు డన్నాడు,

"యదువు అలా ఎక్కడికీ వెళ్ళే పిల్లవాడు కాదు. ఏమయిందో ఏమిటో? వెళ్ళి వెతుక్కుని రండి."

మాధవికి అక్కడ ఉండలేక, విసుగెత్తి తండ్రి ఇంటికి వెళ్ళిపోయాడేమో ననిపించింది. కాని విశ్వామిత్రుడిముందు ఆ మాట అనలేదు.

శిష్యులందరూ గుంపులు గుంపులుగా అన్ని దిక్కులకు వెళ్ళారు. అప్పటికే కనుచీకటి వేళ అయినందువల్ల త్వరత్వరగా వెతకాలి వాళ్ళు.

పూర్వదిక్కుకు వెళ్ళినవారికి చెట్టుకింద పడివున్న యదువు కనిపించాడు. చెట్టు పైనుండి పడి స్పృహ తప్పిందేమోనని గట్టిగా కేకలు పెట్టారు. కుదిపారు. కాని చలనం లేకపోవటంతో కంగారు పడ్డారు.

"తీసుకుపోదాం, భగవాన్లవారు మంత్రం తంత్రం చేస్తారు" అనుకుని యదువును నలుగురు ఎత్తుకుని ఆశ్రమానికి వచ్చారు.

అతణ్ణి చూడగానే విశ్వామిత్రుడికి తెలిసింది యదువు చనిపోయాడని. దీపం వెలుగులో నీలంగా అయిన యదువు శరీరం చూడగానే పాము కాటు వేసిందని అనుమానం వచ్చింది. కుడికాలిమీద పాము కాటు గుర్తు కూడా వుంది.

ఆశ్రమంలో అలాంటి చావులు చాలా అరుదు. ఒకరిద్దరు శిష్యులు మౌనంగా రోదించారు. మాధవి ఘొల్లుమని ఏడవసాగింది.

"వాడినిక్కడ పెట్టుకుని ప్రయోజనం లేదు. నదీ తీరంలో చితి చెయ్యండి. శవ సంస్కారం చేసేద్దాం" అని విశ్వామిత్రు డనేసరికి మాధవి- "అయ్యో వద్దు. ఇంత చిన్నపిల్లవాడిని కాల్చేస్తారా? వాడిని బ్రతికించండి. ఇంతమంది దేవతల్ని సంప్రీతులుగా చేసుకున్నారు. మీ ప్రార్థనలను కాదనరు దేవతలు" అని బ్రతిమాలింది.

విశ్వామిత్రుడు ప్రశాంతంగా అన్నాడు :

"ఆయుస్సు నిండాక బ్రతికించలేం మాధవీ."

"అలా అయితే మీ తపస్సు ఫలం అంతేనా? దానివల్ల ఎవరికీ ప్రయోజనం లేకపోతే అలాంటిది ఉండి ఏమిటి ప్రయోజనం? యదువు చేసిన తప్పేమిటి చెప్పండి? నిర్మాల్య పుష్పంలాంటి పిల్లవాడే! దేవుడు వాణ్ణి ఎందుకు తీసుకు

పోయాడు? ఇంకా పాపులందరూ బ్రతికే వున్నారు కదా!" అంటూ పిచ్చిదానిలా కేకలు పెట్టింది.

"పుణ్యాత్ములు ఈ ప్రపంచంలో ఎక్కువ కర్మ చేయక్కర్లేదు. అందుకే యదువు అంత త్వరగా పోయాడు. మాధవీ, నేను చెప్పిన మాట విను. లోపలికి వెళ్ళి పడుకో. మనస్సులోనే ప్రార్థన చేసుకోవటానికి ప్రయత్నించు. మా పనికి అడ్డురాకు."

గాఢమైన చీకటి అలుముకునే సరికి చితిమంట కనిపించింది మాధవికి. ఆమె తల కొట్టుకుంటూ "నీ బదులు నాలాంటి పాపి చనిపోయినా బాగుండేది యదూ" అంటూ ఏడిచింది.

రెండు మూడురోజులు ఆమె ఎవరితోనూ మాట్లాడలేదు. నాలుగో రోజుకి ఆమె మనస్సు కాస్త శాంతించింది. విశ్వామిత్రుడ్ని అడిగింది.

"యదువు తల్లిదండ్రులకు కబురు పంపరా ?"

"తొందరేముంది? పల్లవరాజ్యంనుండి ఎవరయినా వస్తూంటారు. చెప్పి పంపుదాం. ఇప్పుడు కబురంపినా ఏం ప్రయోజనం? వచ్చినవారు వచ్చి ఏడవటమే కాని కొడుకు మొహమయినా చూబెట్టగలమా? అదీగాక వారికింకా నలుగు రైదుగురు పిల్లలున్నారు. ఇలాంటప్పుడు ఆవేశం పనికిరాదు. నిదానంతో దుఃఖాన్ని స్వీకరించాలి."

యదువు చనిపోయాక మాధవికి ఆశ్రమం బోసిగా వుంది. జీవితంలో ఆమెకు ఆసక్తి మరీ తక్కువయింది. అది చాలదన్నట్టు ఇప్పుడు నిండు గర్భిణీ కూడా. అప్పుడప్పుడూ సన్నగా కడుపునొప్పి కూడా వచ్చేది.

ఓమారు విశ్వామిత్రుడు అడిగాడు:

"కాన్పు సమయంలో సాయం చేయటానికి ఎవరైనా ఆడవాళ్ళను పిలిపించనా?"

"ఎవరూ వద్దు. దేవుడి చిత్తం ఎలాగుంటే అలాగే అవుతుంది" అనేసింది మాధవి.

ఆరోజు అధ్యయన శాలలో ప్రవచనం ముగించి శిష్యులందరూ భోజన శాలకు వెళ్ళినప్పుడు మాధవి హఠాత్తుగా విశ్వామిత్రుడ్ని అడిగింది:

"నిజమయిన ముని ఎలా ఉండాలి?"

ఆమె ప్రశ్నవిని అప్రతిభుడయ్యాడు విశ్వామిత్రుడు.

"నీకూ ఈ ప్రశ్నకూ ఏమీ సంబంధంలేదు. అయినా చెప్తాను విను. ముని నిర్ద్వంద్వుడై ఉండాలి. అంటే శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలు, జయాపజయాలు, నిందాస్తుతులను సమానంగా స్వీకరించ గలిగి వుండాలి."

మీకిలాంటి మనోధర్మం ఉందా అని అడగబోయిన మాధవి వద్దులే అనుకుని పూరుకుంది. ఆమె మనస్సును వేధిస్తున్న ఇంకో ప్రశ్న తపస్సు ఎలా చెయ్యాలి అని. దానికి జవాబుగా విశ్వామిత్రు డన్నాడు:

"అది ఒకటి రెండు రోజుల్లో సాధించేది కాదు. నెలల తరబడి నేను రెండు చేతులూ పైకెత్తి నిరాధారంగా నిల్చుని తపస్సు చేశాను. వేసంగిలో పంచాగ్ని మధ్యంలోనూ, వర్షాకాలంలో నిరావరణ ప్రదేశంలోనూ, చలికాలంలో జలమధ్య ప్రదేశంలోనూ ఘోర తపస్సు చేశాను."

"తపస్సు చేస్తే నాకూ జితేంద్రియత్వం కలగవచ్చునా?"

"ఎందుక్కాదు? సాధనా సిద్ధులకు ఆడా మగా భేదం లేదు. అంత పట్టుదల నీకుందా?"

"తెలీదు. నాకయితే ఈ ప్రపంచమే వద్దనిపిస్తోంది."

"అది సహవాస దోషం" అని నవ్వాడు విశ్వామిత్రుడు.

ఆ తర్వాత మూడోరోజున మాధవికి నొప్పులు మొదలయ్యాయి. కావాల్సిన బట్టలూ అవీ తీసుకుని, అతిథిశాల తలుపులు మూసుకుంది. ఆమె మూలుగులూ కేకలూ విని బెదిరిపోయారు శిష్యులు. మనుష్యతుడి కయితే యదువులాగానే భగవతి కూడా చనిపోతే ఏం గతి అని భయం వేసింది. విశ్వామిత్రుడు పైకి ప్రశాంతంగా కన్పించినా హోమశాలలో కాని ప్రవచనంలోకాని, అతనికి ఆసక్తి లేకపోయింది. నేను రమ్మని పిలిచినపుడు లోపలకు రండి అని చెప్పింది మాధవి.

సాయంకాలానికి నొప్పు లెక్కువయ్యాయి. విశ్వామిత్రుడు తలుపు వద్దనే నిల్చున్నాడు. కొంచెం సేపట్లోనే బిడ్డ ఏడుపు విన్పించింది. ఆ తర్వాత యుగం లాగ గడిచిన ఓ క్షణానికి 'లోపలకు రండి' అని మాధవి క్షీణ స్వరంతో పిలిచింది.

లోపలకు వెళ్ళిన విశ్వామిత్రుడి మనస్సు సంతోషంతో నిండిపోయింది.

"వేణ్నీళ్లు తెప్పించండి. బిడ్డ బొడ్డు కోసి ఎత్తుకోండి."

మనుస్వతుడు మరలుతున్న నీటినీ, చాకునూ తెచ్చి బయటపెట్టాడు. దాన్ని తీసుకుని బొడ్డుకోసి నారొకటి దానికి గట్టిగా చుట్టికట్టి, బిడ్డను గుడ్డలో చుట్టి దర్భ పడకమీద పరుండబెట్టాడు విశ్వామిత్రుడు.

శుద్ధ అష్టమినాడు పుట్టిన బిడ్డకు 'అష్టకుడు' అని విశ్వామిత్రుడు నామకరణం చేశాడు. బిడ్డ జాతక చక్రాన్ని శ్రద్ధగా పరీక్షించి, "ఇతను గొప్ప ఋషి అవుతాడు" అని జోస్యం చెప్పాడు.

మాధవికి భవిష్యత్తు గురించి ఆలోచనే లేదు. బిడ్డను చూసుకోవటానికి దాసీలు లేరు కనుక, దాని పోషణ భారం అంతా ఆమె మీదే పడింది. బాబుకు స్నానం చేయించటం, పాలు పట్టటం, ఆడించటం ఆమెకు ఆనందాన్నిచ్చే, అమితమయిన ఆనందాన్నిచ్చే పనులు. బాలింతరాలయిన తనకూ ఔషధోపచారాలు చూసుకోవాలి కదా! వెనుక వృద్ధదాసీలు చేసిపెట్టిన కషాయాల వేళ్ళు, మూలికలూ గుర్తుకు తెచ్చుకుని మనుస్వతుడి చేత తెప్పించుకుంది. అతడు సంతోషంగానే కషాయం చేసిపెట్టాడు. ఆశ్రమంలో ఇప్పుడు కొత్త కళ. ఖాళీగా వున్నప్పుడల్లా శిష్యులకు బాబు నెత్తుకుని ఆడించటమే పని. అగ్నికార్యమప్పుడో, ప్రవచన సమయంలోనో బాబు ఏడవటం వినిపిస్తే అందరి దృష్టి అటే వుండేది.

బిడ్డకు రెండ్నెల్లయ్యేసరికి గాలవుడు వచ్చాడు.

"ఇంకో నెల పోనీ. ఆ వేళకు బాబు కొంచెం పెద్దవాడయి ఉంటాడు. ఆ తర్వాత మాధవిని తీసుకుని వెళ్లు" అని చెప్పి పంపాడు విశ్వామిత్రుడు.

అంతవరకూ స్వాధీనంలో వున్న మాధవి మనస్సు మళ్ళీ అలజడి చెందింది. మాటి మాటికి అందరిమీదా చిరాకు పడసాగింది. ఇప్పటికే ముగ్గురు పిల్లల్ని వదులుకున్నాను. ఇదొకటయినా మిగుల్చుకుంటే బాగుంటుందన్న కోరిక ఆమెది.

"ఇక్కడ బాబును పెంచటానికి ఓ ఆడది కూడా లేదు కదా! పోనీ నేనే తీసుకుని పోయి పెంచుతాను."

"వద్దు. ఈ పుత్రుడ్ని మహామునిగా చేస్తాను. అతడు నా వద్దే ఉండనీ."

"అలా అయితే ఈ బిడ్డమీద నాకేం అధికారం లేదా?"

"లేదు." నీవు వట్టి ఉపకరణానివి మాత్రమే. జీవానికి వేరు ముఖ్యం. వేరు పెరిగే వరకు మన్ను కావాలి. ఆ తర్వాత ఓ మన్నునుండి మరో మన్నులోకి మార్చినా వేరు బ్రతికే వుంటుంది. నువ్వు వట్టి మన్నువు మాత్రమే. మన్నుకు మొక్కమీద అధికారం లేదు."

మాధవి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఇక పిల్లలమీద వ్యామోహం వద్దు. ముగ్గుర్ని ఇప్పటికే వదులుకుని వచ్చాను. ఈ బిడ్డను గమ్మని అడగటమే తప్పయింది. ఈ వ్యామోహాన్నే వదులుకోవాలి అని మనస్సు గట్టి చేసుకుంది.

# 25

సరస్వతీ నదీ తీరం నుండి ప్రతిష్ఠాన నగరం వేపు ప్రయాణం. ఉత్తరంనుండి దక్షిణానికి, అడవులూ, గుట్టలూ, చిన్న చెరువులూ, వాగులు. మాధవీ గాలవుల మధ్య మాటలు లేవు. పక్షులు, జింకలు, కోతులు వారికి బదులుగా మాట్లాడుతున్నాయి. ప్రకృతి నవ్వుతోంది.

వ్యధతో, అలసటతో క్రుంగిపోయాడు గాలవుడు. గురుదక్షిణ చెల్లించి ఋణ విముక్తుడ్ని అయ్యానన్న సంతోషం ఓ పక్కనయితే, ఈ అమ్మాయికి ఇంత దుఃఖం కలగజేశానన్న బాధ ఇంకోవేపు. విడిపోయేముందు ఆమెతో ఓ రెండు మంచి మాటలాడా లనుకుంటూ గాలవు డన్నాడు:

"మాధవీ, నువ్వు ముగ్గురు రాజర్షులవల్లా ఓ బ్రహ్మర్షివల్లా సంసారసుఖాన్ని అనుభవించి, నలుగురు పుత్రుల్ని పొందికూడా ఇంకా కన్యలాగానే వున్నావు. నన్ను కూడా గురుదక్షిణ భారంనుండి విముక్తుడ్ని చేశావు. నీకు అఖండమైన కీర్తి కలగాలి. నీకు శుభం కలగాలి."

మాధవి రెచ్చిపోయి అడిగింది:

"మీ ఆశీర్వాదానికి అర్థం వుందా? నా జీవితం ముక్కలు ముక్కలు కావటానికి కారణం మీరు కాదూ? మీరు గురుదక్షిణ చెల్లించకపోతే ఏమయ్యేది?"

గాలవుడు ఆమెను ఆశ్చర్యంతో చూస్తూ అడిగాడు:

"గురుదక్షిణ చెల్లించకపోతే విద్యకు సిద్ధి లభించదన్న విషయం నీకు తెలియదా?"

"మీ గుర్రాలకేం గతి పట్టిందో తెలుసా మీకు?"

"ఇవ్వటం నా ధర్మం. వాటి భవిష్యత్తుకు నా బాధ్యత ఏమీ లేదు."

మాధవి కొంచెంసేపు మౌనంగా నడిచింది. గాలవునిపట్ల ఆమె మనస్సులో ద్వేషం, తిరస్కారం భగ్గుమని లేచాయి. తనలోని కోపాన్నంతా బయటకు కక్కక పోతే మనశ్శాంతి దొరకదు అనిపించింది.

"మీ తపస్సు వల్లకాని, మీరు చేయించే యజ్ఞయాగాదుల వల్లకాని ప్రపంచం ఉద్ధరించబడుతుం దనుకుంటున్నారా?"

"ప్రపంచంలోని వేలాదిమంది ఋషుల్లో నేనూ వొకడ్ని. నా వొక్కడి వల్లా ఏమీ జరుగదు."

"అలాంటప్పుడు ఓ ఆడదాన్ని ఇంత చిత్రహింస కెందుకు గురిచేశారు? నన్ను ఏడిపించిన పాపం ఊరికేపోదు. ప్రపంచంలోని ఏ ఆడదీ మిమ్మల్ని ఎప్పటికీ క్షమించదు!" అని ఆవేశంతో గట్టిగా కేకలు పెట్టింది మాధవి.

గాలవుడు మరింత క్రుంగిపోయాడు. ఈమె తనను శపిస్తోందా? అనిపించింది. మాధవికి అలాంటి శక్తి లేదని అతనికి తెలుసు. కాని విశ్వామిత్రుడి భార్యగా వుంది. ఏ శక్తి సంపాదించుకుందో ఏమిటోనని భయపడ్డాడు. ఆమె శపిస్తే శపించనీ. అడవికి పోయి నాకు తెలియకుండా చేసిన పాపా లన్నిటికీ ప్రాయశ్చిత్తంగా తపస్సు చేస్తాను అని నిశ్చయించుకున్నాడు.

అడవిదాటేసరికి ఇసుక తిన్నెలు కనిపించాయి. వాటి అవతల గంగానది. దాన్ని దాటి నగరాన్ని చేరాలి సుమారు అయిదేళ్ళ క్రితం ఇదే సమయంలో నది దాటినది గుర్తొచ్చింది మాధవికి. అప్పుడు తానేమీ తెలియని ముగ్ధబాలిక. ఇప్పుడు జీవితంలో అన్ని రకాల కష్టసుఖాలు అనుభవించిన ఆడది.

ఒడ్డున వున్న నావికుడు ఇంతకు ముందున్నవాడు కాదు.

"నది దాటించటానికి ఓ వరహా ఇవ్వాలి" అన్నా డతను.

"అలాగే ఇద్దాం. మేము వెడుతున్నది రాజభవనానికి. వెనక్కి వెళ్ళేటప్పుడు నీకు మూడు వరహా లిస్తాను" అన్నాడు గాలవుడు.

నది ప్రశాంతంగా వుంది. ఎక్కడా ఎంతవేడిమి లేదు. పాడుతున్న నీటి శబ్దం తప్ప మరో శబ్దం లేదు.

ఇక చారునేత్రను, అవ్వనూ చూస్తాను అని తల్చుకుని పొంగిపోయింది మాధవి. మరుక్షణమే కడుపులోంచి బాధ తన్నుకుని వచ్చింది– ఈ స్థితిలో వారు తనను చూస్తే?

["అమ్మాయీ, నీ ధైర్యమే నీకు రక్ష. మర్చిపోకు."

"నేనూ నీతో వస్తాను మాధవి."

"వద్దు. కష్టం నా ఒక్కదానికే ఉండనీ. సుఖం ఉంటుందంటే నిన్నూ తీసుకుని వెళ్ళేదాన్ని. ఇప్పుడా ధైర్యం లేదు చారూ."]

నావికు డడిగాడు.

"యాగం చేయటానికి వస్తున్నారా స్వామీ?"

"లేదు. రాజుగారితో పని ఉంది."

[హర్యశ్వుడి రాజభవనంలో సభా మందిరం. మేడకింద కాలికి గజ్జె కట్టుకుని నాట్యం చేసే నర్తకి.

"మంత్రిగారి పక్కను కూర్చున్నది ఎవరే!"

"అతనా? మంత్రిగారి ఏకైక పుత్రుడు."]

స్థిరంగా కూర్చోలేక పోయింది మాధవి. వసుమంతు డిప్పుడు ఎలా గున్నాడో? వాడికిప్పుడు నాలుగేళ్ళు కదా! తోటలో ఆడ తూండవచ్చు. లేదా మహారాణి ఒడిలో కూర్చునుండవచ్చు. అమ్మ అని ఎవర్ని పిలుస్తున్నాడో?

["కనకాంబరీ, ఇది నా బిడ్డ కాదు. నీదే ఇక."]

ఆమె గొంతు పూడుకు పోయింది. ఈ జ్ఞాపకాలు ఇప్పుడెందు కిలా వెంటాడి హింసిస్తున్నాయి? ఇదంతా మర్చిపోవాలి అనుకుంటూ పడవ చీల్చుకుని ముందుకు పోతున్న నీటినే చూడసాగింది.

["దేవతలు ఆశీర్వదించి ఇచ్చిన పాయసం ఆ కలశంలో ఉంది. దాన్ని నీ రాణుల కివ్వు మహారాజా."

"మాధవీ పాయసం తాగావా?"

"లేదు. నాదాకా రాలేదు. పాయసం తాగితేనే పిల్లలు పుడతారా?"]

పాయసమంతా సత్యవతి తాగింది. కాని ప్రగర్దనుడు పుట్టినది తనకు. అలాంటి కొడుకు తల్లయికూడా తానిప్పుడు ఎవరూలేని అనాథ. దాన్లో దివోదాసు నిది తప్పు మాత్రం ఏముంది? 'అందాల రాణీ' అని పిల్చాడు ఉశీనరుడు: 'నా పిల్లలకు విషం పెట్టావా? నీ చేతులు పడిపోనూ' అని నేర మాపాదించింది మహా రాణి: "కామాన్ని పూర్తిగా అనుభవించిన దానివి నువ్వు. అందుకే నీకు కోరిక లేదు. కాని నాకున్న ఆకలి ఎన్నో సంవత్సరాలది" అన్నాడు విశ్వామిత్రుడు. తన జీవితంలోకి వచ్చి వెళ్ళిపోయినవారు ఎన్ని రకాల మనుష్యులు!

ప్రతిష్ఠాన నగరం వేపునుండి పడవొకటి వీరి పక్కనుండే సాగిపోయింది. దానిలోని ప్రయాణికులు గాలవుణ్ని, మాధవినీ కుతూహలంగా చూశారు. నావికులు ఒకరితో ఒకరు హాస్యమాడుకుని నవ్వుకున్నారు.

దూరంగా కనిపిస్తున్న రాజభవనం గోపురాలను పెద్ద కళ్ళు చేసుకుని చూసింది మాధవి. పడవ ఒడ్డుకు చేరింది.

• • • •

యయాతి సభ ముగిసింది. కాని రాజు, మంత్రీ ఏదో సంభాషణలో మునిగి అక్కడే కూర్చున్నారు. అప్పుడు "మునుల వారు వచ్చారు" అని కావలా భటుడు వచ్చి చెప్పాడు. ఈ సమయంలో వచ్చే ముని ఎవరబ్బా అనుకుంటూ యయాతి 'లోపలకు తీసుకుని రా' అని ఆజ్ఞాపించాడు.

లోపలకు వచ్చిన గాలవుని చూడగానే గుర్తు పట్టాడు యయాతి. వెనకే నారచీరలో వచ్చిన కూతురు మాధవిని చూసి దిగ్భ్రాంతుడయ్యాడు. అది మాధవే. దానిలో ఏం సంశయం లేదు. అయిదు సంవత్సరాల క్రితం నగరం వదిలి పెట్టిన నాటికీ, ఇప్పటికీ ఆమె స్వరూపంలో ఏం మార్పులేదు. మాధవిని దానం చేశాక ఆమె బాగోగులు తెలియక అతడు పరితపించాడు. ఇప్పుడు ఆమే ఎదురు గుండా వచ్చి నిల్చుంటే?

యయాతి సింహాసనం దిగి కూతురి వద్దకు రెండంగలలో వచ్చి "మాధవీ, కులాసాగా ఉన్నావా బిడ్డా?" అనడిగాడు వాత్సల్యంతో.

"ఇంకా జీవించే వున్నాను తండ్రీ."

"నిన్ను దానం చేశాక, ఈ అయిదేళ్ళూ నేనెంత బాధపడ్డానో, బెంగపెట్టు కున్నానో ఆ దేవుడికే తెలుసు."

ఆ మాటలో నిజమెంత అన్నట్టు తలెత్తి తండ్రిని చూసింది మాధవి. ఆ చూపులోని తీక్షణతను ఎదుర్కోలేక, అపరాధియైన యయాతి అన్నాడు:

"నీ భవనం నువ్వెళ్ళినప్పుడెలా వుందో ఇప్పుడూ అలాగే ఉంది. మాధవి వచ్చాక ఉపయోగించటానికి వీలుగా రోజూ శుభ్రంచేసి ఉంచండి అని ఆజ్ఞాపించాను. వారానికో మారయినా అక్కడికి వెళ్ళి రాకపోతే నాకు మనశ్శాంతి ఉండేది కాదు. వెళ్ళమ్మా వెళ్ళు. అంతఃపురానికి వెళ్ళి విశ్రాంతి తీసుకో. ఆ తర్వాత మాట్లాడుకుందాం" అని కూతుర్ని అంతఃపురానికి పంపాడు.

ఆ తర్వాత గాలవునివైపు తిరిగి, "మునివర్యులు మన్నించాలి. తమరు ఆశీనులు కండి" అని కనక పీఠం చూపించాడు.

"తమరితో ఏకాంతంగా మాట్లాడాలి" అని గాలవుడనే సరికి "తమ ఆజ్ఞ అయితే నేను శెలవు తీసుకుంటాను" అని మంత్రి సభామందిరం నుండి వెళ్ళిపోయాడు.

ఓ క్షణం మందిరంలో మౌనం నెలకొంది. ఎలా ప్రారంభించాలో తెలియక గాలవుడు సంధిగ్ధంలో పడ్డాడు. యయాతి కుతూహలంతో ప్రశ్నించాడు:

"మీరు గురుదక్షిణ చెల్లించారా? మాధవిని ఏరాజు పరిగ్రహించాడు? ఇప్పుడు నారచీరతో ఎందుకిలా వచ్చింది?"

గాలవుడు ఆగి ఆగి ఈ అయిదేళ్ళలో జరిగినదంతా వివరించాడు. దాన్ని వింటున్న కొద్దీ యయాతి కోపం నెత్తికెక్కింది. గాలవుడు ఋషి కాకపోతే అతని కెలాంటి శిక్ష వేయటానికైనా వెనుదీసేవాడు కాదు రాజు. గాలవుడంతా చెప్పి ముగించేసరికి యయాతి గట్టిగా కేకలు పెట్టాడు:

"మీరు ఋషి కాదు, కసాయి వాళ్ళు. ఏమీ తెలీని అమాయకురాల్ని తీసుకుని వెళ్ళి ఇంతమందికి అమ్మి దాని బ్రతుకు నాశనం చేశారు. మీ కెలాంటి శిక్ష విధించినా తప్పులేదు"

గాలవుడికీ కోపం వచ్చింది.

"ఈ అపరాధంలో నీకూ భాగం వుంది మహారాజా. నువ్వు దానం చేయకపోతే నేనామెను ఎక్కడికి తీసుకుని వెళ్ళగలిగేవాడ్ని కాదు కదా?"

యయాతి ఆలోచిస్తూ కూర్చున్నాడు. లేచి పచార్లు చేశాడు.

"చూడండి. నలుగురితో జీవించి వచ్చిన కూతుర్ని పుట్టింట్లో నేనెలా వుంచు నేనెలా వుంచుకోనూ? లేనిపోని అపవాదు పడటం నాకిష్టం లేదు. ఆ అమ్మాయి నన్ను క్షమించాలంటే ఆమె జీవితానికో మార్గం కల్పించాలి. క్షత్రియధర్మం ప్రకారం ఆమెకు స్వయంవరం ఏర్పాటు చెయ్యట మొకటే దారి."

"ఇక నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో మహారాజా దానితో నాకేం సంబంధం లేదు. మాధవిని నీకు అప్పగించేశాను. నా కర్తవ్యం నేను చేశాను. ఇక నాకు వెళ్ళటానికి అనుజ్ఞ ఇవ్వు."

గాలవునిపై ఎంత కోపం వున్నా యయాతి అతిథిసత్కారాన్ని మర్చిపోవ టానికి వీల్లేదు. "ఇవాళ మా నగరులో విశ్రాంతి తీసుకుని వెళ్ళండి. కోపంలో నేనన్న మాటలకు నన్ను క్షమించండి. ఇది మీ వద్ద వుంచండి" అని వరహాలతో నిండిన సంచిని అతని చేతికిచ్చాడు.

అంతఃపురంలో దేవయానికి యయాతి జరిగినదంతా వివరించాడు. మాధవి తిరిగి వచ్చిందని దేవయానికి ఆశ్చర్యం, అసూయ. కూతురికి స్వయంవరం ఏర్పాటు చేసే విషయం చెప్పినప్పుడు అడ్డుచెప్పింది దేవయాని.

"నలుగురు పిల్లల తల్లి అంటున్నారు. అలాంటిదానికి స్వయంవర మేమిటి? సిగ్గుచేటు."

"అది నలుగురు పిల్లల తల్లి అని మనం చెప్పుకుని తిరగనక్కర్లేదు కదా!"

"చెప్పకపోయినా, ఇవాళ కాకపోతే రేపు తెలీక మానదు."

"నువ్వూరుకో దేవయానీ. ముందు నీ మాట విని మాధవిని అడవు లకు పంపాను. ఒక తప్పు చేశాను. అది దిద్దుకోవటానికి నాకో అవకాశమివ్వు. తండ్రయిన వాడి కర్తవ్యం నేను. నిర్వర్తిస్తాను. స్వయంవరం ఏర్పాటు చేసి ఆమెకు శాస్త్రోక్తంగా వివాహం చేస్తాను."

దేవయాని మండిపడుతూ చూసింది భర్తను.

• • • •

మాధవి అంతఃపురంలోకి అడుగుపెట్టింది. లోపలకు పోవటానికి భయం వేసింది. ఓ పదిమంది సఖీజనం అటూ ఇటూ తిరుగుతున్నారు. అన్నీ కొత్త

ముఖాలే. తన గృహం పై రూపంలో ఎలాంటి మార్పూలేదు. తోటలో చెట్లుమరింత దట్టంగా పెరిగాయంతే. కొత్త వ్యక్తిని చూసి పరిచారికలు తమలో తామే గుస గుసలాడుతున్నారు. ఎవరో ఒకతె అడిగేసింది కూడా: "ఎవరమ్మా నువ్వు ?"

వీణ శ్రుతి చేస్తూ కూర్చున్న కమలముఖి చటుక్కున వెనక్కి తిరిగి చూసింది. ఆశ్చర్య సంతోషాలతో "రాజకుమారి" అని కేక పెట్టింది. ఆ కేక విని చారునేత్ర పరుగెత్తు కొచ్చింది. ఆమెకు ఎనలేని సంతోషం. ఆ సంతోషం పట్టలేక ఆమెను గట్టిగా కౌగలించుకుంది.

"చారునేత్రా, నన్ను వదులు" అంది మాధవి గద్గద కంఠంతో.

"ఆ రోజు ఇక్కడి నుండి వెళ్ళినప్పు డెలా గున్నావో అలాగే వున్నావు మాధవీ!"

"బయట రూపంలో కావచ్చు. నా అంతరంగమంతా విదీర్ణమయి పోయింది చారూ" అంటూ కంటనీరు పెట్టుకుంది మాధవి.

సఖీజనం చుట్టూ చేరారు. పరిచయం వున్నవాళ్ళు మాట్లాడారు.

"మాధవీ, ఏ ఊర్నుండి వచ్చావిప్పుడు ?"

"ఏ, ఏ దేశాలు చూసి వచ్చావు రాజకుమారీ?"

"మేమంతా ఇక్కడే వున్నాం."

ఈ గలభా విని అవ్వ "ఎందుకలా కేకలు పెడుతున్నారు?" అంటూ అక్కడికి వచ్చింది. మాధవిని చూసి "బిడ్డా!" అనేసరికి మాధవి వెళ్ళి ఆమె కౌగిలిలో ఒదిగిపోయింది.

మాటలు. ఏడుపు ఈ రెండిటికే స్థానం అక్కడ. అలా ఎంతసేపు గడిచిందో ఏమో ఎవరికీ తెలీదు. చివరకు అవ్వ అన్నది:

"చారునేత్రా, రాజకుమారికి వేన్నీళ్ళు సిద్ధంచేసి స్నానం చేయించు. అమ్మాయి అలసిపోయి ఉండాలి. నేను భోజనం సిద్ధం చేస్తాను."

తైలలేపనం. అదీ చారునేత్ర చేతిలో. అలాంటి సందర్భం మళ్ళీ తన జీవితంలో వస్తుందనికూడా అనుకోలేదు మాధవి. వేడినీళ్ళ స్నానం మనస్సును, శరీరాన్ని సేద తీర్చింది. భోజనానికి కూర్చుని "ఇంకొంచెం వెయ్యి అవ్వా" అని అడిగడిగి వేయించుకుంది.

హంసతూలికా తల్పం అప్పు డెలాగుందో అలాగే వుంది. మాధవి వెళ్లేముందు తీసిన ఆభరణాలు ఇంకా పీఠం మీదే ఉన్నాయి. ఆసనాలు, వస్త్రాభరణాలు వాటి స్థానాల్లో అవి వున్నాయి. ఇక్కడేమీ మారలేదు. మారిందల్లా నేనొక్కతనే అను కుంది మాధవి.

మధ్యాహ్నం నిద్రపోయి లేచాక చారునేత్ర మాధవి తలదువ్వి, సింగా రించింది.

"రాజకుమారీ, నాదో కోరిక వుంది. ఆరోజు నేను తీసిపెట్టిన ఆభరణాన్ని మళ్ళీ అలంకరిస్తాను. అనుజ్ఞ ఇవ్వు."

ముత్యాల పాపిడిచేరు, మాణిక్య కుండలాలు, బంగారు పతకం, మేఖల నవ రత్నాల చేతి కంకయాలు, కాళ్ళకు గజ్జెలు...అన్నీ తీసి మళ్ళీ తన రాజకుమారిని అలంకరించింది చారునేత్ర.

"నువ్వేమీ మారలేదు మాధవీ."

"మాధవి బాధగా నవ్వి "నా కథవిన్నాక కూడా నువ్వదే మాట అంటావేమో చూద్దాం ఉండు" అన్నది.

"నీ కథవద్దు. అయిదేళ్ళ క్రితం మనం మాట్లాడుకున్నామే అక్కడి నుంచే మళ్ళీ మొదలెడదాం పద" అంటూ చారునేత్ర ఆమెను తోటలోకి లాక్కునివెళ్ళింది.

రాత్రి అంతఃపురమంతా నిద్రించినా మాధవి, చారునేత్ర, అవ్వ కూర్చునే వున్నారు. మాధవి మాట కాస్సేపు నిలిపేసరికి చారునేత్ర, అవ్వల ఏడుపు మొద లయ్యేది. "అంతరంగమంతా విదీర్ణమయి పోయింది" అని మాధవి ఎందుకన్నదో ఇప్పుడు అర్థమయింది చారునేత్రకు.

మరునాడు సభకు బయలుదేరే ముందు యయాతి మాధవి అంతఃపురానికి వచ్చాడు.

"ఓ శుభసమాచారం చెబుదామని వచ్చాను మాధవీ. మాఘంలో నీ స్వయం వరం ఏర్పాటు చేస్తున్నాను. అయిదేళ్ళ క్రితం మాఘమాసంలో నీ వివాహం జరగాల్సింది. కారణాంతరాలవల్ల అది తప్పిపోయింది. ఈ మారు అందరు రాజ కుమారులకు లేఖ పంపుతున్నాను. నీ మనస్సుకు నచ్చినవానికి మాలవెయ్యవచ్చు."

[మాధవికి స్వయంవరమట!"

"అవునా?"

"ఊఁ, భూలోకపు రాజకుమారుల నందర్నీ పిలుస్తారట, గంగా యమునా సంగమంలో పెద్ద స్వయంవర మంటపం నిర్మిస్తారట!"]

ఎంతటి మార్పు! అప్పుడు ఆ మాట వినగానే తనువూ, మనసూ పులకరించేవి. ఇప్పుడు ఆ విధమయిన భావనలే తుడిచి పెట్టుకుని పోయాయి.

"వద్దు తండ్రీ. నాకెందుకు పెళ్ళి ?"

"వద్దు అనకమ్మా. క్షత్రియ ధర్మం నేను పాటిస్తున్నాను. లేకపోతే నాకు ముక్తి లభించదు."

మాధవి మౌనం వహించింది.

తండ్రి అలా వెళ్ళగానే మళ్ళీ ఆలోచనల చిక్కుముడి. ఈ మారు పెళ్ళయితే శాశ్వతంగా ఒక్కడితోనే జీవించాలి. ఒక్క సంవత్సరంతో తెగిపోయే బంధం కాదిది. పెళ్ళి అంటే ఏమిటి? అతనితో పడుకోవటం, పిల్లల్ని కనటం. దీనినుంచి తనకు విముక్తి లేదా? నిజానికి వైవాహిక జీవితంపై తనకు జుగుప్స కలిగింది. ఈ మమతా బంధాన్ని ఛేదించటానికి ప్రయత్నం చేసి చేసి అసలు ఈ జీవితంలో ఇంకేమీ వద్దు. ఒంటరిగా, ఎవరి కంటాపడకుండా ఇలానే ఉండిపోవాలన్న కోరిక తనను కాల్చుకు తినేస్తోంది.

యయాతి మాటలు వినిపించుకున్న చారునేత్ర అక్కడికి వచ్చి అంది:

"ఈ మారు మాత్రం నీతో నేను తప్పకుండా వస్తాను."

"ఎక్కడికి?" అంది మాధవి కంగారుగా.

"నీ రాజకుమారుడి గృహానికి. మరెక్కడికి?"

"చూద్దాం. నేను పెళ్ళి చేసుకున్నప్పటి మాటకదా అది?"

"అదెందుకలా అంటావు? స్వయంవరానికి ఏర్పాట్లన్నీ జరిగిపోతున్నాయి."

"కావచ్చు. రాజకుమారుడు నాకు నచ్చాలి కదా చారూ?"

"నచ్చి తీరతాడు" చాలా నమ్మకంగా అంది చారునేత్ర.

నగరం ఈశాన్య దిక్కున ఎత్తూ పల్లాలు లేని మైదానంలో స్వయంవర మంటపం నిర్మించారు. మంటపం చుట్టూ రాజులు విశ్రాంతి తీసుకోవటానికి పెద్ద పెద్ద భవనాలు, భవనాల చుట్టూ ఎత్తైన గోడలు.

స్వయంవర మంటపాన్ని రంగురంగుల తోరణాలతో అలంకరించారు. చందనం, జవాది మిశ్రితమయిన పరిమళోదకాన్ని మంటప మంతటా చిలకరించారు. మల్లె, చామంతి, జాజి, సంపంగి, మొదలయిన సుగంధ పుష్పాలమాలలతో నయనమనోహరంగా సింగారించారు.

స్వయంవరం రోజున మొదటి జామునుండి మంగళ వాద్యాలు మ్రోగనారంభించాయి. మంటపంలో వేణు వీణా మృదంగ వాద్యాల సుమధుర నినాదం వ్యాపించింది. స్వయంవరాన్ని చూడటానికి ప్రజలు తండోపతండాలుగా వచ్చారు. మాధవిని వరించాలని ఉత్సుకతతో వచ్చిన రాజకుమారులు దివ్యాభరణాలతోనూ, దివ్యాంబరాలతోనూ, చందనం, జవాజి మొదలైన సుగంధ ద్రవ్యాలతోనూ మెరిసిపోతూ తమ తమ ఆసనాల్లో ఠీవిగా కూర్చున్నారు.

మంగళ స్నానం చేసిన మాధవి, సర్వాభరణాలను ధరించి, బంగారు జలతారుతో మెరిసిపోతున్న పీతాంబరాన్ని కట్టుకుని, జయమాలను చేతపట్టుకుని, మందగమనంతో చారునేత్ర తోడురాగా స్వయంవర మంటపం ప్రవేశించింది. ఆమె వెనకాల యదువు, ద్రుహ్యుడు, పురువు వస్తున్నారు.

మంగళవాద్యాలు మ్రోగుతూండగా పురోహితులు యథావిధిగా పరిస్తరణ పూర్వకంగా యజ్ఞేశ్వరుని ప్రతిష్ఠించారు. పీడా పరిహారకాలయిన మంత్రాలతో ఆజ్యాహుతి కావించి, అక్కడ చేరిన బ్రాహ్మణులచే స్వస్తివాచనం చేయించారు.

అప్పుడు యయాతి మంగళవాద్యాలను ఆపమని, అక్కడ చేరిన రాజకుమారులతో గంభీరధ్వనితో ఇలా అన్నాడు.

"రాజకుమారులారా! అపూర్వరూపవతి, సద్గుణ సంపన్నురాలు అయిన నా కూతురు మాధవి ఇవాళ మీలో ఒకర్ని వరించ బోతోంది. మా రాజ్యానికి విచ్చేసిన మీకు స్వాగతం."

వారి జయజయ నినాదాలు ఆకాశాన్నంటాయి.

మాధవి అడుగుపెట్టేముందు, ఉన్నట్టుండి ఉచ్చైస్స్వరంతో అన్నది:

"నేను ముగ్గురు రాజులతోనూ, ఓ ఋషితోనూ, ఉండి వచ్చాను. నన్ను వివాహమాడటానికి మీకేం అభ్యంతరం లేదా?"

ఆ మాట విని కూతురిపై పట్టరాని కోపం వచ్చింది యయాతికి. రాజ కుమారులకు ఆమె మాట అర్థం కానేలేదు. కన్య రాజులతో, ఋషులతోనూ ఉండి రావటమేమిటి? అని తమలో తామే చర్చించుకున్నారు. అలా అంటే బహుశా ఈ కన్య మూడు రాజ్యాలనూ, ఋష్యాశ్రమాన్ని చుట్టి, తన అనుభవాన్ని పెంచుకుని వచ్చినది అనే నిర్ధారణకు వచ్చారు. ఇలాంటి తెలివి తేటలున్నదే మహారాణిగా ఉండటానికి తగినది అని నిశ్చయించుకున్నారు. అందుకే ఏక కంఠంతో—

"ఏమీ అభ్యంతరం లేదు. నిన్ను చేపట్టటమే మహాభాగ్యం" అన్నారు.

ఛీ మగజాతి! అని జుగుప్స చెందింది మాధవి. పాపం చేయటమంటే లెక్క లేదు వీళ్ళకు. పాపానికి తగిన పరిహార మార్గాన్ని కూడా వెతికి పెట్టుకునే ఉంటారు. వీరినుండి దూరంగా పోతే తప్ప తనకు విముక్తి లేదు.

చారునేత్ర మొదటి రాజకుమారుని వద్ద నిల్చుని చెప్పింది:

"రాజకుమారీ, ఇతను కుంతల రాజకుమారుడు. మహా శూరుడు, వంద గుర్రాలతో ఒక్కడే యుద్ధం చేయగల సామర్థ్యంగల కలి."

కుంతల రాజకుమారుడు గర్వంతో విర్రవీగుతూ మాధవి వేపు చూశాడు. ఆమె అతనివేపు తిరస్కారంగా చూసి ముందుకు నడిచింది.

"ఇతడు మగధ మహారాజ కుమారుడు. బుద్ధిలో ఇతనికి సమానులు లేరు. వేదాలు ఇతనికి కరతలామలకం. పాండిత్యంలో బృహస్పతికి సమానుడు."

మాధవి ముందుకు నడిచింది.

"ఇతను పాంచాల రాజపుత్రుడు. రూపంలో మన్మథుడు. శృంగార కోవిదుడు."

"ముందుకు పద చారునేత్రా."

పాంచాల రాజపుత్రుడి మొహం చిన్నబోయింది.

“వంగరాజ కుమారుడయిన ఇతను రాజ్యాంగ కార్యంలో అత్యంత నిపుణుడు. శత్రు సైన్యానికి ఇతడు మార్తాండుడు, వ్యూహ రచనలో ఇతనికి సమానుడయినవాడు ఈ భూమండలంలోనే లేడు.”

“కళింగ రాజపుత్రుని విషయం చెప్పనా మాధవీ. ఇతను సుకుమారుడు, ఉదారుడు, వినయవంతుడు. నీతిమంతుడు...”

[“ఈ అన్ని గుణాలు కలవాడు ఈ ప్రపంచంలో ఉంటాడా మాధవీ?”

“ఉండవచ్చును చారునేత్రా. అతను ఏకపత్నీ వ్రతుడు కూడా అయుండాలి. నన్ను తప్ప మరొకదాన్ని అతను కన్నెత్తి కూడా చూడకూడదు.”]

మాధవి నిట్టూర్చి ముందు కడుగు వేసింది.

“వీతిహోత్ర రాజకుమారు డితను...”

మాధవి నడక వేగం హెచ్చించింది. ఓ గడియలోనే అక్కడ చేరిన రాజకుమారుల వర్ణన అంతా అయిపోయింది. జయమాల మాత్రం మాధవి చేతిలోనే ఉంది. “ఇదేం పిచ్చి! ఎవరో ఒకరి మెడలో మాల వేయటం మానేసి అలా వెళ్ళిపోతోంది. ఇంత మాత్రానికి మనల్నెందుకు పిలవటం?” అని రాజకుమారులు తమలో తాము మాట్లాడుకున్నారు.

మాల పట్టుకున్న మాధవి తండ్రి వద్దకు వచ్చింది. యయాతి ఆదుర్దాతో అన్నాడు.

“తొందరలేదు అమ్మాయీ! ఇంకోమారు రాజకుమారులను చూసిరా. ఓ క్షణంలో తీసుకునే నిర్ణయం కాదది.”

మాధవి చిరునవ్వు నవ్వింది. మనస్సులో అప్పటికే ఓ నిర్ణయానికి వచ్చినందువల్ల ఆమె ముఖం ప్రశాంతంగా ఉంది. స్థిరమైన స్వరంతో ఆమె అంది.

“తండ్రీ, ఇంతకు ముందెన్నడూ నాకు నా భవిష్యత్తు నిర్ణయించుకునే అవకాశం రాలేదు. ఇప్పుడు ఆ హక్కును నా కిచ్చారు. నా ఇష్టం వచ్చినట్టు నేను చేయవచ్చుకదా? తండ్రీ. నాకీ స్వయంవరం వద్దు. నేనెవర్నీ పతిగా వరించలేను. నా శరీరాన్ని నలుగురు భోగించి సుఖపడ్డారు. పరలోకం బాధ నాకు లేదు. నేను ఆత్మోద్ధారానికి అడవికి వెళ్ళి తపస్సు చేసుకుంటాను. వనమే నా వరుడు! నన్ను వదిలెయ్యండి.”

అలా అంటూ మాధవి పూలమాలను విసిరిపారేసి వారందర్నీ తిరస్కరించి మంటపం దాటి అరణ్యం వేపు నడిచింది.

చారునేత్ర ఏడుస్తూ "మాధవీ, నీతో నేనూ వస్తాను" అని కేక పెట్టింది.

నడక ఆపకుండానె మాధవి జవాబిచ్చింది:

"వద్దు. నాకెవ్వరి తోడూ అక్కర్లేదు. పుట్టినప్పుడు ఒక్కదాన్నే వున్నాను. ఇక ముందూ అంతే!"

ప్రపంచాన్నే ధిక్కరించి పెద్ద పెద్ద అంగలువేస్తూ అడవిలోకి నడిచిన మాధవిని ఆపే శక్తి ఎవరికీ లేకపోయింది, స్వయంవర మంటపంలోని వారంతా అవాక్కయి ప్రతిమల్లా కూర్చున్నారు.